సి. వేదవతి

# తెలుగు వెలుగు



ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడెమీ

ఆర్థిక సహాయముతో ప్రచురితము

Rs. 15/-

---

**TELUGU VELUGU by C. Vedavathi**

**Spandana Saahithee Samaakhya Publication No. 31**

April 1981 RUPEES FIFTEEN

**Title Design by Seela Veerraju**

Printed at Sri Bharathi Press, Machilipatnam.

---

ప్రతులకు

స్పందన సాహితీ సమాఖ్య
(రిజిష్టర్డ్)
26–162, బుట్టాయిపేట
మచిలీపట్టణం–521001

సి. వేదవతి
గోకుల్ 45, ఎల్.ఐ.సి. కాలనీ
మెహిదీపట్నం
హైదరాబాదు-5 0028

(1)

# తెలుగు వెలుగు తెరవక ముందు...

"దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్!"

అనే కవి వాక్యం జ్ఞాపకం తెచ్చుకుంటూ ఆత్మ విమర్శ చేసుకుంటూనే ఉన్నాను-ఈ వ్యాసాలను కథా కథనాలుగా చిత్రిస్తూ-

కాని, ఇవి వట్టి గొప్పలు కావు-గట్టి గాథలే-అనే నమ్మకం ఏర్పడి-

జన్మతో సంక్రమించిన తెలుగు తనం గుండె గొంతుకలో కొసరి కొసరి కొట్లాడగా-

ఆ తేట తేనియ తీయదనాన్ని అందరి తోనూ పంచుకోవాలనే ఆకాంక్షతో-

ఈ 'తెలుగు వెలుగు'ను వెలువరించాను.

గతంతో మాకు నిమిత్తం లేదు-సంస్కృతి, సంప్రదాయం, ఇవన్నీ పాత చింతకాయ పచ్చడి కబుర్లు-అంటారు కొందరు.

పాత చింతకాయ పచ్చడి కూడా, పడి లేచినప్పుడు పథ్యానికి పనికి వస్తుందనీ, సమాజంలో నైతిక విలువలు తల్లక్రిందులై, సంక్షోభం చెలరేగినప్పుడు, గతంలోని మంచిని అనుపానంగా సేవించక తప్పదనీ నా భావన.

సంప్రదాయపు శృంఖలాలను ఛేదించుకుని-కొత్త బాటలు వేసుకుంటాం-పాత అంతా రోత-కొత్త అంతా గొప్ప-అంటారు మరికొందరు.

అవి ఎంత పూలదండల వంటివైనా, శృంఖలాలు అవశ్యం విదిలించుకోవలసిందే। ప్రగతి పథానికి క్రొత్త బాటలు వేసుకోవలసిందే। కాని క్రొత్త బాటలు వేసుకునే ముందు, పాతపుంతకు పునాది ఏమిటో తెలుసుకోవటం తప్పని సరి-అని నేను అంటాను. పాత విలువలను పాతి పెట్టటమే ప్రగతి-అనే వారితో నేను ఏకీభవించలేను.

నేటి తెలుగు వారి సాంఘిక జీవనంలో-ఒకమార్పు, ఒక వేగం-కొట్టవచ్చినట్లు కనిపిస్తూ ఉంది. పరుగెత్తుతూ పాలు తాగుతున్నామేమో అనిపిస్తుంది ఒకొక్క సారి. మనదైన ఒక మంచి ఒరవడి మనకు ఉండగా-మనం దానిని మరిచిపోవటం ఎందుకు ? మన పిల్లలకు ఆ ఒరవడి ఏమిటో తెలియ నీయకుండా పెంచుకోవటం ఎందుకు ?

మేము తెలుగు వాళ్ళం-అని చెప్పుకోవటమే నామోషీ అనుకునే వారిని చూస్తే ఎంతో బాధ కలుగుతుంది.

మన పాత ఆచారాలు, పద్ధతులు-మారుతున్న మన సామాజిక జీవనంలో ఇమడక పోవచ్చు. నేటి వైజ్ఞానిక యుగంలో అవి అర్థవిహీనాలుగా తోచవచ్చు.

సంప్రదాయం పేరుతో మూఢాచారాలను అనుకరించి ప్రోత్సహించటం ప్రగతి నిరోధకం. కాల గమనంతో పాటు 'మార్పు' అనేది సహజమైన విషయం కనుక మన సంప్రదాయపు విలువలు కూడా మారుతున్నాయని చెప్పవచ్చు.

అయితే__

స్వధర్మాన్నీ, సత్సంప్రదాయాన్నీ-వి స్మ రి ం చి-ఇతరులను అనుకరించ బోవటం ఆత్మద్రోహం అవుతుంది.

తెలుగు వారికి గొప్ప చరిత్ర ఉంది. ఒక ఆదర్శ ప్రాయమైన విశిష్ట సంప్రదాయం ఉంది. పరిపుష్టమైన సంస్కృతి ఉంది- దేశ భాషలలో ఎన్నికైన తీయనిభాష తెలుగు. సాహిత్యంలో, సంగీతంలో, ఇతర లలిత కళలలో, రాజనీతిజ్ఞతలో, పరిశ్రమలలో, వైజ్ఞానిక వికాసంలో తెలుగు జాతికి చెప్పుకో తగినంత పురావైభవం ఉంది.

పునశ్చరణ అనిపించుకున్నా ఫరవాలేదనే ధైర్యంతో తెలుగు జాతికి సంబంధించిన విషయాలు తవ్వి పోసిన ఈ వ్యాస సంకలనాన్ని-తరం మారిన నవతరం ముందు ఉంచుతున్నాను.

నన్ను ఇంతగా కదలించుకున్న తరతరాల తెలుగు గాధ-వెన్నెల సోనగా వెలార్చుకొన్న ఈ 'తెలుగు వెలుగు' ను రసజ్ఞలోకానికి సవినయంగా సమర్పిస్తున్నాను.

సి. వేదవతి

# కృతజ్ఞతలు

ఈ వ్యాసాలు నా చేత వ్రాయించి–'ఆంధ్రప్రదేశ్' ప్రత్యేక సంచికలలో వెలువరించిన శ్రీ కుందుర్తి ఆంజనేయులు గారికీ, ఇతర సావనీర్ సంపాదక వర్గాల వారికీ-

సారస్వత మూర్తి శ్రీ నండూరి వెంకట సుబ్బారావు గారి సాహిత్య వ్యక్తిత్వాలను గూర్చిన వ్యాస రచన పోటీలో నాకు బహుమతి ఇచ్చి ప్రోత్సహించిన యు వ భా ర తి - హైదరాబాదు వారికీ-

చారిత్రిక మైన అంశాలను కొన్ని వ్యాసాలకు సమకూర్చి, వాటికి సమగ్ర స్వరూపం ఇవ్వటంలో నాకు తోడ్పడిన శ్రీ కె. ఎస్. ఆర్. మూర్తి గారికీ—

చెప్పదలచుకున్న దానికి వాడీ వేడీ ఇవ్వటం కోసం అక్కడక్కడా నేను వాడుకొన్న పద్యాలు, పదాలు– రచించిన పూర్వ, ఆధునిక కవులకూ, జానపద వాగ్గేయ కారులకూ—

'తెలుగు వెలుగు'ను తమ స్వంత ప్రచురణగా వెలువరించిన స్పందన సాహితీ సమాఖ్య వారికీ—

అందుకు దోహదం చేసి, పుస్తక ప్రచురణకు నాందీ వాక్యం పలికిన ఆప్తమిత్రుడు, స్పందనకు ముఖ్యకార్యకర్తా, రచయితా శ్రీ బూదరాజు శ్యామ సుందర్ గారికీ—

భాషాభిమానం బ్రతుకులో భాగంగా, ఉత్సాహం ఊపిరిగా, స్పందన సాహితీ సమాఖ్యకు సారథ్యం వహిస్తూ, ఈ తెలుగు వెలుగు ను ఇంత అందంగా తీర్చిదిద్ది, వెలుగులోకి తేవడానికి ఎంతో శ్రమించిన మంచిమిత్రుడు శ్రీ గుత్తికొండ సుబ్బారావుకూ—

ఈ వ్యాసాలను చదివి, తమ అమూల్యమైన అభిప్రాయాన్ని అందజేసిన విదుషీమణి, నేను ఎక్కువగా అభిమానించే శ్రీమతి మాలతీ చందూర్ గారికీ—

పుస్తక ప్రచురణ కోసం ఆర్థిక సహాయం అందచేసిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికీ—

తెలుగు వెలుగును తేట తెల్లం చేసే విధంగా ముఖ పత్ర రచన చేసి ఇచ్చిన శ్రీ శీలా వీర్రాజు గారికీ—

నేను ఏది వ్రాసినా, ప్రచురించినా, అందుకు తగిన ప్రోత్సాహం, చేయూత-అందించి, నాకు కొండంత అండగా నిలిచే సౌజన్య మూర్తి-మావారు శ్రీ కృష్ణారావు గారికీ—

పుస్తకాన్ని సకాలంలో చక్కగా ముద్రించి ఇచ్చిన శ్రీ భారతీ ప్రెస్-మచిలీపట్నం వారికీ—

అందరికీ నా కృతజ్ఞతాంజలి.

సి. వేదవతి

# మామాట

'స్పందన' తనదయిన కార్య నిర్వాహణా శక్తినీ, సాధన సంపత్తినీ సమకూర్చుకుని సాహితీ ప్రియుల మన్ననల్ని పొందుతోంది. మేము ఇప్పటి వరకూ వెలువరించిన 30 ప్రచురణలూ ముద్రణ విషయంలోనూ, వస్తుగతంగానూ సంతృప్తికరమైన ప్రమాణాల్ని సంతరించుకుని వున్నట్లు విమర్శకులు, ప్రముఖులు ప్రోత్సహించారు. మా ప్రచురణలు అన్నింటికీ తెలుగు పాఠకలోకం ఆదరణ లభించింద.

'తెలుగు వెలుగు' మా 31 వ ప్రచురణ. వస్తుగతంగా వున్నత ప్రమాణాలు నింపుకున్న, వ్యాస సంపుటి యిది. తెలుగువారి సాంస్కృతిక జీవితానికి అద్దం పట్టే విధంగా యీ వ్యాస సంపుటిని తెలుగు పాఠక లోకానికి సమర్పిస్తున్నాము. రచయిత్రి శ్రీమతి సి. వేదవతిగారికి మా కృతజ్ఞతాభివందనాలు !

మా యీ అనంత చైతన్య యాత్రలో యెందరి సహకారమో అందుతోంది. వారందరికీ మా అభివందనాలు.

స్పందన సాహితీ సమాఖ్య

# ముందుమాట

“అభిమానంలో గుప్తమైన అధికారమున్నది గనుక విజ్ఞప్తులే ఆజ్ఞలు అవుతాయి.” అంటారు పూజ్యులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు. వారు నాపైగల అభిమానంతో శ్రీమతి వేదవతీదేవి పుస్తకానికి పీఠిక రాయమని–అన్నపుడు, ‘ఆమెని గురించి విన్నాను గాని ముఖ పరిచయం కూడా లేదు. ఒక అపరిచితురాలి గ్రంథానికి పీఠిక ఎలా రాయను?’ అని ప్రశ్నించాను.

దానికి శ్రీ గోపాలరెడ్డిగారు–“పీఠిక రాసేది గ్రంథానికి గాని మనిషికి కాదు. పరిచితులైన వ్యక్తుల, స్నేహితుల పుస్తకాలకి పీఠిక రాస్తున్నపుడు–మీ ఆలోచనా విధం కొంత వరకు

వ్యక్తిగత అభిమానానికి లోనవుతుంది. గ్రంథ కర్తతో పరిచయం లేకుండా-కేవలం గ్రంథాన్ని మటుకే చదివి పీఠిక రాసినపుడు—ఆ పీఠిక, సరళం గానూ, న్యాయబద్ధంగానూ వుంటుంది. వ్యక్తిగత మైన యిష్టా అయిష్టాలకి – అతీతమైన పరిశీలనా దృష్టితో రాయగలుగుతారు." అన్నారు. విజ్ఞులు, అపారమైన ప్రపంచానుభవం గలవారు అయిన శ్రీ గోపాలరెడ్డిగారి మాటల్లో స్థిరమైన సత్యం యిమిడి వుంది.

పుస్తకాలకి పీఠిక రాయటం, సభావేదిక లెక్క- వుపన్యాసాలు యివ్వటం నాకు చేతకాదు. నాకు నేనుగా ఏర్పరుచుకున్న నియమాలకి వ్యతిరేకం కూడాను. ఇన్నిటిలో నుంచి, శ్రీ గోపాలరెడ్డిగారి ఆజ్ఞని త్రోసిపుచ్చ లేక-యీ పీఠిక రాయటానికి వొప్పుకొని, పుస్తకం తెరచి చదవటానికి వుపక్ర మించాను.

అయితే అప్పటిదాకా నాలో వున్న సంశయాలు, సంకోచాలు మొదటి పేజీ నుంచే మాయమై పోయాయి. శ్రీమతి వేదవతిగారి 'తెలుగు-వెలుగు' వ్యాస సంపుటిలో-కథలూ, నవలలకీ మించిన ఒక భావోద్వేగం, చదివించ గల చక్కని శైలీ వున్నాయి.

3

ప్రతి మనిషికీ-బాల్యయవ్వనాల్లో ఎటువంటి ప్రశ్నలూ కలగక పోయినా, మధ్యవయస్సువచ్చి, జీవన భారం నెత్తిన పడేసరికి- 'తానేమిటి? తన వారెవరు? తన సంస్కృతి ఏమిటి?' అనే ప్రశ్నలు కలుగుతాయి. ఈ రకమైన జిజ్ఞాస మనిషి పెరుగుదలలో మొదటి మెట్టు. ఇలా మెట్టు మెట్టూగా మన తెలుగు సంస్కృతికి సోపానాలు నిర్మించుకుంటూ వెళ్ళారు శ్రీమతి వేదవతి.

పుస్తకంలోని తొలివ్యాసం 'ముచ్చటలు' చదువుతున్నపుడు, యిది సాధారణంగా పత్రికల్లో వస్తున్న-యీనాటి స్త్రీల శీర్షికలోని వ్యాసంలా వున్నదే అనిపించింది తొలిక్షణంలో! పెండ్లి ముచ్చట, అప్పగింతలు నుంచి, వధువు శైశవం నుంచి-మళ్ళీ మాతృమూర్తి అయేదాకా, ఒక్కసారి భావనా ప్రపంచంలోకి జ్ఞాపకాల మడతల్లోకి తీసుకొనిపోయారు రచయిత్రి పాఠకుని వధువు తల్లితో పాటు! చాలా రోజుల క్రితం, రెండు దశాబ్దాల క్రితం, నోబెల్ బహుమతి గ్రహీత, ప్రపంచ ప్రఖ్యాత నవలా కారిణి అయిన పెరల్ బక్ 'సెవెన్ ఫేసెస్ ఆఫ్ ఎ వుమన్' 'Seven faces of a woman' అను చిన్న పుస్తకం చదివాను. ఆ రోజున అనుకున్నాను. స్త్రీ జీవితం ఒక బండి

చక్రం లాంటిది. ఈ జీవన బాటలో గిర్రున తిరుగుతూ, బయలు దేరినచోటికే మళ్ళీ మళ్ళీ వస్తుంది. ఇటువంటి వస్తువుతో ఒక చక్కని నవలగాని, కథగాని రాయచ్చు అని! ఈ నాడు వేదవతిగారి 'ముచ్చటలు' చదువుతుంటే-ఎప్పటిదో అయిన నా స్వప్నం యీ మెకలంలో నిజమయింది అనిపించింది.

శ్రీమతి వేదవతిగారికి మన సంస్కృతిమీద, ఆచారాలమీద ముఖ్యంగా తెలుగుభూమి మీద అపారమైన ప్రేమ. ఈ ప్రేమతో పాటు శ్రీనాథ మహాకవి పట్ల ఎంతో అభిమానం. ఈ రెండిటి సౌరభాన్ని పుస్తకం నిండా పన్నీటి జల్లువలె కురిపించారు. 'తెలుగు వెలుగు' చదువుతుంటే ఈ సౌరభం పాఠకులని చుట్టబెడుతుంది.

స్త్రీ జీవితంలోని-అందులో ముఖ్యంగా తెలుగు ఆడబడుచు జీవితాన్ని, యీమె రమ్యంగా-అటు జానపదగేయాల నుంచి ఏరిన భావకుసుమాలతో, ఇటు సాహిత్య సంపదతోనూ మిళితంచేసి, అతి రమ్యంగా చెప్పుకొచ్చారు. ఈ రమ్యతలో ఆమె నందూరివారిఎంకినీ, మునిమాణిక్యంవారికాంతాన్ని యిద్దరినీ స్త్రీత్వంతోనే గాక-తెలుగు తనంతో ముడివేశారు.

కృష్ణదేవరాయల 'ఆముక్త మాల్యద,' శ్రీనాథుని చాటువులు, ఎంకి పాటలు, ఆనాడు బామ్మగారు ధరించిన ఏడు వారాల సొమ్ములు, మన ఇతిహాసాల లోని సంఘటనలూ, లలితకళలు, ఆటలు, అలనాటి చీరెలు, నోములూ వ్రతాలే కాకుండా- వెయ్యేళ్ళ ఆంధ్రజాతి చరిత్రను - అందులో అంతర్లీనమైన స్త్రీమూర్తినీ గురించి- లలితంగా, సరళంగా- చెప్పారు.

కథలూ నవలలూ ఈనాడు అందరూ రాస్తున్నారు. అందుకు భిన్నమైన గ్రంథం యీ 'తెలుగు వెలుగు'. తనలోని భావ కుసుమాలను తన తోటి సోదరీమణులతో పంచుకోవాలన్న తపనతో రాసిన యీ గ్రంథం, తానెవరో తెలుసుకునేందుకు ఆంధ్రవనితకు దోహదం చేస్తుందని నమ్ముతున్నాను.

మాలతీ చందూర్

6

# ఇందులో ఇదీ వరుస

చిరు నవ్వులో సిరులు దొరలించు

మా తల్లి తెలుగు తల్లికి

ఈ చిరు దివ్వె వెలుగు

తెలుగు వెలుగు

అంకితం

౧

# ము చ్చ ట లు

ఎంత సందడి! ఎంత సంబరం! నట్టింట్లో అమ్మాయి పెళ్ళి జరుగుతూ ఉంది.!

ఆకాశమంత పందిరీ,భూదేవంత అరుగూ కాకపోయినా స్థితికి తగినట్లు పెళ్లి పందిరి వేశారు. పందిరి స్థంభాలకు కొబ్బరాకులూ, రంగురంగుల కాయితాలు- చుట్టారు. చుట్టూ మామిడాకుల తోరణాలు కట్టారు. నేలంతా చక్కగా అలికి, కాలు పెట్ట సందు లేకుండా ముగ్గులతో నింపారు. కళ్యాణ వేదిక కన్నులపండువుగా, పూలమాలలతో, చెమ్కీ జాలరులతో అలంకరించారు. శుభసూచకంగా పందిరికి నాలుగు వైపులా అరటి పిలకలు కట్టారు, చవులు గొలిపే ముత్యాల చలికెలా- పెళ్లి అరుగును అలంకరించారు. బంధుమిత్రులంతా కదిలి వచ్చారు. మేళతాళాల మధ్య శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. విందు భోజనాలూ ముగిశాయి.

ఇంక అమ్మాయిని అంపకం పెట్టటం మిగిలింది. పిల్ల మెడలో మూడుముళ్లూ పడ్డప్పుడే ఆమె పరాయిపిల్ల అయి

పోయింది. ఆమె ఇహనుంచీ ఆ తాళి కట్టిన భర్తకు ఇల్లాలు. జీవితాంతం అతడిని అనుసరించి పోయే ధర్మపత్ని. అయినా, ఆమెను భర్తకూ, భర్త ఇంటివారికీ వప్పగింతలు పెట్టి అప్ప గించటం కన్నవారి విధి. పెళ్లి అవగానే జరిగే ఈ తంతు ఒక ఆచారం. ఒక ముచ్చట. హృదయాన్ని కదిలించే ఒక సన్నివేశం.

పసుపు బట్టలతో ఉన్న వరుడునీ వధువునీ పాన్పు మీద ఎదురెదురుగా కూర్చోపెట్టారు. చుట్టూ బంధువర్గం చేరారు. సన్నాయి మేళం సన్నగా, 'పోయి రాగదమ్మ జానకీ' – అంటూ రాగం అందుకుంది.

పెళ్లికూతురి అత్తమామలు, బావగార్లు, తోటికోడళ్లు ఆడపడుచులు, ఒకవైపున సిద్ధంగా నుంచుని ఉన్నారు.

వాళ్లకు ఆ పిల్లను వప్పగించుకోవటం ఒక విశేషమైన బాధ్యతగా ముచ్చటగా ఉంది. ఈ నవ వధువు ఇహ తమ ఇంటి గౌరవాన్ని నిలబెట్టే గృహిణిగా వస్తుంది. ఈ పిల్ల బరువు బాధ్యతలన్నీ ఇహనుంచీ తమవి.

ఆడపిల్లను కన్న ఆ తల్లికీ, తండ్రికీ–కళ్లనిండా తడి. ఎంత తుడుచుకున్నా ఆరని తడి. గుండెలనిండా బరువు, బిడ్డను కని, పెంచి, ఇంతదాన్ని చేశారు. ఇన్నాళ్లుగా పెనవేసుకున్న బంధం! ఎట్లా ఈ బిడ్డను పరాయి ఇంటికి పంపించటం! పంపించి, పిల్లను వదిలి ఉండటం!

పెళ్లికూతురి తోడబుట్టిన వాళ్లు చిన్నారి చెల్లెళ్లు, వాళ్ళు కళ్ళు తుడుచుకుంటున్నారు. ఆడుకోవటానికీ, కబుర్లు

చెప్పుకోవటానికీ, తమమీద అజమాయిషీ చేయటానికీ ఇహ అక్క ఉండదు! అక్క ఎప్పుడూ అక్కే-కాని-ఇహ ముందు నుంచీ ఇప్పటిలా ఇంత దగ్గరతనం ఉండదు! మొన్నొకరోజున అక్క కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ తమను దగ్గరకు తీసుకుని-

"బొమ్మరిళ్ళున్నాయి బొమ్మలున్నాయి
నేను ఆడేటి సాలలున్నాయి
నా మారుగా మీరు ఆడుకోరమ్మా!"

అంటూ వప్పగింతలు పెట్టింది!

పెళ్ళికూతురికి దుఃఖం పొంగుకు వస్తూఉంది. చెంపల మీదుగా కన్నీరు కారుతోంది. జీవితంలో ఇదొక చిత్రమైన మలుపు. ఇంతటితో-బాధ్యతలేకుండా-అమ్మ చాటున గడిపే బాల్యజీవితం ముగిసినట్లే! ముందుజీవితం బాధ్యతలమయం! అది ఎలాఉంటుందో! బరువులు, బాధలు, కష్టాలు, సుఖాలు, ఆనందాలు, ఆవేదనలూ-వీటిన్నిటితో నిండిన కావడికుండల వంటిది ముందున్న జీవితం, తన జీవితం ఎలాసాగబోతున్నదో! అమ్మను, నాన్నను, తోడబుట్టినవాళ్ళను- ఈ ఇంటిని, పరిసరాలను-వదిలి పోవటం ఎలాగ!

పెళ్ళికొడుకు-బయట నుంచి చూచేవాళ్ళకు ఉదాసీనంగా కూర్చుని ఉన్నట్లు కనిపిస్తున్నాడు కాని, అతనిమనస్సులోనూ చిత్రమైన భావాలు కదులుతున్నాయి. ఆభావాలు వర్ణించిచెప్పటం కాస్త కష్టమైన సంగతే! ఎదురుగాకూర్చుని ఉన్న ఆ పిల్ల తన వధువు. తన భార్య! అందరి ఎదుటాఆమె మెడలో తాళికట్టి, తాను ఆమెకు భర్త అయినాడు. పాపం,

వాళ్ళ వాళ్ళను వదిలిపెట్టి ఉండాలని కాబోలు-ఆ అమ్మాయి అంతగా దుఃఖపడుతున్నది. ఇహాముందు ఆమె తనకు సహధర్మచారిణి. తనతో రావటానికి, తనతో జీవితం పంచుకోవటానికి-ఆ పిల్లకు ఇష్టంలేదా ఏమిటి! ఏమిటో! ఈ ఆడవాళ్ళమనస్సు తెలుసుకోవటం కాస్త కష్టమైన సంగతే!

పెళ్ళికొడుకు తలఎత్తి చూచాడు. కూతుర్ని అప్పగింతలు పెడుతున్న మామగారి వదనంలో దైన్యం-తన ప్రాణంలో ప్రాణమైన వస్తువును పోగొట్టుకుంటున్నట్లు బాధ! అత్తగారి కళ్ళల్లో ఆరని తడి!

కుర్రవాడికి జ్ఞానోదయం అయినట్లయింది. తమ బిడ్డ తమ స్వంతం, తమ ఆస్తి! ఆ ఆస్తిని ఒక అయ్యచేతికి వప్పగించి వేస్తున్నారు. వాళ్ళకు బాధగా ఉండదా మరి! ఆ అమ్మాయికి కూడా ఆదే బాధఅయిఉంటుంది. ఆ కాటుక కళ్ళనిండా నిండి, బుగ్గల మీదకు జారే అశ్రువుల్ని తుడవాలని అనిపించింది పెళ్ళికొడుక్కి! కాని, ఎలా! ముళ్ళమీద కూర్చున్నట్లు తోచీతోచకుండా కూర్చొన్నాడు అతడు!

"ఎంతో గారాబాన ఎత్తిపెంచితిసీ
గొంతెత్తి గట్టిగా కోపించి యెరుగ
తల్లి చేతులలోను తండ్రి చేతులనూ
అల్లిబిల్లిగ పెరిగినమ్మా ఈ బిడ్డ
మీ పట్టిగాని ఇక మా పట్టిగాదు!"

ఎవరో పేరంటాండ్రు పాట ఎత్తుకున్నారు. జాలితో అందరి గుండెలు, బరువెక్కి పోయినాయి.

"నీలవేణిరో దాని నీట ముంచెదవో
పాలముంచెదవో నీ పాల వైచితిని !"

అంటూ ముందుగా అత్తగారికి అప్పగింత పెట్టింది కన్నతల్లి. ఇహనుంచీ అమ్మాయికి అమ్మ అయినా, అత్తగారైనా ఆవిడే !

"ఒక గడియ నన్విడిచి తానుండ లేదూ
ఇకమీద కాపురము ఎట్లు చేసెడినో !"

అంటూ ఒక్క గడియ అయినా తనని విడిచి ఉండలేని కూతురు ఎట్లా ఉండగలుగు తుందోనని బాధపడుతుంది. కూతురి సంగతి అలా ఉంచి-ముందు, తనెలా ఆమెలేకుండా ఉండటం !

"ఎన్నడు నిన్విడిచి ఎడబాయనైతి !
కన్నతల్లిరో నేను కడ తేరు టెట్లూ ! "

తల్లీ కూతుళ్ళది ఇద్దరిదీ ఒకటే బాధ ! ఆ కూతురు ఇంట్లో తిరుగు తుంటే ఎంత అందం ! ఎంత ముచ్చట !

"చిన్నపిణియ ముద్దు చేతులను బట్టి
వీణ నెవ్వారింక వాయించగలరు
వజ్రాల మూట నా వరహాల కోట
మురియుచు పాట లెవ్వారు పాడగలరు !
పేరంటముల కెవరు వెంటవచ్చెదరు!"

అంటూ ఆ పిల్ల చేసే చేష్టలన్నీ తలచుకొని తలచుకొని-ఆ వెలితిని పూరించుకోవటం ఎలా అని బాధ పడుతుంది. చివరకు తేరుకుని-

"అత్తమామల మాట అడుగు దాటకుమా
చిత్తము మెప్పించి చెలగుమో తల్లి !
పతిని దైవమ్ముగా భక్తితో నమ్మి
మతి మంతురాలివై మనుము మాయమ్మా !"

అంటూ పిల్లకు బుద్ధులు చెపుతుంది-

"పోయిరా ముద్దుల ముల్లె మా తల్లి
పోయిరావే చిలక మురిపెంపు మొలక "

అంటూ శిరస్సు మూర్కొని వీడ్కోలు చెపుతుంది.

తల్లికీ, బిడ్డకూ కన్నీరు ఆగటం లేదు. "ఆడపిల్ల పుట్టినప్పుడే ఆదరువు పుడుతుంది"....అని మనవాళ్ళు అంటారు. ఆ పిల్ల పుట్టినప్పుడు తొలిచూలు ఫలంగా ఇంట్లో లక్ష్మీదేవి అవతరించిందని ఆనందపడ్డారు. ఆడింది ఆటగా' పాడింది పాటగా-అల్లారు ముద్దుగా పెంచుకు వచ్చారు.

ఎదుగుతూ ఉన్న ఆడపిల్లకు అడుగడుగునా వేడుకలే! కలిగినంతలో-ఎన్ని వేడుకలతో పిల్లను పెంచుకున్నారు. పిల్ల పుట్టినప్పటినుంచీ, ఇప్పటి వరకూ-అంచెలంచెలుగా ఎన్నో వేడుకలు ! సరదాలు !

ఆ తల్లి కళ్ళలో నిలచిన నీటిబిందువు ముత్యంలా జారి పడింది. ఆవిడ మనస్సులో ఒక తెర లేచినట్లయింది. పసుపు బట్టలతో, నుదుట కళ్యాణపు బొట్టుతో, బుగ్గను చుక్కతో

పాదాల పారాణితో-ఎదురుగా కూర్చుని ఉన్న కూతురు ఆమెకు అద్దాలలో పిల్లగా కనిపించింది.

అవును! అ నాటి అద్దాలలో బిడ్డ! పురిటి స్నానం నాటి పొత్తిళ్ళలో పసి నలుసు! పిల్లలకు స్నానంచేయించి, సాంబ్రాణి ధూపం వేసి-బొట్టూ, కాటుకా పెట్టారు. ఎడం బుగ్గనా, గడ్డం క్రిందా-దిష్టికోసం-నల్ల సాదుచుక్క పెట్టారు. ముఖాన బొట్టు కాస్త పెద్దదిగా దిద్దారు. తాతగారు చేయించిన ఉంగరాలు-ఆ బుల్లి వేళ్ళకు తొడిగి, అ పసి చేతులకు బంగారు మురిడీ గొలుసులు తొడిగారు. మెడలో ఒంటిపేట పులిగోరు గొలుసు వేశారు. ఒంటిమీద సన్నటి మక్‌మల్ చుక్కల గౌను తొడిగారు. అవన్నీ అలంకరించిన బిడ్డను తన చేతుల్లో పెట్టేటప్పటికి-మమకారం ఆగక-తాంబూలర క్తిమతో ఎర్రగా అయిపోయిన పెదవులతో-పిల్ల బుగ్గల మీద ముద్దుల వర్షం కురిపించింది.

బారసాలనాడు పాపను పట్టుకొని, ఆయనగారితో కలిసి-పీటలమీద కూర్చునేటప్పటికి-తాను సిగ్గుల పెళ్ళికూతు రయిపోయింది. తండ్రినైనానన్న గర్వంతో, ఆయనగారు బిడ్డవంక చూస్తుంటే, తనకు ఎంత పొంగు! బ్రాహ్మణుడు వచ్చి, మంత్రాలు చదివి పూజ చేయించాడు. రాయిలేని బంగారు ఉంగరంతో-బియ్యంలో ఆయనగారు 'లక్ష్మి'! అని పేరు వ్రాస్తుంటే, తన మనస్సులో ఉన్నమాట ఆయనకెలా తెలిసిందా అని-తనకు ఆశ్చర్యంతో పాటు ఆనందం కలిగింది. ఆ తర్వాత ఇంటికి వచ్చిన బంధువులకు విందుభోజనాలు.

అందరూ బిడ్డను దీవించారు. తనను అదృష్టవంతురాలవని అన్నారు.

ఆ సాయంత్రం పిల్లను ఉయ్యాలలో వేసి పేరంటం చేశారు. కంటికి నిండుగా కనిపించే బొమ్మలూ, గిలకలూ—ఉయ్యాలకు కట్టి—అలంకారము చేశారు. పాపకు కొత్త చొక్కా తొడిగి, సొమ్ములు పెట్టి. ఉయ్యాలలో వేసి ఊపుతుంటే—పరవశత్వంతో తనకు వళ్ళు తెలియలేదు. ఈ బిడ్డ తనరక్తం. తన స్వంతం. ఈ ఆలోచన ఒక అపూర్వ అనుభవం!

"పాపాయి కన్నులు కలువరేకుల్లు
పాపాయి జులపాలు పట్టుకుచ్చుల్లు"

అంటూ, బిడ్డను చూచి, ఎంత మురిపెం చూపినా, తనకు తనివి తీరేది కాదు. బిడ్డ ఏడిస్తే, తనకు ఎంతో బాధ కలిగేది.

"చిన్నారి కన్నుల్లో కన్నీటి జల్లు
కన్నీరు చూపకే కరుగు నెడదల్లు"

అనుకుంటూ పాపను గుండెలకు హత్తుకునేది.

మూడో నెల వచ్చేసరికి, పిల్ల కాస్త వొళ్ళు చేసింది. కాళ్లూ చేతులూ ఆడిస్తూ, ఆటలు ఆడతూ ఉంది. తనను చూస్తే చాలు, గుర్తుపట్టి నవ్వుతుంది. 'అఁ....ఊఁ....' అనటం నేర్చింది.

స్నానం చేయించి, పక్క వేసి పడుకోబెట్టి, ఏదోపని చూచుకుని లోపలకు వెళ్ళి వచ్చేసరికి బోర్లా పడుతూ ఉంది. చేతులు పిడికిళ్ళు బిగించటం నేర్చుకుంది.

తన అత్తగారు పూర్వకాలం మనిషి. అన్నీ, ఆనవాయితీ ప్రకారం, ఆచారం ప్రకారం జరిగిపోవాలని అంటుంది. తొలి కాన్పు పిల్ల కనుక-ఉన్నంతలో అన్ని వేడుకలూ తప్పని సరిగా చేయవలసిందేనని చెప్పింది. ఆమె ఇష్ట ప్రకారమే-తన్మకి అన్ని వేడుకలూ జరిగాయి. మూడో నెలలో పిల్ల పిడికిళ్ళు బిగిస్తూ ఉందని ముద్దకుడుములు చేయించింది. బోర్ల పడుతూ ఉందని బొబ్బట్లుచేయించి, పేరంటం చేసి పంచి పెట్టించింది.

ఆరు నెలలు వచ్చేటప్పటికి పిల్ల బాగా తేలింది వళ్ళు చేసి ముద్దువస్తూ ఉంది. ఎత్తుకుంటే చేతిలో ఇమడక ఎగిరెగిరి పడుతూ ఉంది. అప్పుడే-అత్త, తాత-అంటూ మాటలు చెప్పబోతూ ఉంది. ఆ ప్రయత్నంలో-ఆ చిన్నారి నోరు అష్టవంకరలూ తిరుగుతూ ఉంది. అప్పుడు - ఇప్పటి లా చక్కెరకు కరువు లేదు. కనుక, చక్కెరపాకం పట్టించి-అచ్చులుగా పోయించి-చిలకలు తయారు చేయించారు. పిల్ల పలకబోయే ప్రతి పలుకూ, పంచదార చిలకలా తియ్యగా, ఆర్ద్రంగా ఉండాలి! పలుకులకు చిలుకలు పంచిపెట్టి పేరంటం చేశారు.

ఎనిమిదో నెల వచ్చేసరికి-పిల్లకు అన్న ప్రాశన చేసే ప్రయత్నం చేశారు. మళ్లా దగ్గర బంధువుల్ని పిలిచి, విందు భోజనాలు పెట్టి ఆ వేడుక పెద్ద ఎత్తున చేశారు. పిల్లకు తాతగారు-వెండిగిన్నె, గ్లాసు-చేయించి తీసుకొచ్చారు. ఆ

గిన్నెలోనే, ఆ తరువాత గోరు ముద్దలు కలిపి బిడ్డకు తిని పించేది. బంగారు ఉంగరం పాయసంలో ముంచి, తాతగారు పాపచేత నాకించారు. పూజదగ్గర పీటమీద పుస్తకం, పసుపు, డబ్బు, నగలు, కలం-ఇలా వివిధ సామగ్రి చేర్చిపెట్టారు. పిల్ల-వరుసనే అన్నిటి మీదికీ ఎగబడింది. అన్నీ తనకే కావాలంటుంది! లక్ష్మి, పార్వతీ, సరస్వతీ, ముగ్గురు తల్లుల కటాక్షమూ ఆపిల్లయందు ఉంటాలెమ్మని అందరూ సంబరాలు పడ్డారు. 'దీని దుంపతెగ! అసాధ్యురాలే!'.... అనుకుని మురుసుకున్నారు.

అప్పటికప్పుడే అమ్మాయి తడబడుతూ అడుగులు వేయబోతూ ఉంది. మంచాలనూ, కుర్చీలనూ పట్టుకుని లేచి పోతుంది. వాటి ఊతతో చిడిబుడి అడుగులు వేయనేర్చింది. ఇంకేం! అత్తగారు బియ్యం నాన బోసి పిండి కొట్టించి అరిసెలు వండించింది. అడుగులకు అరిసెలు-అంటూ వేడుక చేసి, ముత్తయిదువులను పిలిపించి పంచిపెట్టింది.

సంవత్సరం గిర్రున తిరిగి వచ్చేసింది. మొదటిసారి పాప పుట్టినరోజు పండుగ ఘనంగానే చేశారు. ముత్తయిదు వుల్ని పేరంటానికి పిలిచారు. దగ్గరి వాళ్ళకు భోజనాలు పెట్టారు. పిల్లకు తలంటి, పట్టుగౌను తొడిగి, నగలుపెట్టి, చేతులకు బంగారు గాజులు వేసేటప్పటికి మెరిసి పోతూ ఉంది. కుర్చీవేసి-పిల్లను కూర్చోపెట్టి, హారతి పట్టి పండుగ చేశారు.

సంక్రాంతి వచ్చిందంటే, భోగి పండుగ ఘనంగా చేసేవారు. రేగుపళ్ళతో సరికి సరిగా పైసలు కలిపి పిల్ల తల

మీద పోసేవాళ్ళు. పేరంటానికి వచ్చిన చిన్నపిల్లలకు ఆ పైసలు ఏరుకోవటం ఒక ఆట !

పిల్ల అల్లారు ముద్దుగా పెరుగుతూ ఉంది. ఇంట్లో అందరికీ తేనెలవాక అయిపోయింది. ముచ్చటైన మాటలతో మురిపిస్తుంది. బొట్టూ కాటుకా పెట్టించుకోవటం, షోకులు చేయించుకోవటం, ఇష్టం. మొత్తానికి ఆడపిల్ల-అనిపించుకుంది

మూడో ఏడు వచ్చాక పిల్లకు చెవులు కుట్టించారు. చిన్న ఒంటిముత్యం లోలకులు చేయించి, కంసాలిబత్తుడిని పిలిపించి పుట్టదగ్గర చెవులు కుట్టించారు. పిల్ల తలకాయ ఊపినప్పుడల్లా ఆ లోలకులు అందంగా కదులుతూ ముద్దుగా ఉండేది.

ఐదోఏట పిల్లకు అక్షరాభ్యాసం చేయించారు. ఈ లోపునే ఒక మంచిరోజు, తాత ముత్తవలు-పిల్లకు కంచిపట్టు పరికిణీ, చొక్కా కట్టపెట్టారు. ఈ వంకతో మళ్లా పేరంటం చేశారు. అప్పటి వరకూ గౌనువేసుకు తిరిగే పిల్లకు-పరికిణీ కట్టి, నాగరం పెట్టి జడ వేసి, జడచివర బంగారపు కుప్పెలు కట్టి, బొట్టూ కాటుకా దిద్దేసరికి-ముద్దులగుమ్మ లాగేఉంది.

అక్షరాభ్యాసం చేసిన దినం ఒక పండుగ. పంతులు గారిని ఇంటికి పిలిపించి పంచెలచాపు పెట్టి, పిల్లకు కొత్త పలకా బలపం కొని-'ఓం నమశ్శివాయః'-అంటూ అక్షరాభ్యాసం చేయించారు.

అప్పటినుండీ పిల్ల బడికి వెళుతూ ఉండేది. ఆరిందా అయింది. చదువులో చురకత్తిలా వేసుకు పోతుంది. ఇంటి

దగ్గర ఉంటే ఆట పాటలు, ఎందరో స్నేహితురాళ్ళు, చిట్టి లక్క పిడతలతో గుజ్జనగూళ్ళు వండుతుంది. తాటాకు బొమ్మలు కట్టి, వాటికి రంగురంగుల గుడ్డపీలికలు వల్లెవాటుగా చుటి, బొమ్మల పెళ్ళిళ్ళు చేస్తుంది.

ఆట పాట లయినాక, అమ్మను చుట్టుకు చుట్టుకు తిరుగుతుంది. పదకొండవ ఏడు వచ్చేటప్పటికి తాత ముత్తవలు పైట ఇచ్చే వేడుక జరిపారు. మంచిరోజున కొత్త పరికిణీ, జాకెట్టు, ఓణీ కట్టబెట్టి పేరంటం చేశారు. ఆడపిల్లకు తొలిసారిగా పైటవేయటం ఒక గొప్పఅనుభవం. ఓణీ వేసేటప్పటికి పిల్ల ఎంతో ఎదిగిపోయినట్లు అనిపించింది. తొలిసారిగా మంచిరోజు చూచి పైట వేయించారు కనుక, ఇహముందు ఎప్పుడు అవసరం వస్తే అప్పుడు పమిటలు వేసుకోవటం మొదలు పెట్టవచ్చునన్నమాట! జారిపోయే పమిటను మాటి మాటికీ సర్దుకొంటూ, పిల్ల హొయలు పోతుంటే ఎంతో నవ్వు వచ్చేది.

పిల్ల ముద్దబంతి పూవులా ఎదుగుతూ ఉంది. పద మూడేళ్ళు నిండుతాయనగానే వ్యక్తురాలయింది. తాటాకులు పరిచి, దానిపై తెల్లబట్ట పరిచి పిల్లను కూర్చోపెట్టారు. ముత్తయిదువులంతా పేరంటానికి వచ్చారు. నవ్వుతూ, కొబ్బరీ, బెల్లం, నువ్వులూ వేసి దంచి, చిమ్మిలి చేసి, ఉండలు చేసి పంచిపెట్టారు.

మూడురోజులూ పేరంటమే! పులగం వండి, మట్టి మూకుట్లో బెల్లం, పాలు-పోసి పిల్లకు తినటానికి పెట్టేవాళ్ళు. ఆ నాలుగు రోజులూ, పిల్లకు ఉప్పూ, కారం పెట్టకూడదని

అలా పత్యం చేయించారు, నాలుగోరోజు రాత్రి ప్రొద్దు పోయినాక, పిల్లకు తలంటిపోశారు. తాటాకులు తగలేశారు. విడిచిన చీరె జాకెట్టు—చాకలికి ఇచ్చారు. అయిదవరోజు చిట్లబంతి చేశారు. అరిసెలు వండారు. పదకొండోరోజున పెద్దబంతి పెట్టారు. ఊరంతా భోజనాల సాదడి. సాయంత్రం పిల్లకు పట్టుచీర కట్టి, పెళ్ళికూతుర్లా అలంకరించి, కుర్చీలో కూర్చోపెట్టి పేరంటం చేయించారు. వచ్చిన ముత్తయిదువు లందరికీ పిల్లచేత పళ్లూ, తాంబూలం- పంచిపెట్టించారు. వారంతా పిల్లను పదికాలాలపాటు సౌభాగ్యవతిగా వర్థిల్ల మని ఆశీర్వదించారు.

వారాలు, నెలలు, సంవత్సరాలు-జరుగుతున్న కొద్దీ- పిల్ల వొంటికి మిసమిస వచ్చింది. వయస్సు వస్తూ వస్తూ, వంటికి ఎన్నో మెరుగులు తీసుకువస్తుంది. పిల్ల ఇంట్లో తిరుగుతూ ఉంటే ఎంతో నిండుగా ఉంది. చక్కగా చదువు కుంటుంది. ఇంట్లో పనులకు తనకు సాయం చేస్తూ చేదోడు వాదోడుగా ఉంటుంది. పిల్లకు చిన్నచిన్న పనులన్నీ నేర్పింది తాను.

కళ్యాణఘడియ వస్తే, క్షణంకూడా ఆగదనిఅంటారు.

చదువుకుంటున్న పిల్లకు అన్నివిధాలా అనుకూలంగా ఉన్న సంబంధం వచ్చింది. ఈ సంబంధం కుదరక పోతే ఎలా- అని తనకు రంధి పట్టుకుంది. ఇంకా రెండుమూడేళ్ళు పోయి నాకయినా, పెళ్ళిచేసి ఒక అయ్యచేతిలో పెట్టవలసిన పిల్లే కదా! సిరిరా మోకాలొడ్డినట్లు, ఇంత మంచి మనువు పోగొట్టుకోవటం ఇంట్లో ఎవరికీ ఇష్టం లేకపోయింది. తను

పిల్లను కూర్చోబెట్టి నచ్చచెప్పి, పెళ్ళి చూపులకు వప్పించింది. వరాలమూట తన కూతురు! తన మాటకు ఎదురు చెప్పలేదు.

మంచిరోజు చూచుకొని పెళ్ళివారు పెళ్ళి చూపులకు వచ్చారు. పిల్ల కడిగిన ముత్యంలా ఉంది. ఆర్భాటాలూ అలంకారాలూ ఎక్కువ ఏమీ చేయలేదు. పిల్లవాడి తల్లీ, తండ్రీ, అక్కగారూ-పిల్లను ఏవో ప్రశ్నలు వేసి మాటాడించారు. పిల్లా, పిల్లవాడూ ఒకరినొకరు చూచుకున్నారు.

పెళ్ళి చూపులు ముగుస్తూనే పెళ్ళి నిశ్చయమై పోయింది. అదంతా మనలక్ష్మి అదృష్టం- అనుకున్నారు. తాము అట్టే కష్టపడకుండానే సంబంధం కుదిరింది.

మంచి రోజు చూచి వియ్యాల వారు ప్రధానం తెచ్చారు. పట్టుచీర, రవిక, మెడలోకి ముత్యాల నెక్లెసు, ఉంగరము-పెట్టారు. వచ్చిన వారందరికీ తాము బట్టలు పెట్టారు. బ్రాహ్మణ్ణి పిలిపించి ఆ రోజు పిల్లచేత పూజ చేయించారు.

ముహూర్తం కూడా దగ్గరలోనే కుదిరి పోయింది. మంచిరోజు చూచి ముత్తయిదువుల్ని పిలిచి, పసుపు కొట్టించారు. అప్పనుండీ పెళ్ళిపనులు మొదలు పెట్టారు. ఊపిరాడని పనులు! మగవాళ్ళు చేయవలసిన పనులు కొన్ని, ఆడవాళ్ళు ఇంట్లో చేసుకోవలసినవి కొన్ని. ఇంటికి సున్నాలు, రంగులూ వేయటం, పందిళ్ళు కట్టించడం-ఇంట్లో వాళ్ళందరికీ బట్టలు, పెళ్ళికూతురికి పట్టుచీరలు, వియ్యాలవారికి బట్టలు, అల్లుడికి బట్టలూ, ఉంగరం-ఇవన్నీ సమకూర్చుకోవటం

పెద్దపని. అన్నీ తయారు చేసుకునేటప్పటికి ఆ ఘడియరానే వచ్చింది.

రెండు మూడు రోజులు ముందుగానే మంచిరోజు చూచి పిల్లను పెళ్ళికూతుర్ని చేశారు. ముత్తయిదువులు వచ్చి బొట్టుపెట్టి అక్షింతలువేసి దీవించారు. మేళతాళాలతో వేడుక చేశారు. అప్పటి కప్పుడే పిల్లకు పెళ్ళికళ వచ్చేసింది.

ఈ సంబరాలలో, హడావుళ్ళలో-ఎప్పుడు ఎలా ప్రొద్దుతిరుగుతున్నదో తెలియకుండా కాలం గడిచి పోయింది.

రాత్రికి పెళ్ళి ముహూర్తం. రావలసిన వారందరూ వచ్చారు. పగలు విందుభోజనాలు, సాయంత్రం నుంచీ అమ్మాయికి అలంకారం ప్రారంభించారు. పూలజడ వేశారు. బనారసు జరీ పువ్వులచీర కట్టారు. బుగ్గను చిన్న చుక్క పెట్టారు. వీటన్నిటితో పిల్ల మెరిసి పోతూఉంది. దృష్టి తగలదు కదా అనిపించింది.

పిల్లను గౌరీపూజకు కూర్చోపెట్టారు. సర్వ మంగళ స్వరూపిణి గౌరీదేవి. ఆ తల్లిని పూజించితే-అయిదవతనంతో పాటు అన్ని సుఖాలను అనుగ్రహిస్తుంది.

ఈ ఆచారం అనాదిగా వస్తున్నదే! రుక్మిణీదేవి తన వివాహానికి ముందు-తాను వరించిన కృష్ణమూర్తిని భర్తగా కోరి గౌరిదేవిని పూజించిందట!

" నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ము పురాణ దంపతుల మేలు భజింతు గదమ్మ మేటి పె

ద్దమ్మ దయాంబురాశివి కదమ్మ హరింబతి చేయుమమ్మ నిన్
నమ్మిన వారికెన్నడును నాశము లేదు కదమ్మ యీశ్వరీ "

అంటూ ప్రార్థించిన రుక్మిణీదేవికి కోరుకున్న భర్త లభించాడు. అప్పటినుండి, ఆడపిల్లలు తమకు లభించే వరుడు అనుకూలుడుగా ఉండాలని-పెళ్ళికి ముందుగా పార్వతీదేవిని ప్రార్థించుకోవటం అనూచానంగా వస్తున్న సంప్రదాయం.

వివాహ వేదికపైన వరుడుచేత పూజచేయిస్తున్నారు. దోసిలిలో తమలపాకులు, కొబ్బరిబొండాం పెట్టి, పిల్లను వివాహవేదికపైకి తీసుకు వచ్చారు. వధూవరుల మధ్య తెర కట్టారు.

తాను వెండిచెంబుతో నీళ్ళు పోస్తుండగా, ఆయనగారు అల్లుడి కాళ్లు కడిగి కన్యాదానం చేశారు. బిడ్డను ఒక అయ్య చేతిలో పెట్టారు. ముహూర్త సమయానికి మేళతాళాలమధ్య వధూవరు లిద్దరిచేతా, ఒకరినెత్తిమీద ఒకరిచేత జీలకర్ర బెల్లం పెట్టించారు. తరువాత మంగళసూత్రధారణ జరిగింది. పూలదండలు ఒండొరుల మెడలలో వేయించారు.

ఆ తరువాత తలంబ్రాలు పోసుకున్నారు. తల మీద వివాహసమయంలో సేసలుపోసుకోవటం రామకళ్యాణం నాటి నుంచీ వస్తున్న ఆచారమే! అవి నెత్తిమీద పోసుకునే జంటలకు మాత్రమే కాక, చూచేవారికి కూడా వినోదంగానే ఉంటుంది. దంపతులు ధరించిన తెల్లనిబట్టల నిండా పసుపు! అది ఒక క్రొత్తకళ తెచ్చిపెట్టింది.

మేనమామ తెచ్చిన మట్టెలు, పిల్లేళ్లు-కాళ్ళకు తొడిగారు. అత్తవారు తెచ్చిన నల్లపూసలు మెళ్లో కట్టించారు.

బిందెలో నీళ్ళు తెప్పించి మట్టె-ఉంగరం-అందులో పడవేసి-వధూవరులిద్దరినీ అందులో చేతులు పెట్టి వెతికి తీయా లన్నారు. దంపతులు చేతులుకలుపుకునే అదను కలిగించటమే కాక-ఇదికూడా చూచే వారందరికీ వినోదం కలిగించే వేడుకే!

బ్రహ్మముడి వేశారు. వరుడి ఉత్తరీయపు చెరగుకూ పిల్ల పమిట చెరగుకూ ముడి. అది వారిద్దరి జీవితాలనూ శాశ్వతంగా బంధింప చేసేముడి.

సన్నికల్లుమీద, కాలిబొటనవ్రేలితో త్రొక్కించారు. హోమగుండం చుట్టూ, ఇరువురినీ ఏడడుగులు నడిపించారు. 'సఖాయా సప్తపదా బభూవ'-మనిద్దరమూ అలాసఖులుగా స్నేహంగా ఉందాం-అనే మహోదాత్త భావనతో వేసిన సప్తపది అది. వధూవరులను బయటకు తీసుకు వచ్చి-ఆకాశంలో దేదీప్య మానంగా వెలుగుతున్న అరుంధతీ నక్షత్రాన్ని పాతివ్రత్యసిద్ధి కోసం, ధృవనక్షత్రాన్ని ఆయు ర్వృద్ధి కోసం-దర్శనం చేయించారు,

ఇంట్లోకి వచ్చేముందు అమ్మలక్కలు కాపలా కాశారు. వరుసయిన వయ్యారి భామలు వాకిట్లో చేరి పేర్లు చెప్పందే గడప దాటనీయమన్నారు! ఆడవాళ్ళందరికీ ఇది ఒక గొప్ప సరదా! వేడుక! వధువుకీ వరుడికీ దాచుకుందా మన్నా దాగని దరహాసం, సిగ్గుపడటాలు, వంతులుపోవటాలు, వరుసయిన వాళ్ళు వాగ్బాణాలు విసురు కోవటాలు-అలా అరఘడియ సేపు ఆ వేడుక సాగింది. అంతసేపూ పంతం

పోయిన అల్లుడు ఏమనుకున్నాడో ఏమో-స్పష్టంగా పెళ్లాం పేరు చెప్పి, చిలిపిగా పిల్లవంక చూచాడు, పిల్లకు ఇహ తప్పలేదు! గొణిగినట్లుగా మొగుడి పేరు చెప్పింది. మాకు వినపడలేదంటే మాకు వినపడలేదని వరుసయినవాళ్లు గోలకెత్తారు. మగవాళ్ళు కాలాతీతం అవుతుందని కేకలు వేశాక, ఇహ వాళ్ళను లోపలకు వదలారు.

అలివేణి కుండల దొంతులదగ్గర వధూవరుల్ని కూర్చోబెట్టి పూజచేయించారు.

ఇప్పుడు తానూ, ఆయనగారూ-ఈ చిట్టితల్లిని ఆమె భర్తకూ, అత్తవారింటిలో వారందరికీ ఒప్పగింతలు పెడుతున్నారు. కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ కూతురివైపు చూచుకున్నది తల్లి.

పురిటిలో పసికందు - పందిట్లో పెళ్ళికూతురయేటంత వరకూ-ఆతల్లి భావనలో-కొద్ది నిముషాలలో సినిమా రీలు వలె తిరిగింది. ప్రపంచంలో అన్నిటికన్నా మనిషి మనస్సు మహా వేగవంతమయిందని అంటారు. మనోవేగం ఆఘమేఘాలమీద తేలిపోతుంది. కూతురు పుట్టినప్పటినుంచీ ఇప్పటివరకు జరిగిన ఘట్టాలన్నీ, ఆతల్లి కళ్ళముందు కట్టినట్లు తిరగటానికి రెండు మూడు నిముషాలకన్నా పట్టలేదు!

పిల్లకూ కన్నీటిధార ఆగటం లేదు! కన్న కడుపు ద్రవించిపోయింది.

"కంట నీరు తుడుచుకో కనకంపుబొమ్మ
జంటగా పతితోడ సుఖయింపుమమ్మా!"

అంటూ ఆఖరు వప్పగింత పెట్టింది ఆ తల్లి, ఆ తర్వాత కథ నేను చెప్తాను. దిగులుతో గుండె బరువెక్కిన ఆతల్లి ఏమి చెపుతుంది!

ఆతర్వాతకూడా పిల్లకు ఎన్నెన్నో వేడుకలు జరిగాయి. పిల్లను అత్తవారింటికి తీసుకువెళ్ళి గృహప్రవేశం చేయించారు. మళ్ళా వాకిలిముందు నిలబెట్టటం, ఆడపడుచు కట్నం కోసం హారతి పట్టించటం, పేర్లు చెప్పించటం, వేళాకోళాలు–ఈసారి వరుడికి స్థానబలిమి వచ్చింది. నవ్వుల్తో ఇంట్లోకి నడిచారు. ఆ యింటి కోడలు కుడిపాదం ముందుపెట్టి, గడప దాటింది,

మర్నాడు అత్తవారి ఇంట్లో సత్యనారాయణవ్రతం చేయించారు, పెళ్ళి సమయంలో–ఆ నవ దంపతుల భావి జీవితం ఎంతో సుఖప్రదంగా ఉండాలని, భగవంతుని అనుగ్రహం కోసం ఇటువంటి పూజలూ, పునస్కారాలూ ఎన్నెన్నో చేయిస్తారు. నూతన దంపతులకు కన్నవారు బట్టలు పెట్టారు. కన్యాదానం చేసిన ఆ తల్లి దండ్రులకు వియ్యాలవారు నూతన వస్త్రాలు ఇచ్చి సత్కరించారు.

పెళ్ళయిన పదహారు రోజులకు పదహారు రోజుల పండుగ చేశారు. దగ్గర చుట్టాలందరికీ మళ్ళా విందుభోజనాలు. అత్తవారింటిదీ, పుట్టినింటివారిదీ – రెండు మంగళసూత్రాలూ కలిపి ఒకటిగా గుచ్చారు.

పిల్లకు కన్నవారింటిలో అట్ల వాయినాలనీ, తద్దె పేరంటాళ్ళనీ నోములు నోయించారు. ముత్తయిదువుల్ని పిలిచి వాయినాలు ఇప్పించారు. ఇవన్నీ పెద్దవాళ్ల ఆశీర్వాదం

కోసం, భగవత్ ప్రీత్యర్థం - తెలుగు పడుచులు ఆచరించే వ్రతాలు, నోములు.

నవ దంపతులు అప్పుడే మానసికంగా విడని బంధమైనారు. కాని వారు ఇంకా అపరిచితులే! వారి మధ్య అనురాగం మరింత గాఢమూ, పరిపూర్ణమూ కావడానికి ఇంకా కొంత తరవాయి ఉంది. కుర్రవాడికి తన వధువుమీద కొత్తగా ఏర్పడిన ఇష్టం, కోరిక, కాంక్ష-అది ఆమెకు ఎలా ప్రదర్శించి తెలిపితే బాగుంటుందో అతనికి తోచలేగ. ఈ తప్పనిసరి విరహం అతనికి తీయగానూ బాధగానూ ఉంది. ధైర్యం చేసి ఆమెకు ఉత్తరం వ్రాశాడు. భార్యకు కదా వ్రాసుకున్నాడు! ఎవరేమంటారు! అదీ అతని ధైర్యం!

పిల్లకు ఎక్కడలేని సిగ్గు వచ్చి పడింది. మొగుడంటే మోజు, ఇష్టం. తనవాడని ఏదో పొంగు. ఎవరైనా అతని ప్రసక్తి తీసుకు వస్తే గుండెల్లో సంబరం! అతను వ్రాసిన ఉత్తరం చూచేటప్పటికి గుండె గుబగుబ లాడింది గుండె ఎందుకో అంత చప్పుడు చేస్తూ కొట్టుకుంటుంది! ఎవరికైనా ఆ గుండె చప్పుడు వినిపిస్తుందేమో! అణుచు కోవటానికి చేతకాని ఉద్వేగం! ఉల్లాసం! దానికి తోడు స్నేహితురాళ్ళ వేళాకోళాలు! ఉడికించటాలు! వాళ్ళు ఉడికిస్తుంటే, తనకు కోపం వచ్చినట్లు నటిస్తుంది కాని, నిజంగా లోపల పులకరింతగా ఉంది! సంతోషంగా ఉంది!

పిల్ల నడుస్తుంటే కొత్తగా పెట్టిన మట్టెల సవ్వడి మంజులంగా వినవస్తున్నది. మెళ్లో మంగళసూత్రాల గలగల.

పచ్చని మెడలో నల్లపూసలు అలంకారం—పిల్ల కన్నె ముత్తయిదువులా కళకళ లాడి పోతున్నది.

మంచిరోజు చూచి పునస్సంధానానికి ముహూర్తం పెట్టించారు. దగ్గర చుట్టాల్ని పిలిచారు. మళ్ళీ పెళ్ళిచేసినంత పని చేశారు పిల్లా పిల్లవాడు పీటలమీద కూర్చున్నారు. బ్రాహ్మణుడు వారిద్దరిచేత పూజచేయించాడు. వారి దాంపత్య జీవితం మూడు పూవులూ ఆరుకాయలుగా సాగి పోవాలని దీవించాడు.

పాన్పువేసి వారిద్దరినీ ఎదురెదురుగా కూర్చోపెట్టారు చెండ్లాట ఆడించారు. ఒకరిచేత మరొకరికి అత్తరువు, గంధం—పూయించారు. పెద్దవారయిన దంపతులను దగ్గరకు రప్పించి వారిద్దరి చేత ఫలప్రదానాలు ఇప్పించారు, రవికల గుడ్డ, కొబ్బరిబొండాం, పండు, తాంబూలం, ఇప్పించి—వారి చేత ఆశీర్వాదింపచేశారు. పడకటింటిని అందంగా అలంకరించారు. అగరధూపాల సువాసనలు, మల్లెదండల విరితావులు అత్తరువుల ఘుమఘుమలు, తెల్లని పాన్పు మీద వెదజల్లిన మల్లెలు, పళ్లాలనిండా ఫలహారాలు—మీగడపాలు.

పిల్లను పెళ్ళికూతుర్లా అలంకరించారు. అగరుధూపాల సువాసనలా, ముఖంనిండా పరుచుకున్న సిగ్గు ఆ అమ్మాయికి ఒక ఆభరణంలా అమిరింది.

ఇంతవరకు మానసికంగా మాత్రమే దగ్గరయిన దంపతులు ఆ రాత్రి శారీరకంగా ఏకమయ్యారు. వారి దాంపత్య జీవన సౌభాగ్యానికి పునాదులు వేసుకున్నారు.

అంతలో ఆషాఢమాసం అడ్డం వచ్చింది. కొత్త దాంపత్యం విరహావస్తకు లోనయ్యింది. ఆ విరహంలో మానసికమైన దగ్గరతనం-మధురమైన స్మృతులు. తీయని ఆలోచనలు,! అత్తా కోడలు, అత్తా అల్లుడు ఆ నెల్లాళ్ళు ఒకే గడప దాటకూడదని ఎవరు ఎప్పుడు అంటు పెట్టారో కాని, ఆ కొద్దిరోజులు విరహం తెచ్చిపెట్టే విరహావస్థ దాంపత్య శోభను ఇనుమడింప చేసే శక్తి కలదిగా ఉంటుంది.

నోముల పంటలా శ్రావణలక్ష్మి తల్లి వచ్చింది. పిల్ల చేత శ్రావణ శుక్రవారం నాడు వరలక్ష్మివ్రతం చేయించారు. అత్తవారు పిల్లకు వరలక్ష్మి ప్రతిమ చేయించి తెచ్చారు. బంధువులకు భోజనాలు-సాయంత్రం పేరంటం చేశారు.

పెళ్లయిన తొలి వినాయక చవితి రోజున పిల్లను, ఉపవాసం ఉంచారు. ఉండ్రాళ్ళ తద్దె, అట్లతద్దె, పదహారు కుడుముల తద్దె - అన్ని పండుగలూ, నోములూ, ఆనవాయితీ ప్రకారం జరిపించారు.

మంచిరోజు చూంచి, సారెపెట్టి-పిల్లను తొలిసారిగా అత్తవారింటికి కాపురానికి పంపారు. 'సారె' అంటే సర్వమూనూ. కాపురానికి కావలసిన సమస్త సామగ్రి-కానుకగా ఇచ్చి పిల్లను పంపించారు.

ఈ సంపదతో పాటు, వలపు తలపులను వెంటతీసుకొని అత్తవారి ఇంట్లో అడుగుపెట్టిందీ పిల్ల. ఆ ఇంటికి సిరితో పాటూ 'స్త్రీ' వచ్చింది.

నవదంపతుల కొత్త దాంపత్యం-చూచేవారి కన్నుల పండువుగా సాగింది. అతడికి జీవనయానంలో ఆదరువైన

పట్టుగొమ్మ దొరికింది. జీవితానికి అర్థం తెలిసినట్లయింది. ఆమెకు అండగా ఉండే ఆలంబనం దొరికింది. బ్రతుక్కి కావలసిన పరమార్థం యేమిటో అవగతమైంది.

వారి ప్రణయానందం పరాకాష్ఠను అందుకొన్నది. వారిద్దరి ఆనంద చిహ్నం పొటమరించింది. పిల్లకు వేవిళ్ళు ప్రారంభమయినాయి.

పిల్ల కన్నవారికి కబురు తెలిసింది. వాళ్ళకు పరమానందం కలిగింది అయిదోనెల వచ్చాక, చలవకోసం చలిమిడి, పిండివంటలు చేసుకు వచ్చారు. పిల్లకు కుర్చీలో కూర్చో పెట్టి సీమంతపు వేడుక చేశారు. గాజులు తొడిగించారు. వచ్చిన ముత్తయిదువులందరూ 'పండంటి కొడుకును కనుతల్లీ!'-అని పిల్లను దీవించారు.

పెద్దల దీవెన ప్రకారం పిల్లతొలిచూలు ఫలంగా కొడుకునే కన్నది.

"తింటేను రాచోరి సారే తినాలి
కంటేను తొలిచూలు కొడుకునే కనాలి!"

అని ఏనాడో మనవాళ్లు అన్నారుకదా!

చక్రభ్రమణం ఇంతటితో పూర్తయింది. పురిటిలోని పసిపిల్ల పురిటి బాలెంతరాలు అయింది. ఇంతటితో నేను చెప్పదలచుకున్న కథకూడా పూర్తిఅయింది.

నిజానికి ఇది సామాన్యపుటర్థంలో 'కథ' అనిచెప్ప ట్టానికి వీలులేదు. కాని, ఒక విధంగా ఇది తెలుగు వారి ఇంటి ఆడపడుచు కథ. అనాదిగా వస్తున్న ఆచారాల కథ.

వేడుకలను, ముచ్చటలను, ఆచారాలుగా మార్చుకున్న తెలుగు కథ.

ఈ విధులు, వేడుకలు-కాలంతో పాటు కనుచూపు దూరంలో లేకుండా పోతున్నాయి. ఆ నాటి మనుషులు, మమతలు, మనస్సులు, కాలపరిస్థితులు- ఇప్పుడు లేవు. ఈ నాడు సంఘంలో చెప్పలేనన్ని మార్పులు వచ్చాయి. ఒకప్పుడు ఎంతో భద్రంగా దాచుకున్న విలువలు తారు మారు అయినాయి.

సాంఘిక పరిస్థితులలో వచ్చిన మార్పుల వల్ల-పాత పద్ధతులు తప్పనిసరిగా విడిలించుకోవలసిన స్థితి ఏర్పడింది. ఈ నాడు ఆడపిల్లలు కూడా మొగపిల్లలతో పాటు చదువు కుంటున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. ఆర్థికంగా స్వతంత్రులు అవటంతో, ఒక నిర్దిష్టమైన వ్యక్తిత్వం ఏర్పరచుకోనగలుగు తున్నారు.

విజ్ఞానం అందించిన తర్క-వాదనాబలంతో, హేతువాద దృష్టితో ఆలోచించి చూస్తే-అనాదిగా మనవాళ్ళు ఆచరిస్తూ వచ్చిన ఆచారాలు, విధులు-అర్థం లేనివిగా, ఛాందస భూయిష్టంగా కనిపిస్తాయి. ఈ తరం వారికి ఆ ఆచారాల పట్ల ఒక విధమైన ఏవగింపు, విముఖత్వమూ ఏర్పడుతూ ఉంది. ఈ వేడుకలు, తంతులు-చూసే ఓపికా, తీరికా, కోరికా, ఆర్థిక స్థోమతా- పెద్దవాళ్ళకు ఉండటంలేదు. ఇవి చేయించుకునే ఓర్పూ, ఇష్టమూ-పిల్లలకూ ఉండటంలేదు.

ఒక తరం ముందు తెలుగు నేలలో పుట్టి పెరిగిన ఆడపిల్లకు- ఈ నాటి విజ్ఞత గడించిన విదుషికీ-ఆలోచనలో

అలంకరణలో, అభిరుచిలో-ఎంత తేడా! ఆమె ముద్దబంతి వంటి ముగ్ధ! ఈమె మొగలి పువ్వంటి ప్రౌఢ!

ఈమె ఇలా ఉండవచ్చునని ఆమె ఊహకు కూడా అంది ఉండదు! ఆమె అలా ఉండేదని తెలిస్తే ఈమెకు ఆశ్చర్యం, ఈసడింపు!

ఈ యాంత్రిక యుగంలో, అనాటి ఆచారాలు ఎందుకూ పనికిరాని ఛాందస సంప్రదాయాలుగా పరిగణింపబడి రానురాను రూపు మాసిపోతున్నవి. ఇవి పూర్తిగా కాల గర్భంలో కలిసిపోయినాక, మనముందు తరాల వారికి 'వేడుక' అనే పదానికి అర్థం తెలియని రోజులు రావచ్చును. రిజిస్టర్డ్ పెళ్ళిళ్ళు చేసుకుని, వెంటనే హనీమూన్ యాత్రకు బయలుదేరే జంటలకు, ఈ తంతులూ, సన్నాయి నొక్కులూ అవసరం లేకపోవటమే కాక 'టైమ్‌వేస్టు' కూడాను!

నేటి ఆర్థిక, సామాజిక పరిస్థితులను బట్టి- ఈ వస్తూ ఉన్న మార్పు సహజమైనదే! వాంఛనీయమైనదే!

అయినా కాలంతోపాటు వెనక్కి మళ్ళి, కనిపించ కుండా పోతున్న మన తెలుగుతనం, తెలుగు వేడుక, తెలుగు ఆచారం- ఒక్కసారి మననం చేసుకుంటే ఎలాఉంటుందో- అనే ఆలోచన ఈ రచనకు ఉపక్రమణిక అయింది.

గతాన్ని తవ్విపోసుకోవటం ఎందుకు!- అనేవారికి నేను ఏమీ చెప్పలేను. కాని అలా తవ్వి పోసుకోవడంలో ఒకవింత అనుభూతి కలుగుతుంది. తద్వారా-మన సంస్కృతి ఏ పునాదుల మీద కట్టబడిందో తెలుసుకునే అవకాశం కలుగుతుంది! ***

# ఆభరణాలు

కస్తూరీ తిలకం లలాట ఫలకే
వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం
కరతలే వేణుం కరే కంకణం
సర్వాంగే హరి చందనంచ కలయన్
కంఠేచ ముక్తావళీ—

ఇంత అందముతో, అలంకారంతో, గోపాల చూడామణి మన మనో నేత్రాలముందు భాసిస్తాడు.

అసలే అందగాడు! దానికితోడు అతడు ధరించిన ఆ ఆభరణాలన్నీ ఆ నల్లనయ్యకు ఇంకా మెరుగూ మెరుపూ తెచ్చి ఉంటాయి. వొంటినిండా కలియపూసిన హరిచందనం ఎంత కమ్మని పరిమళాన్ని వెదజల్లుతూ ఉందో!

అసలు ఆ హరికి బాలకృష్ణ రూపంలో ఉన్నప్పటి నుంచే అలంకారాలపైన మోజే! తన అందం చాలదని వెరపేమో!

గొల్లవారి ఇళ్ళల్లో ఆగడాలు చేసి చేసి అలసిపోయి అమ్మ దగ్గరకు వచ్చాడు గోపాలరత్నం. అమ్మకు కోపం

వచ్చి దండిస్తానని బెదిరిస్తుంది. భయపడ్డటు నటించి చిన్న చిన్న అబద్ధాలు ఆడతాడు చిన్నికృష్ణుడు.

"అమ్మా, నే నెక్కడికిని పోలేదే
ఎవ్వారిండ్లకును పోలేదే"

అంటూ అమ్మ నమ్మేట్లు అమాయకత్వం నటిస్తూ చెపుతాడు. ఆ తల్లి ఆ మాటలకు కరిగిపోయి –

"కృష్ణా, నీవెవ్వారిండ్లకును పోకుంటే
తల దువ్వి శిఖలు వేసేను
కొండీకి పూలు చుట్టేను
సొమ్ములు చాల పెట్టేను
బంగారు వల్లె వేసేను
కస్తూరీ తిలకం దిద్దేను."

అంటూ కొడుక్కి సర్వాలంకారాలూ చేస్తుంది. ఎన్నెన్నో ఆభరణాలు పెడుతుంది.

అన్ని సొమ్ములు పెట్టుకోవాలని భగవంతుడైన గోపాలుడికే అంత మోజుగా ఉంటే, భూషణాలు ధరించటం జన్మహక్కుగా సంతరించుకున్న ఆడవాళ్ళకు ఇంకా ఎంత ఆశగా ఉంటుంది.

ఆడవాళ్ళకు సొమ్ములపైన ఉండే మోజు ఈనాటిది కాదు. హరప్పు, మొహంజొదారో కాలం నాటి నుంచీ స్త్రీలు వివిధరకాలైన ఆభరణాలు ధరిస్తూనే ఉన్నారు. తక్షశిల తవ్వకాలలో చెవులకు పెట్టుకునే పోగులు, గాజులు,

ఉంగరాలు, కంఠహారాలు, పతకాలు ఎన్నో రకాలవి బయట పడ్డాయి.

అంటే, మనవాళ్ళు అంత పురాతన కాలం నుంచీ, ఆభరణాలు ధరించి, తమ సౌందర్య ప్రియత్వానికి ప్రోది చేసుకుంటూ ఉండేవారన్నమాట.

అజంతా చిత్తరువుల్లో ఆ ముగుదల అలంకారప్రియత్వం ఎంత కళాత్మకంగా ఉండేదో గోచరిస్తుంది మనకు. కంఠహారాలు, మొలనూళ్లు, కంకణాలు, శిరోజాలంకరణాలు - ఇవన్నీ ఆ చుక్కల చక్కదనానికి వాసి తెచ్చి పెట్టే అలంకారాలే.

సాంచి, అమరావతి, భువనేశ్వర్, కోణార్క, నాగార్జున కొండ-ప్రాంతాల్లో దొరికిన శిల్ప ప్రతిమలు ఎన్నెన్నో ఆభరణాలు ధరించినట్లు చెక్కబడినాయి. ఆ రోజుల్లో ఆభరణాలు అంత ప్రీతితో అలంకరించుకునేవాళ్ళు కాబోలు ఆడవాళ్ళు!

హరిచందనపు మైపూతతో కంఠంలో వ్రేలాడే ముత్యాల సరులతో-పరుగు పరుగునవచ్చే బాలగోపాలుడితో ప్రారంభించిన నా భావనా లహరి నా మనస్సును ఎక్కడికో పరుగు తీయించింది.

నగలమీది మోజు ఆడవాళ్ళకు పుట్టుకతో వచ్చేదే! కలవారి పడుచు కాసులపేర్లూ-కంటెలూ తగిలించుకుని మురిసిపోతే, లేమిలో పుట్టి పెరిగిన లేమ, నల్లపూసల పేర్లూ మట్టి గాజులూ ధరించి సంతృప్తి పడుతుంది.

ఆనాడైనా, ఈనాడైనా-ఆభరణాలు అందరికీ అందుబాటులో ఉండే వస్తువులు కావు. మధ్య తరగతి సంసారులకు ఈ నగలు ఏర్పరచుకోవటంలో ఉండే కష్ట నిష్ఠురాలను తెలిపే సామెతలు-మన నిత్యజీవితంలో అనుభవాలకు ప్రతీకగా కనిపిస్తాయి.

'సంతలో బేరము లచ్చికి గాజులకు సరి !'

సంతకు వెళ్ళి బేరం చేసుకువచ్చి బియ్యం పప్పూ తెచ్చుకోవాలని వెళ్ళిన ఆసామికి, ఇంటావిడ గాజులు తెచ్చి పెట్టమని కోరిన కోరిక గుర్తు వచ్చింది. ఆవిడకు కావాల్సిన గాజులు కొని తిరిగి చూచుకునేటప్పటికి చేతులు ఖాళీ! పాపం! ఆనాటి సంపాదన గాజులకే సరిపోయింది,

"సాయిబు సంపాదన బీబి కుట్టు పోగులకే సరి !"

బీబి చెవులనిండా పైనుంచి క్రిందవరకు కుట్టుపోగులే! సాయిబుగారి సంపాదన తినేదాకా ఎక్కడ! ఆ కుట్టుపోగులకే సరిపోతూ ఉందాయె! మధ్య తరగతికి అందని ఖరీదైన కోరికలు ఏవిధంగా బాధపెడతాయో తెలిపే నానుడులు ఇవి.

అలంకారాలూ ఆభరణాలూ పై తరగతులకు చెందిన ఆడపడుచుల సొమ్ములే-అనేది నిర్వివాదాంశం. మనముందు కాలంలో ఆడవాళ్లు ఎలా అలంకరణ చేసుకునేవాళ్ళో! కళాపూర్ణోదయంలో కవి వర్ణిస్తాడు కొన్ని ఆభరణాలను.

" తలుకు బిల్లాండ్లు బబ్బిలి కాయలును మట్టె
యలు పీర మద్దియలు సందియలును

మొలనూళ్ళ నొడ్డాణములు నేవళంబు బుం
జాల దండయు బన్నసరము మొగపు
దీగయు సాణి ముత్తెపు బేర్లు సంది దం
డలు సూడిగములు గౌడ సరములును
కడియాలు పెక్కు జోకల యుంగరములు
ముంగరయు గోలాటంపు గమ్మజోడు
చెవుల పూవులు బలిరలు చేరుచుక్క
కొప్పు వలయును సవరించి రొప్పుమీర
భూషణములను తానొక భూషణముయి
పడతి యపుడొప్పె కన్నుల పండువగుచు! ”

ముక్కువత్తు, వడ్డాణము, దానికి గజ్జెల గొలుసు - అందెలు (నూపురములు), త్రిసరములు (మూడు వరుసల దండలు); కంకణములు, తాటంకములు (కమ్మలు), ముక్కర (ముత్యాలవి, రత్నాలు పొదిగించినవి)-ఆనాడు స్త్రీలుధరించే సాధారణ భూషణాలు.

ఇవన్నీ ఇంచుమించు కొద్ది తేడాలతో- అమరావతి. నాగార్జునకొండ వంటి బౌద్ధ జైన హిందూ శిల్ప ఫలకాల లోను, రామప్పగుడి, శ్రీశైలము, హంపి, లేపాక్షి దేవా లయాల శిల్పాలలోను మనకు కానవస్తాయి.

సర్వాభరణాలూ ధరించిన స్త్రీమూర్తిని మన ప్రాచీన కవులు ఎన్నో అందమైన కల్పనలతో వర్ణించుకొన్నారు.

“ పసమించు ముత్యాల పాపట బొట్టు
పౌజుల కమ్మలు పల్లేరు పూలు

రాజిల్లు రత్నాల రాగిడీ పెట్టి
కెంపుల ముక్కర గిలక సరంబు
సొంపుతో వజ్రాల జోడు హారములు
బంగారు పట్టెడ బన్న సరములు
రంగు పచ్చల యుంగరములు మెరయ
నబ్బరంబై యందమౌ చిల్కతాళి
గుబ్బ చన్నుల మీద గునిసి యాడంగ
సందిటి తాయెతుల్ జతలు దూగాడ
గందు బొల్లని పైడి కంకణంబులును
ఘంటలు మొలనూలు కాళ్ళ గజ్జెలును
దంట మెట్టెలు వింత దళుకొత్తుచుండ -

ఎన్ని భూషణాలు! ఉంటేమాత్రం! వీటిని ఎంత ఓపికగా ధరించేవారో! ఆనాటి తెలుగుదేశపు ఆడపడుచుల అలంకార ప్రియత్వం ఎంత గొప్పగా ఉండేదో!

రెండు తరాల క్రిందటి తెలుగు దేశపు తెలివి-ఆ కాలపు కట్టుబాటులలో కట్టుబడిపోయి, ఆనాటి కట్టూబొట్టూ జీర్ణించుకుపోయిన మా బామ్మ దగ్గరకు వెళ్ళాను.

ఆవిడకు జ్ఞాపకశక్తి ఎక్కువ. వయస్సు భారం పైన పడినా. మెదడు చురకత్తిలాగా పనిచేస్తుంది. ఎన్నో పాత కాలపు కబుర్లు చెపుతుంది. హాస్యాలు ఆడుతుంది. ఎన్నెన్నో పాటలు పాడుతుంది. అందుకే నాకు బామ్మ అంటే ఎంతో ఇష్టం.

• ఇన్నేళ్ళు వచ్చినా. ఆవిడకు దృష్టిలోపం కలుగలేదు. నేను వెళ్ళేటప్పటికి బామ్మ తులసికోట దగ్గర కూర్చుని

బియ్యంలో గడ్డలు ఏరుతున్నది. రాగంతో పాడుతూనూ ఉన్నది.

“ గాజు లొరయగను కంకణములును జార
జాజి కొప్పులనుండి జల జలని రాల
తేజ మలరంగను సందియలు రవళిల్ల
క్రిందుగా మొలనూలి గంటలొగి మెరయ
సంది దండల కాంతు లందందు మెరయ
బిందులుగ చీర కుచ్చిళ్ళు కడు నెరయ
ఇందు ముఖు లూచెదరు ఇంపు సొంపరయ.”

బాలక్రిష్ణుడినో, చిన్నారి రాముడినో ఊయెలలో వేసి ఊపుతూ లాలిపాట పాడుతున్నారు చుట్టూ చేరిన పడతులు. అప్పుడు ఆ భామలు వేసుకొన్న అలంకారంతో పాటు, కంకణాల, మొలనూలి గంటల రమ్యమైన రవళులు వర్ణిస్తూ ఉంది బామ్మ.

నాకు వెదుక బోయిన తీగె ఎదురయి నట్లైంది! సందర్భం చక్కగా కలిసి వచ్చినట్లైంది! నా మనసునిండా మూగిన ఊహాలకు భాష్యం చెప్పే బామ్మ మెడచుట్టూ చేతులు వేసి గారాబం చేస్తూ అన్నాను.

“బామ్మా! ఎంత అందంగా ఉండేవాళ్ళే ఆ భామలు ఉయ్యాలతొట్లో పడుకున్న బాలకృష్ణుడికి వేరే జోలపాటలు ఎందుకే! ఆ అందెల రవళులకూ, కరకంకణాల గలగలకూ- వాడికి ఎప్పుడో నిద్రపట్టేసి ఉంటుంది. ఆటకాయ వేషాల్తో

కొంతసేపు ఆ గొల్లభామల మొలనూలి గంటలు చేతికి చిక్కించుకొని ఆడుకుని ఉంటాడు కూడా !"

బామ్మ నవ్వింది నా మాటలకు. ఆమెకు ఏమి జ్ఞాపకం వచ్చిందో! తలచుకుని తలచుకుని ముసి ముసిగా నవ్వుతూ అన్నది.

"బాగా చెప్పావే పిల్లా! మీ నాయన చిన్నప్పుడు అచ్చంగా అట్లాగే చేసేవాడు. భుజాన వేసుకుంటే మెడలోని గొలుసులన్నీ పిడికిలి బిగించి పట్టుకుని లాగేసే వాడు. ఒక సారి అరిగిపోయిన కాసికాయల గుండ్ల గొలుసు చేతుల్లోకి ఊడి వచ్చింది కూడా."

నాకు నవ్వు వచ్చింది నాన్నను అడ్డాలలో బిడ్డగా ఊహించుకుంటే! బామ్మను బాగా ఆడించే వారు కాబోలు!

"ఇంకా ఏమిచేసేవారు బామ్మా నాన్న!"- అని అడిగాను కుతూహలంగా.

"నల్లపూసలపేరుల్ని గుప్పిట బిగించి పట్టుకొని గుంజే వాడు. మెరిసే చేతిగాజుల్ని పట్టుకుని పరీక్ష చేసేవాడు. ఎత్తుకుంటే వడ్డాణంలో కాలుదూర్చి ఏడ్చి హంగామా చేసేవాడు. పక్క లో పడుకున్నట్లే పడుకుని పాదాలదగ్గరికి పాకి వచ్చి-కడియాలూ పాంజేబులతో ఆడుతూ కూర్చునే వాడు. ఎత్తుకుని ముద్దుపెట్టుకుంటే ముక్కెర పకుట్టు గుంజే వాడు!"

బామ్మ చెప్పుకుపోతోంది మైమరుపుగా. బాలకృష్ణుడి అల్లరితో విసిగిపోయి చిరుకోపం ప్రదర్శిస్తూ ఉన్న యశోదా

దేవిలాగా ఆవిడ నాకు కనిపించింది.

"చాలాఉన్నాయన్నమాట నాన్నగారి బాల్యలీలలు! ఎప్పుడూ చెప్పలేదేం బామ్మా! అయితే నీకు వొంటి నిండా అన్నిరకాల నగలు ఉండేవన్నమాట! తాతయ్య నీకుచాలా సొమ్ములు చేయించాడే! ఎంత ప్రేమో నీ మీద!".... అన్నాను కాస్త చిలిపిగా.

తాతయ్యకు బామ్మమీద కల ప్రేమకథ మొదలు పెడితే అది చాలా పెద్దకథే అవుతుంది. ఆ కథ ఇప్పుడు చెప్ప నీయకుండా బామ్మ దృష్టిని నగలమీదకి మళ్ళేట్లు చేశాను.

బామ్మకు సొమ్ములన్నీ చిన్నప్పుడే వాళ్ళ పుట్టింటి వాళ్ళు చేయించారట. కాలం జరుగుతూ నగల ఫాషన్లు మారినప్పుడల్లా అవి చెడగొట్టించి ఇంకా కొంత బంగారం వేసి తాతయ్య కొత్తనగలు చేయిస్తూ ఉండేవాడట. ఫాషన్లు మారినప్పుడల్లా ఈ కాలపు వాళ్ళు క్రొత్త వస్తువులు మార్చు కున్నట్లు!

"అయితే బామ్మా! మీ పుట్టింటి వాళ్ళు భలే భాగ్య వంతులన్నమాట!"— అన్నాను సాలోచనగా.

పుట్టింటిపేరు ఎత్తితే ఏ ఆడపడుచుకు ఆనందం కలుగదు. బామ్మ ముఖం సంతోషంతో వెలిగిపోయింది. ఆమెకు క్రొత్త ఉత్సాహం వచ్చింది.

"అవునే పిల్లా! మా వాళ్ళు ఆ కాలంలో బాగా ఉన్నవాళ్ళే! పిల్లలు పుట్టి పోయి పోయి దక్కా-నేమో,

నన్ను బహు గారాబంగా పెంచారు. ఒంటినిండా మోయ లేనన్ని సొమ్ములు చిన్నపిల్లగా ఉన్నప్పుడే చేయించారు. ఆ రోజుల్లో బస్తాధాన్యం మూడురూపాయలు అమ్ముతుండేది. శవిరీబంగారం పదమూడు రూపాయల కన్నా (13 రూపాయలు) ఉండేదికాదు!"

శవిరీ పదమూడు రూపాయలా! ఈ నాటి ధరతో పోల్చటానికూడా సాహసించలేకపోయాను.

"అయితే బామ్మా! ఏమేమి నగలు ఉండేవి నీకు! జ్ఞాపకం ఉంటే చెప్పవూ?".... ప్రాధేయపడినట్లు అడిగాను.

పుట్టింటి వారి గొప్పతనం గురించిన జ్ఞాపకాలతో మైమరచి ఉందేమో-వాళ్ళు తనకు చేయించిన సొమ్ములన్నీ ఏకరువు పెట్టటం మొదలు పెట్టింది బామ్మ. అందులోనూ క్రమబద్ధంగా శిరస్సుమీద పెట్టుకునే ఆభరణాలతో ఎత్తుకుంది కథనం.

"పాపిట బిందీలు ఉండేవి. పాపిటిమీదనూ ముంగురుల మీదగానూ వ్రేలాడుతూ ఉండే గొలుసులు, నుదుటి మీదకు కొంచెం వ్రేలాడుతూ రాళ్ళు పొదిగిన పతకం కూడాఉండేది".

నాకు లీలగా కన్నులముందు ఒక కన్నెముత్తయిదువు ఆకారం గోచరిస్తూ ఉంది బామ్మ వయస్సులో ఉండగా ఎంత శృంగారముగా ఉండేదో! చక్కని రూపు ఆవిడది.

ముఖానికి మేలిమి పసుపు రాసుకున్న మెరుపుచాయతో, కళ్ళనిండా కాటుకతో, నుదుట ఎర్రని కుంకుమతో-ఉండే ఆ ముద్దరాలు మెల్ల మెల్లగా ఆభరణాలు ఒక్కొక్కటే అలంకరించుకుంటూ నాకళ్ళముందు రూపు దిద్దుకుంటూఉంది

"చంపసరాలు ఉండేవి. చెవుల దుద్దులలోనుంచి గిలిసి వెంట్రుకల చిక్కులలో దూర్చి పెట్టుకొనే దానిని. కాతీ, తమలపాకు–అని నడినెత్తిన పెట్టుకునే సొమ్ములు ఉండేవి"....అన్నది బామ్మ,

ఇదేమిటో కొత్తపేరే! నా ఆశ్చర్యాన్ని చూచి ఆ ఆభరణ విశేషాన్ని బామ్మ మరికాస్త వివరించి చెప్పింది.

"కాగితీ–అనే దాంట్లో అది నిజంగా 'కా' అనే అక్షరంకాదు. 'కీ' కూడా కాదు. ఉచ్చారణలో కాస్త దగ్గరగా 'క్యా' అనే అక్షరాన్ని పోలి ఉంటుంది. అర్ధచంద్రా కారంగా ఉండే ఆభరణం ఇది. బంగారపు రేకుతో చేసి మధ్యలో ఎర్రరాయి పొదుగుతారు.

'తమలపాకు' తమలపాకు ఆకారంలోనే ఉంటుంది. చుట్టూ సన్నని బంగారపు గజ్జెలు అతుకుతారు. 'కాగితీ, తమలపాకు' ఈ రెండింటికీ కూడా క్రింద తూములాగా ఉంటుంది. అందులో నుంచి సన్నని పాయగా వెంట్రుకలు తీసి బిగించిఆభరాణాన్ని కదలకుండా అమర్చుతారు.

'రాగిడీ–కమ్మలు'–ఇవి కూడా నడినెత్తిన కాస్త అటూ ఇటూగా పెట్టుకునేవే. కాగితీ, తమలపాకు కంటే మరికాస్త బంగారం ఎక్కువే పడుతుంది వీటికి. రాగిడీ–కమ్మలు–ఇవి రెండూ ఒకటి పెట్టుకున్నప్పుడు మరొకటి తప్పక పెట్టుకోవాలనే ఆచారం ఉండేదట!

కొన్నాళ్ళకు ఈ నగ మోటు అయిపోయిందట, అప్పుడు తాతయ్య దానిని చెడగొట్టించి నాగరం చేయించా

డట. తాతయ్యకు క్రొత్త ఫ్యాషన్లంటే మోజుగానే ఉండేది గావును!

బామ్మ కళ్ళుమూసుకుని తన చిన్నతనపు రోజుల్లో ధరించిన ఆభరణాలన్నీ ఒక్కొక్కటీ పేర్లతో సహా వర్ణిస్తూ ఉంది! నా మనస్సులోని పడుచుపిల్ల ఆకారం ఒక్కొక్క నగా అలంకరించుకుంటూ ఉంది. కన్నులు మూసుకుని ఆ మనోహరాకారం దర్శించుతూ ఉన్నాను.

"తిరుగుడు పువ్వు, అని ఉండేది. జడ మధ్యలోనో కొప్పునడుమనో వెంట్రుకల్లో దూర్చి మెలితిప్పి పెట్టుకునే దానిని".

శిరోజాలంకరణ అది. ఇప్పటివాళ్ళు పెట్టుకునే జడ బిళ్ళ వంటిది అయి ఉండాలి.

"మాటీలు అనేవి చెవులపైన జుట్టు నుంచి వేలాడు తుండేవి. తెల్లరాళ్లూ కెంపులూ వేసి చేయిస్తారు దీనిని"

ఇంకా 'చామంతి బిళ్ళ' ఉండేది. ఇది కూడా జడలో తగిలించుకునేదే."

అక్కడికి శిరోజాలంకరణ పూర్తి అయింది. నడినెత్తిన మొదలుపెట్టిన ఆభరణ విశేషాలు సిగపాయలో, జడ మధ్యలో-ఇరుక్కని తళతళలుగా మెరుస్తున్నాయి.

జడచివర కుప్పెలు ఉండేవి. బంగారపు పనితనంతో నల్లటి కుప్పెలు జడచివర వ్రేలాడుతుంటే, తాచుపాము పడగ ఆడించినట్లే ఉండేది.

. బామ్మ ఎంత చక్కని వర్ణన చేసిందీ! నా కనుసన్న లలో రూపుదిద్దుకుంటున్న పడుచుపిల్ల జడవేసుకోవటం పూర్తి

అయింది. శిరస్సునిండా, శిరోజాలనిండా ధగధగలాడే బంగారపు అలంకారాలు అమర్చుకోవటం అయింది.

కోటేరు వంటి ముక్కు, ఆ ముక్కుకు రాళ్ళతో చేసిన ముక్కుపుడక, దోసకాడ, మరికాస్త క్రిందకు వేలాడుతూ బులాకీ.

"ముక్కున హురుమంజి ముత్యాల ముంగర
కమ్మ వా తెరమీద గంతులిడగ"

అంటూ కవులు వర్ణించుకున్న ముక్కెర ఆడవారి ముక్కుకు ఎంత అందాన్ని ఇస్తుందో! భామా కలాపంలో ఒక మధుర ఘట్టం జ్ఞాపకానికి వస్తుంది నాకు. సత్యభామా దేవి ఎన్నిలంచాలు ఇస్తానన్నా కృష్ణుని వద్దకు రాయబారం తీసుకు వెళ్ళటానికి నిరాకరిస్తుంది చెలికత్తె. ఏదో అడ్డంకి చెప్పి బెట్టు చేస్తుంది. ఎన్ని నగలు ఇస్తానన్నా, మూతీ ముక్కూ విరిచి కదలనంటుంది. ఆఖరుకు ప్రాణం విసిగి- "నీకు ఏంకావాలో విసిగించక చెప్పవే"....అని సత్యభామ అడగ్గా, చెలికత్తె సత్యభామ ముక్కున ఉన్న ముక్కెరమీద తనకు గల కోరికను వెల్లడి చేస్తుంది. ఆడవాళ్లు ధరించే అన్ని ఆభరణాలలోకి ముక్కెరకు ఉండే ప్రాధాన్యం ఈ సన్నివేశం నిరూపిస్తుంది. సత్యభామ ఇచ్చిన ముక్కెరను ఏదో పెన్నిధి దొరికినంత ఆనందంతో అందుకుని రాయబారానికి చెలికత్తె బయలు దేరుతుంది. ఆహా! ముక్కెర మహిమ!

అంతటితో ముక్కు అందం ముచ్చటగా అమరింది. చెవులు మాత్రం ఇంకా బోసిగానే ఉన్నాయి.

"తళతళమను రత్న తాటంకములు మెరయ పసిడి కుండలముల పడతి ఎక్కడికే !"....అని నేను రాగం తీసే టప్పటికి బామ్మ కర్ణాభరణ విశేషాలు చెప్పటం ప్రారంభించింది.

"చెవులకు దుద్దులు, విధిగా ఉండేవి. ఆడపిల్లలకు సంవత్సరం లోపునే చెవులు కుట్టించడం ఆచారంగా ఉండేది. బంగారపు కాడ, ఒంటి ముత్యం లోలాకు-అప్పటి నుంచీ పిల్లలకు తగిలించే వాళ్ళు, ఈ రోజుల్లో ఆడపిల్లలకు మల్లే బోసి చెవుల్తో ఉండేవాళ్ళు కాదు.

'తాలూకా'.... అని తమ్మెకు కాస్త పైగా పెట్టుకునే వాళ్ళం"

"'తాలూకా' ఏమిటమ్మాయి! తాలూకాలూ జిల్లాలూ చెవులకు ఏలా తగిలించుకునే వారూ!".... అన్నాను నవ్వుతూ.

"అది అంతేలే! చెవికి తగిలించుకునే ఆ బంగారపు వస్తువుపేరు 'తాలూకా' అంటారు. ఇంకా 'పచ్చరాళ్లు' అని ఉండేది. అది రాళ్ళతో పొదిగిన వస్తువు. తాలూకాను కాస్త పైన పెట్టుకునేవాళ్ళం!".... అన్నది బామ్మ.

సరిపోయింది! చెవి తమ్మెభాగంనుంచి పైకి పోతున్నది బామ్మ చెవి పొడుగునా బంగారపు తాపడమే! ఆ చెవి ఎంత షోకుగా ఉండేదో రూపకల్పన చేసుకుంటున్నాను.

"మత్స్యబావిలీలు'-మరికాస్త పైన ఉండేవి. ఇంకా కాస్త పైన-అంటే ఇంచు మించు చెవిపైన భాగంలో 'కాశీఉట్లు' పెట్టుకునే వాళ్లం. చెవికి ఇటువైపు గూబ బావిలీలు ఉండేవి. 'బొంగడలు' అనే వస్తువు కూడా కాశీఉట్ల దగ్గరలోనే పెట్టుకునే దాన్నని జ్ఞాపకం"

వింటూ వింటూ బామ్మ చెవులవంక పరీక్షగా చూచాను. కాశీఉట్లూ, మత్స్యబావిలీలూ పెట్టుకున్న చెవులుకదా అవి! చెవి పొడుగువా ఆ ఆభరణ విశేషాలు ధరించిన చిహ్నాలు అలాగే ఉన్నాయి.

చెవులను సింగారించటం పూర్తి అయింది. ఇంతటితో ముఖమో, శిరస్సూ భూషణాలంకారంతో ధగ ధగ లాడు తున్నవి.

కన్నె ముత్తయిదువు కంఠసీమ మీదకు పోయింది నా మనస్సు. జిలిబిలిగా మెలివడి పోయిన మేలిమి బంగరు సరులు, ముత్యాల హారాలు! బామ్మ కంఠ హారాల పేర్లు చెప్పుకుపోతూ ఉంది.

" పట్టెడు, పులిశేరు, నాను, చింతాకు అడ్డిగె, గుళ్ళ పేరు, కట్ల కాసుల పేరు, కవిరీలపేరు, అర వవరసులపేరు, వరహాలపేరు, సిరిభాగాలపేరు, పగడాల దండ, కంటె — ఇవన్నీ మెడలో ధరించే వస్తువులు. కంటెలో రెండు మూడు రకాలవి ఉండేవి. మెలికల కంటె, నాగబంధం కంటె, గుళ్ళకంటె— ఇలా ఆకారాన్నిబట్టి పేర్లు మార్పుతో ఉండేవి."

ఓహో! ఏమి పేర్లు! ఏమి పేర్లు! ఈ పేర్లుకూడా ఎంత శృంగారంగా ఉన్నాయో! నేను వాటిని ప్రత్యక్షంగా చూడకపోయినా బామ్మవర్ణనతోనూ, ఆ పేర్ల పేరుతోనూ ఒక్కొక్కటిగా నా కళ్ళముందు రూపు తెచ్చుకుంటూ ఉంది.

గట్టి కంటె సుమారు (30) ముఫ్ఫై శవిరీలు ఉండేదట! శవిరీలపేరూ, వరహాలపేరూ, గట్టికంటే-పెట్టుకునే ఆ మెడ ఎంత ధృడంగా ఉండి ఉండాలో! ఇంకా కట్ల కాసులపేరు నలభై శవిరీల ఎత్తూ మోయాలి కదా!

ఒకప్పుడు కట్లకాసులపేరుల్నీ, గట్టి కంటెల్నీ పెట్టుకుని మోసిన బామ్మ మెడ ఇప్పుడు ముదిమి పైన పడి శుష్కించి పోయింది. కాని అప్పుడు ఆ మెడ శంఖంవలె ఎంత అందంగా ఉండేదో-అని ఊహించుకుంటూ ఉంటే, నా దృష్టి మురుగులు తొడుక్కున్న ఆమె ముంజేతుల మీదకు పోయింది.

"దండ కడియాల సంగతి చెప్పవూ బామ్మా"....అన్నాను. దండ కడియాలూ వంకీలూ, గజ్జెల తాయెతూ, బాజూబందులూ-ఇవన్నీ దండ చేతులకు పెట్టుకునేవాళ్ళం. ముంజేతులకు గాజులు. కంకణాలు, గోట్లు, పోచీలు, మురుగులు, పులిశేరు గొలుసులూ ఉండేవి.

బాహుమూలం నుండి ప్రారంభమైన బంగారుతొడుగు ముంజేతుల వరకూ వచ్చింది. దండ కడియాలూ. వంకీలూ పెట్టుకున్న ఆ దండ ఎంత సొంపుగా ఉండేదో!

అంతవరకూ సజీవ చిత్రాన్ని మనసులో రూపకల్పన చేసుకునేటప్పటికి-ఆ చేతివ్రేళ్ళు బంగారం లేకపోతే భాసించవేమోననిపించింది,

చేతివ్రేళ్ళకు మాత్రం తక్కువేమిటి! ఉంగరాలు టాకులు, కళ్యాణపుటుంగరంతో సహా ఇంచు మించు అన్ని వ్రేళ్ళకూ పెట్టుకునేదట బామ్మ. రాళ్లూ, ముత్యాలూ తాపినవీ, అచ్చు బంగారంతో మలిచినవీ ఆ ఉంగరాలు. ముద్దువేలినున్న 'ముద్దుటుంగరము'! .... అన్నట్లు ఆ వేళ్ళకు తగిన ఉంగరాలు ఎంతో ముద్దుగా ఉండేవి కాబోలును.

“ఉంగరాల చేతితో మొట్టేవాడు చెపితేనే వింటారు!”....అని అంటూ ఉంటారు మనవాళ్ళు. ఉంగరాలు ఉట్టినే చేతి వ్రేళ్ళకు అందం ఇవ్వటమే కాదు-మనిషి దర్పానికీ అంతస్థుకూ ప్రతీకలు !

వనవాసానికి వెళుతూ, సర్వాభరణాలూ, చీనిచీనాంబరాలూ వర్జించి మునివేషధారియై బయలుదేరిన రామచంద్రుడికి-మామగారు పెళ్ళిసమయంలో ఇచ్చిన ఉంగరం మీద మక్కువ తీరలేదు కాబోలు! అది మాత్రం చేతివ్రేలికి తగిలించుకుని అడవులకు వెళ్లాడట. దానినే ఆనవాలుగా హనుమంతుడికి ఇస్తాడు సీతకోసం వెతక బోయే సందర్భంలో.

మనపెళ్ళి వేడుకలలో, లాంఛనాలలో -ప్రధానపుటుంగరం అని, కళ్యాణపు ఉంగరం అని-ఉంగరానికి ప్రత్యేక గౌరవం ఉన్నది.

ముద్రికలూ, ముద్దుటుంగరాలూ అలా ఉంచితే-

తర్వాత నా దృష్టి నిలిచింది కన్నెరూపు నడుము మీద! మరిసన్నటి నడుము అలా గాలికి వదిలి వేస్తే ఎలా!

వడ్డాణం ఉండేది. గజ్జెల వడ్డాణం. పాతిక ముప్పై కవిరీలతో చేయించారు మావాళ్ళు. అది పెట్టుకోకపోతే పెళ్ళి పేరంటం ఏమీ జరగదు!"....అన్నది బామ్మ వడ్డాణపు ప్రాముఖ్యాన్ని తెలియ జేస్తూ.

మేఖల, హేమమేఖల, కింకిణి, రశన-ఇన్నిరకాలుగా కాళిదాసు వర్ణించిన వడ్డాణం!

గుడిలో పార్వతీ అమ్మవారి నడుముకు అందంగా అమరిన వడ్డాణం నా మనసులో మెదిలింది. దానికి గజ్జెలు కూడా ఉంటే ఎంత బాగుండేదో! పట్టు చీర ధరించి, నడుముకు గజ్జెల వడ్డాణం గీలించి నా భావనాసుందరి బామ్మ చిన్ననాటి పడుచురూపంతో నడచి వస్తూంది.

అందెల రవళులు మాత్రం ఇంకా వినరావటంలేదు. నడుస్తున్నప్పుడు చిరుచిరుగా మోగే ఆ మంజుల రవళి విన రాకపోతే మిగతా అలంకారాలన్నీ వెలవెల పోయినట్లే ఉంటాయి.

ఘల్లు ఘల్లుమనే అందెల రవళి దగ్గరకు వచ్చేటప్పటికి నాకు సీతాదేవి పాదాలకు ఉండే అందమైన నూపురాల సంగతి జ్ఞాపకం వచ్చింది.

వదినగారి ఆభరణాలను గుర్తుపట్ట వలసి వచ్చింది సౌమిత్రికి. కన్నులనిండా నిండిన కన్నీరు- ఆ ఆభరణాలను

సరిగా చూడనీయలేదు. చూచినా అతనికి అంతగా గుర్తు తెలియలేదు. అంటాడు నమ్రతగా-

"నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే
నూపురే త్వభి జానామి
నిత్యం పాదాభివందనాత్"

ఎంత చక్కని భావనా శిల్పం ఇది! వినయ వినమిత సంపన్నుడు లక్ష్మణుడికి వదినగారు ధరించే ఆభరణాలసంగతి ఏమీ తెలియదు. కంఠసీమలో అలంకరించుకొనే బంగారు హారాలు కానీ, ఆమె ధరించే కర్ణాభరణాలు కానీ అతనికి తెలియదు-వాటిని తానెప్పుడూ తలయెత్తి పరకాయించి చూడలేదు కనక. కాని ఆమె కాళ్ళకు పెట్టుకునే నూపురాలు మాత్రం అతడు ఎరుగును. నిత్యం పాదాభివందనం చేసేటప్పుడు చూస్తూ ఉండేవాడు కనుక.

ఈ శ్లోకార్థం మననం చేసుకుంటే చాలును - ఆ పవిత్రభావనతో మనస్సు ఏవో దివ్య తీర్థాలలో మునిగి వచ్చినట్లు రసార్ద్రమయిపోతూ ఉంటుంది.

ఆ రసానందంలో కాస్త మైమరచి ఉన్నానేమో- బామ్మమాటలకు ఉలిక్కి పడ్డాను.

"వంకీ కడియాలు, కడ్డీకడియాలు-ఒక్కొక్కటీ అరవై తులాల వెండితో చేయించేవాళ్ళు. గొలుసులూ గొలుసులూ పావడాలూ కూడా పెట్టుకునే దానిని"

"పావడాలు పెట్టుకోవటం ఏమిటే బామ్మా-కట్టుకుంటారు కానీ!"....అన్నాను అర్థం కాక.

"పిల్లా నీ కన్నీ అనుమానాలేనే! పెట్టుకునే పావడాలు వేరూ కట్టుకునే పావడాలు వేరూను. పాదాలకు పెట్టుకునే వెండి వస్తువు పేరు అది".... అన్నది బామ్మ,

"ఘల్లు ఘల్లు మని పాద గజ్జెలందెలు మ్రోయ
కలహంస నడకల కలికి ఎక్కడికే!"

కూనిరాగం తీసేటప్పటికి బామ్మ నవ్వి అన్నది కదా!

"కలహంస నడకలకు ఇంకా అందం ఇచ్చేవీ, పెళ్ళయిన పిల్లలు తప్పనిసరిగా పెట్టుకోవలసినవీ ఇంకా ఉన్నాయే పిల్లా!"

"నాకు తెలుసులే! మట్టెల సంగతి కదూ నీవు చెప్పేది!"-అన్నాను. బామ్మ కాలివేళ్ళ వంకకు దృష్టి సారిస్తూ. రెండవ వేలికి పెట్టిన మట్టెల అరవళ్ళు ఇంకా అలాగే ఉన్నాయి.

"లలితంబులగు మట్టియల చప్పుడింపార
నంచకైవడి నలనల్ల వచ్చి"

అంటూ భారతంలో తిక్కనగారు వర్ణించినఘట్టం జ్ఞాపకం వచ్చింది. మట్టియల చప్పుడు మగువల నడకలకు ఎంత సొంపును ఇస్తుందో!

"ఒక్క మట్టెలే నీకు తెలిసింది! బొటనవేలికి 'చల్లాలు' అని ఉండేవి. రెండో వేలికి సరే మట్టెలు-నీ పెరిగినవే ఇవి-

పాతికతులాల వెండికి తక్కువ ఉండేవి కావు".... అన్నది బామ్మ.

చల్లాలేమిటో! పాతిక తులాల వెండి మట్టెలు కాలి వ్రేలికి తొడిగితే, ఇంచుమించు జీవితకాలమంతా వాటిని వ్రేలికి తగిలించి ఉంచితే-ఆ వ్రేలు ఏమయిపోయేదో నాకు తెలియదు. బామ్మకాలి వ్రేలు మాత్రం ఇప్పుడు చూస్తే సురక్షితంగానే ఉంది. కలహంస నడకల కలికి కామాక్షి ఆ మట్టెలతో ఎంత లయబద్ధమైన శబ్దం చేయగలదో ఆలోచిస్తున్నాను.

"నాలుగో వేలికి పిల్లేళ్ళు ఉండేవి అయిదో వేలికి కూడా ఏవో ఉండేవి. ఆ పేరు జ్ఞాపకం రావటం లేదు".... అన్నది బామ్మ.

మరిమూడో వేలు ఏమి పాపం చేసుకున్నదో! ఏ తొడవులు తొడగకుండా దానిని అలా ఎందుకు వదిలి పెట్టారో!

అన్ని ఆభరణ విశేషాలూ అంత వివరంగా గుర్తు ఉంచుకొని నాకు విశద పరచిన బామ్మ-కాలి అయిదవ వ్రేలి దగ్గరకు వచ్చేటప్పటికి దాని పేరు మరిచిపోయింది ఆ పేరు కూడా జ్ఞాపకం తెచ్చుకుని చెప్పమని ఇప్పటికీ వేధిస్తూనే ఉన్నాను నేను.

"కుప్పె, రాగిడి బిళ్ళ, కుంకుమరేఖ పా
పట బొట్టు, కమ్మలు, బావిలీలు
లలి సూర్యచంద్ర వంకలు, సూపకము, కెంపు

రవల పల్లెరు బూవు, రావిరేక
బుగడలు, నానుదీగె, సొగసైన మెడనూలు
కంతికంట్లు, సరిపెణ, గుండ్ల పేరు
సరిగె, ముక్కెర, జన్నసరము, లుత్తుండాలు
కంకణంబులు, తట్లు, కడియములును
సందిదండలు, వొడ్డాణ మందమైన
ముద్రికలు, హంసకంబులు, బ్రోయు గజ్జె
లలరు బొబ్బిలి కాయలు గెలుకు మట్టె
లాదియగు సొమ్ము దాల్చి య య్యబల మెరయు"

అయ్యలరాజు నారాయణకవి వర్ణన ఇది. ఆ కాలంలో ఆడవాళ్ళు పెట్టుకునే ఆభరణాల పేర్లన్నిటినీ ఈ పద్యంలో ఎంతో చక్కగా పొందు పరిచాడు కవి. ఇందులో చెప్పిన 'బొబ్బిలి కాయలు' ఆ అయిదవ వేలికి పట్టించవచ్చునా అని ఆలోచిస్తున్నాను.

మహారాణులకూ అంతటి భాగ్యవంతులకూ - ఆ రోజుల్లో ఏడువారాల నగలు-ఉండేవట! అంటే-ఏ వారం పెట్టుకునే సొమ్ములు ఆ వారానికి ప్రత్యేకించి ఉండేవట! ఆ నాటి మహా రాజులకు బహుశా వారం వర్జ్యం తెలుసు కోవాలంటే, అంతఃపురానికి వెళ్ళి దేవిని చూచి, ఆవిడ ఏవారపు సొమ్ములు ధరించిందో గమనించి ఆ వారం పేరు గుర్తుతెచ్చుకునే వారేమో!

కాని బొమ్మ సొమ్ములు-ఏడువారాల నగలకంటె ఏమి తీసిపోయినాయి. మహారాణి భోగమంతా అనుభవించిన

బొమ్మ-సర్వాలంకార భూషితగా తాతయ్యను అలరించిన అందాల పాలవెల్లి బొమ్మ!

"ఆణిముత్యపు హారములు మొల నూలు గజ్జెలు
జోడు అందెలు, రవల పాపట బొట్టు ముంగెర
సమయముగ ధరియించు తల్లికి
హారతి మీరేల ఇవ్వారే!"

ఆ తల్లి ఆభరణాలు 'సమయముగ' ధరిస్తుందట! ఎంతచక్కని సమయం ఇది!

గుడిలో అమ్మవారికీ అయ్యగారికీ కూడా యథాశక్తిని ఏవో భూషణాలు, హారాలు, కిరీటాలు-చేయించుకోనిదే తృప్తి పడడు తెలుగువాడు. భద్రగిరిపైన వెలసిన సీతారామ లక్ష్మణ మూర్తులు ఏ అలంకారాలు లేక దిసిగా ఉన్నారని కదా గోపన్న విలవిల లాడి పోయినాడు! సీతమ్మకు చింతాకు పతకము చేయించి పెట్టాడు సరే-అమ్మవారు కదా- ఆభరణ భూషితురాలు కావలసిందే. అంతటితో ఆగక భరతుడికి పచ్చలపతకమూ, శత్రుఘ్నుడికి బంగారు మొలతాడూ, లక్ష్మణుడికి ముత్యాల పతకమూ, రామచంద్రుడికి కలికి తురాయీ కూడా చేయించి స్వామి వార్లను అలంకరించుకుని కృతార్థుడవుతాడు. ఆ తర్వాత నవాబు భటులు పెట్టే హింసలకు ఓర్వలేక, "అవన్నీ చేయించాను-ఎవరబ్బ సొమ్మని పెట్టుకుని కులుకుతున్నావు రామచంద్రా-" అని దెప్పుతాడనుకోండి। అది వేరే సంగతి। రామదాసు భక్తితో చేయించిన ఆభరణాలు

మనకు చూపిస్తారు. ఇప్పటికీ కలియుగ వైకుంఠం అనబడే తిరుమలలో వేంచేసి వున్న వెంకటేశ్వర స్వామి-ధరించే ఆభరణాలు ఎంతో ఎన్నికైనవి. రత్నాలతో, నవరత్నాలలో పొదగబడిన ఈ ఆభరణాల విలువ సామాన్యుడి అంచనాకు అందనిది.

బామ్మ ఏకరువు పెట్టిన ఆ ఆభరణాలన్నీ అందంగా అమర్చుకోవటానికీ మళ్లా వాటిని తీసి భద్రంగా దాచుకోవటానికీ ఎంత సమయమూ, శ్రమా వినియోగించ వలసి వచ్చేదో!

అయినా, వాళ్ళ అలంకార ప్రియత్వం అటువంటిది.

కాలపరిస్థితులలో అప్పటికీ ఇప్పటికీ ఎంతో మార్పు వచ్చింది. వేషభాషలలోను, అలంకరణ పద్ధతులలోను-ఎంతో మార్పు వచ్చింది. ఇప్పటి ఆడపిల్లలకు ఆ వెనుకటి ఆభరణాలన్నీ మోటు అనిపిస్తాయి. నాజూకుగా మెడలో ఒంటిపేట గొలుసు, చేతులకు ఒకజత గాజులు-చెవులకు రింగులు ఇదీ ఈ నాటి సగటు ఆడపిల్ల అలంకరణ. మరీ నాజూకుదనం నాగరీకం-అలవడితే-ఆ ఒకటి రెండు నగలు కూడా వంటిన ఉండవు. చేతులు, చెవులు, మెడ-అన్నీ బోసిగానే ఉంచుకుని మగపిల్లవాడి లాగానే పాంటు, షర్టు-వేసుకుని తిరిగే ఆడపిల్లలు ఇప్పుడు పట్టణాలలో మనకు ఎక్కువగా కనబడుతున్నారు.

8)

మధ్య తరగతి మహిళకు సొమ్ములపైన మోజు ఉండినా-అవి అందని ద్రాక్షపళ్ళవలెనే మిగిలి పోతున్నవి. బంగారపు ధర ఆకాశానికి అంటుతున్న ఈ రోజులలో నగల మీది వ్యామోహం చంపుకోవటం ఒక్కటే మనకు ముఖ్య కర్తవ్యం.

'అరువుసొమ్ము బరువు చేటు....' అనే మంచి సామెత మనకు ఉన్నది. నగల మీద వ్యామోహంతో అరువు సొమ్ములు తగిలించి, తృప్తిపడటం ఎంత అనర్థకమో చెపుతుంది ఈ పెద్దలమాట.

బంగారు ఆభరణాల మోజు తీరని వారికి మరెన్నో అందుబాటులోకి వచ్చే నకిలీ నగల నమూనాలు ఉన్నాయి. ఇవి ఈ నాడు విస్తృతంగా తయారు చేసి అమ్ముతున్నారు. కొన్నికొన్ని నగలు అసలు బంగారు వస్తువునే మరిపించేటంత ధగధగతో ఆకర్షణతో తయారవుతున్నవి. వీటిపట్ల ఆధునిక తరం ఎక్కువగా ఆకర్షితమవుతూ ఉంది. వెల కూడా అందరికీ అందుబాటులో ఉండటం వీటి విశేషం.

మళ్ళా ఫేషన్లు మారుతున్నవి. మళ్ళా పాతనగలు కొన్నిటిపైన ఆడవారికి మోజు పెరుగుతున్నది. మధ్య కాలంలో మోటయిన ముక్కు పుడకలు మళ్ళా వెనుకటి ప్రాభవాన్ని పొందాయి. ఆడపిల్లలు ముక్కు కాడ తగిలించుకోవటం ఇప్పటి ఫాషను. వెనుకటి నగలన్నీ క్రొత్త పేర్లతో కొద్ది మార్పులతో మళ్ళీ మార్కెటులోకి వస్తున్నాయి.

ఇవ్వాళ ఆడపిల్లలకు సినిమాతార ధరించిన నాను జిగినీ అంటే, కళ్ళు జిగేల్ మనిపించేటంత మోజు. చరిత్ర

పునరావృతమైనట్లు ఈ నగలన్నీ ముందు తరాలనుంచీ-మార్పు చేర్పులతో వస్తూ ఉన్న సంప్రదాయాలే అనక తప్పదు! క్రొత్త నాజూకులూ తొడుగులూ తొడుక్కున్న తొడవులివి. ఈ సంగతి ఇప్పటివాళ్ళకు అంతగా తెలియదు.

ఈ నగలూ నాణ్యాలూ-మేలిమివైనా, నకిలీవైనా-తిండికీ బట్టకూ దిగుల్లేకుండా గడిచిపోయే వారికి మాత్రమే! మరి ఏ పూటకా పూట, పొయ్యి క్రిందకూ పొయ్యిమీదకూ వెతుక్కోవలసి వచ్చే శ్రామిక వర్గం వారి మాట? వారికి ఆనాటికీ ఈ నాటికీ ఒక్కటే వేషధారణ! ఒక్కటే అలంకారం!

"వీసపు ముక్కునత్తు నర
వీసపు మంగళసూత్ర మమ్మినన్
కాసును రాని కమ్మ లర
కాసును కానివి పచ్చ పూసలున్
మాసిన చీరగట్టి యువ
మాన మెసంగగ నేడు రాగ నా
కాసల నాటి వారి కవ
కాంగిని జూచితి నీళ్ళ రేవునన్!"

కవిసార్వభౌముడు ఆనాడు వర్ణించిన రూపురేఖలతో అచ్చుగుద్దినట్లు కనిపించే తెలుగునాటి కనకాంగులు ఏ పల్లెలో చూచినా ఈనాడు మనకు కనిపిస్తారు! నల్ల పూసలు, పసుపుతాడు, మట్టి గాజులు-ఇవి తెలుగు తనానికి ఏ కాలంలో నయినా ప్రతీకగా నిలిచే ఆభరణాలు!

తెలుగు పడుచుకు నగల మీాద మోజు ఎక్కువే-అనేది నిర్వివాదాంశం, కాని ఆమెకు దైవభక్తి కూడా మెండు. భర్తక్షేమం కోసం, సత్సంతానం కోసం, సుఖ శాంతుల కోసం-ఆమె ఎన్నో పూజలూ పునస్కారాలూ చేస్తుంది. కాని, వీటన్నిటినీ మించి ఆమెకు కావలసింది-ఈ జీవన్మరణ వలయాన్ని ఛేదించుకొని, ఈ సంసారబంధం విదిలించుకుని-అందుకో గలిగిన అనంత పారమార్థిక సౌఖ్యం!

ఆ ముక్తిసాధన కోసం-ఆమె సర్వస్వాన్నీ వర్జిస్తుంది. సర్వ సంగ పరిత్యాగి అవుతుంది! మరొక మాటలో చెప్పాలంటే-ఆమెకు అత్యంత ప్రియమైన ఆభరణాలు కూడా అక్కరలేదనేటంత విరాగి అవుతుంది. ఆమె మోక్షలక్ష్మిని అర్థించే విధం చూడండి!

"ఘల్లు ఘల్లున ఝుంకారం చేసే గజ్జెల పావడ లడిగితినా
అందముగా నీ నడుమున వెలిగే బంగరు వడ్డాణ మడిగితినా
శ్రీ కంఠ నవరం రాగిడి బిళ్ళ లోకమాత నిన్నడిగితినా
కేతకి చెక్కిన బంగరు గొలుసుల జడకుప్పెలు నిన్నడిగితినా
ఆదిలక్ష్మి నీ హస్తమున వెలిగే అపరంజి గొలుసులడిగితినా
అందముగా నీ కంఠమున వెలిగే బంగరు కంటె లడిగితినా
అందముగా నీ ముక్కున వెలిగే ముక్కర లిమ్మని అడిగితినా
కమ్మకున్న ముత్యాలు కూర్చిన కానుక బావిలీలడిగితినా
గరుడవాహనము నెక్కి దంపతులు కూడి రమ్మని అడిగితినీ
వేడుకతో మా దంపతులకు నేడు వైకుంఠ మిమ్మని అడిగితినీ!"

ఎంతటి త్యాగ నిరతి ! ఎంతటి మోక్షకామన !

ఆలోచనా లహరిలో తేలిపోతున్నా నేమో-బామ్మ లేవటం నేను అప్పటి వరకూ గమనించలేదు. కాస్త వంగిన నడుముతో ముదిమి కైవసం చేసుకున్న దేహంతో-నడుస్తున్న బామ్మను చూస్తూ నాలో నేను మరొక విధంగా రూపకల్పన చేసుకుంటున్నాను.

"అందమైన కాళ్ళందెలు మ్రోయగా
చక్కగ సందిటి దండలు గదలా
ఒప్పుగ వేళ్ళకు మట్టెలు మెరయా
దత్తుల చేకట్లందము మించా
తీరుగ కస్తూరి తిలకము జారగా
లేతనడుమున నొడ్డాణం బొరయా
అందుపై మొహర్ల పేరందము మించా
గుచ్చిన ముత్యపు పేరులు గదలా
గొప్ప ముత్యపు నత్తటు వెలుగా
సీత వచ్చె రాముని సన్నిధికి !"

ఇదికూడా బామ్మ పాడేపాటే ! సీత సీమంతపుపాట !

నాకు ఆ సీత బామ్మలో స్ఫురించింది. ఇప్పటి వరకూ ఆమె ఏకరువు పెట్టిన సొమ్ముల ఎత్తు ఒకటి ! బామ్మ ఎత్తు ఒకటి ! బామ్మ ఎంత పెద్దసొమ్ము ! తెలుగు వారి ఇంటి సొమ్ము ! * * *

# తెలుగుతనం - తీరుతెన్నులు

ఒక్కొక్క జాతికి ఒక్కొక్క భాషా, సంప్రదాయమూ ఉంటుంది. తెలుగుజాతి చరిత్ర ఉత్తమ సంస్కృతీ సంపన్నమైనది. ఎంతో ప్రాచీనమైనది.

ప్రధాన వృత్తులలో, వేషభాషలలో, ఆచారాలలో, సంస్కృతిలో ఏ జాతి ప్రత్యేకత ఆ జాతిదే. ఆ జాతి అలా రూపొందటానికి కారణం-ఆ జాతి అభివృద్ధి చెందిన పరిసర నైసర్గిక ప్రభావం పైన ఆధారపడి ఉంటుంది.

భౌగోళికంగా సుసంపన్నమైనది తెలుగు దేశం. కొండలు కోనలు, లోయలు, అడవులు-ఒకవైపున కృష్ణ, గోదావరి, పెన్న-మరింకెన్నో ఉపనదులు మరొకవైపున-మన దేశాన్ని సారవంతమైన భూమిగా భాసింపచేసినవి. ఈ నదీమ తల్లులు పునీతం చేసిన తెలుగు గడ్డ కనకగర్భ ఈ గడ్డను నమ్ముకొన్న తెలుగు వాడికి వ్యవసాయం జన్మతః ఏర్పడిన వృత్తి. పాడికీ పంటకూ ఆలవాలమైనది తెలుగు గడ్డ

అందుచేత, అచ్చమైన మన తెలుగుతనం దర్శించుకోవాలంటే-మన ఉనికికి ఊపిరి పట్టులయిన పల్లె సీమలకు మనం పోవాలి. నీర్కావి పంచె మోకాలిపైకి ఎగగట్టి,

నోట్లో పొగాకు చుట్టతో అక్కడ పొలంగట్టుమీదే మనకు వెంకయ్యామామో, నరసయ్యా తాతో, రంగయ్యా బావో ప్రత్యక్షం అయి తీరుతారు.

అక్కడ-అందరికందరూ బంధువులే. వయసుమళ్ళిన వారంతా పిన్నవారికి తాతలే! వయసులో ఉన్నవారంతా ఒకరి కొకరు అన్నలో, బావలో, మామలో కావలసిందే! అట్లా వరుసలు కలుపుకోవటం, ఆప్యాయతలు వొలకబోసుకోవటం పల్లెప్రజల ప్రత్యేకత.

ఇలా బంధుప్రేమలు అల్లుకుపోవటం అనేది మన కుటుంబ వ్యవస్థలోనే ఉన్నది. మన ముందుతరం వరకు మనవి చాలా వరకు ఉమ్మడి కుటుంబాలే! ఇంటికి తండ్రో, లేక పెద్దకొడుకో ఆధిపత్యం వహిస్తే-మిగతా వారంతా అతని అజమాయిషీ కింద మెలిగేవారు. ఒకరంటే ఒకరికి కొంత దగ్గరతనముండేది. కుటుంబ సభ్యులందరికీ-మేమంతా ఒకటి-అనే ఆంతర్యం ఉండేది. కాని ఈ వ్యవస్థ - ఇప్పుడు చాలావరకు మారిపోయింది. వయస్సురాగానే ఎవరి జీవన విధానం వారు ఎన్నుకుని స్వతంత్ర జీవనం గడపటం ఇప్పుడు సర్వసామాన్యమై పోయింది.

తెలుగు దేశంలో ప్రతి కుటుంబానికీ ఒక ఇంటి పేరు ఉంటుంది ఒకే ఇంటిపేరున్న రెండు కుటుంబాల మధ్య వివాహ సంబంధాలు చేయరు. కుల, గుణ, రూప, ఆర్థిక, విద్యావిషయాలతో తమకు సరిఅయిన వారిని ఎన్నుకొని పెద్దలు పిల్లల వివాహాలు చేయటం మనకు అనాదిగావస్తున్న ఆచారం. వివాహ విషయంలో మేనరికాలు చేసుకోవటం

వాడుకలో ఉన్న సంప్రదాయం. అంటే-సోదరి కుమారుడికి సోదరుని కుమార్తెను ఇచ్చి వివాహం చేయటం, సోదరి కుమార్తెను సోదరుడికి ఇవ్వటం సాధారణంగా జరగదు. అన్యగోత్రముల వారితోనే వివాహం జరుపవలెననే ఆచారం ఉంది. ఏ వర్ణములోని పురుషుడు ఆ వర్ణములోని కన్యనే వివాహం చేసుకోవాలనే సూత్రాన్ని మనవాళ్ళు పాటిస్తారు.

వెనుకటి రోజులలో వధూవరుల మధ్య వయసు తారతమ్యం ఎక్కువగా ఉండేది. మనువు చెప్పిన ప్రకారం ముఫ్ఫైఏళ్ళ వరునకు పన్నెండు సంవత్సరాల బాలికను వివాహం చేయాలనే నమ్మకంతో బాల్యవివాహాలు పూర్వం ఎక్కువగా జరిగేవి. కాని రాను రాను ఈ అభిప్రాయం మారి వధూవరుల వయస్సుమధ్య అంతరాయం చాలా వరకు తగ్గుతూ వచ్చింది. వెనుకటి రోజుల్లో కన్యాశుల్కం ఉంటే-ఈ రోజుల్లో వరశుల్క దురాచారం ప్రబలింది.

కందుకూరి వీరేశలింగం పంతులుగారి అకుంఠిత దీక్షా ఫలితంగా, సంఘ సంస్కరణోద్యమ ఫలితంగా-ఈ నాడు వితంతు వివాహాలు, కులాంతర, మతాంతర వివాహాలు సర్వ సామాన్యమైపోయినవి.

వివాహాలు పూర్వం ఎన్నో వేడుకలతో సంప్రదాయ బద్ధంగా అయిదు రోజులు జరుపుకునే వారు. సంఘసంస్కరణోద్యమంవల్లనైతేనేమి, ఆర్థిక పరిస్థితుల వల్లనైతేనేమి-వివాహపు తంతు-చాలా సంక్షిప్తంగా, ఒక్క రోజుతోనే ముగుస్తున్నది. మితిమీరి ఆడంబరాలకోసం ఖర్చుచేయటం మంచిది కాదనే వివేకంతో-కొంతమంది ముందుకు వచ్చి

రిజిష్టర్డు వివాహాలతోనే సంతృప్తి పడుతున్నారు.

వెనుకటి రోజుల్లో మనవాళ్ళు జరుపుకునే వేడుకలు వివాహ సమయంలోనూ, ఇతర శుభకార్యాల సందర్భం లోనూ ఎన్నో రకాలుగా ఉండేవి. వీటిలో ఏదో ఒక అంతరార్థం ఉండి, వధూవరులకే కాక, చూచే వారందరి హృదయాలనూ స్పందింప చేసి దివ్యానుభూతిని కలిగించేవిగా ఉంటాయి.

స్నాతకం తంతులో పెళ్ళికొడుకు అలిగి కాశీకి వెళ్ళి పోతాననే అభినయం చేయటం, పల్లకీలో ఊరేగింపు, బువ్వము బంతులు, చెండ్లాటలు, వాకిలి దగ్గర పేర్లు చెప్పించటం, అప్పగింతలు-ఇలా ఎన్నో వేడుకలు జరుపుకుంటారు. ప్రతి సందర్భంలోనూ పాడుకోదగినవి-సరస శృంగార రసస్ఫూర్తితో నిండినవి-అందమైన స్త్రీల పాటలు ఎన్నో ఉన్నవి.

ఒక్క పూటలో ముగించే ఈ నాటి పెళ్ళిళ్ళలో ఈ ముచ్చటలకు తావు లేదు. గుప్తధనం వంటి ఈ పెళ్ళిళ్ళ పాటలు, ఆనోట ఆనోట వినవచ్చే అందమైన జానపద సాహిత్యం-ఈ రోజుల్లో ఎవరికీ అక్కరలేనివిగా పరిగణింప బడి అంతరించి పోతున్నవనే చెప్పాలి.

ఈ పెళ్ళి పాటలేకాక, అపారమైన జానపద సాహిత్య సంపద మనకు ఉన్నది. మజ్జిగ చిలుకుతూనో, రాట్నం వడుకుతూనో, కలుపు తీస్తూనో, నాట్లు వేస్తూనో, కోతలు కోస్తూనో, వడ్లు దంచుతూనో, తిరగలి విసురుతూనో- శ్రమ

తెలియకుండా పాడుకొనే పదాలు-జానపదుని నోట వాగ్ధారగా ప్రవహించి వచ్చిన సహజ సరస్వతి-ఈ పల్లెపదాల సాహిత్యం బాలగేయాలు, లాలి పాటలు, మేలు కొలుపులు, గొబ్బి పాటలు, సువ్విపాటలు, దంపుళ్ళ పాటలు, ఉయ్యాల, తుమ్మెద పదాలు, రామాయణ, భారత, భాగవతాది పురాణ కథా కల్పనలు, ఏలపాటలు-ఇలా ఎన్నో రకాలుగా, అనుశ్రుతంగా ఉబికి వచ్చిన మన జానపద సాహిత్యం-కాల గమనంతో పాటు తెరమరుగున పడిపోయింది. ఈనాడు పల్లె ప్రజలు కూడా దంపు దంచటమూ లేదు - దంపుళ్ళ పాటలు పాడటమూ లేదు. అధిక ప్రచారంలోకి వచ్చిన సినిమా పాటలు నోటికి పట్టినట్లుగా ఈ పాత పాటలు పట్టు పడటం లేదు.

మనం ఎంతటి అపురూపమైన సహజ సుందరమైన సాహిత్య సంపదని పోగొట్టు కుంటున్నామో గుర్తెరిగి, ఇటీవల కొంతమంది కవులూ, సాహిత్య ప్రియులూ ఈపాటలని సేకరించి గ్రంథస్థం చేస్తున్నారు. విశ్వవిద్యాలయాలు వీటిని పరిశోధనకు అర్హమైనవిగా ఎంచి సముచిత స్థానం ఇవ్వటం సంతోషించ వలసిన విషయం. ఈ కృషి ఇంకా విరివిగా జరగాలి.

తెలుగునాట-అది రాజేంద్రభోగి మందిరంకానీ, రవి చంద్రులు తొంగి చూచే పూరిల్లు కానీ - తెలుగుదనమంటే ఏమిటో ఆ ముంగిట్లోనే మనకు దర్శనీయంగా గోచరిస్తుంది. తెలుగు ముంగిట్లో కానవచ్చే శోభనూ, అలంకారాన్నీ కవి ఇలా వర్ణిస్తాడు-క్రీడాభిరామంలో.

"చందనమ్మున కలయంపి చల్లినారు
ముగ్గు లిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినారిందు రజమున రంగవల్లి
కంజముల తోరణంబుల గట్టినారు"

ఇంటిని ఇంత శుభప్రదంగా, శోభప్రదంగా-తీర్చిదిద్దుకునే తెలుగు ఇల్లాలు-లలిత కళా విశారదే కాక, అలంకార ప్రియ కూడా అయివుంటుంది. ఆమె అలంకరణ విలక్షణమైనది.

ముఖానికి మైపూతగా ఛాయ పసుపు రాసుకోవటం, చేతులకు గోరింటాకూ, పాదాలకు పారాణీ పెట్టుకోవటం-ఆమె సౌందర్యారాధనకు గీటురాళ్ళు. చీర, రవిక, బొట్టు, కాటుక, మట్టిగాజులు, నల్లపూసలు, మంగళసూత్రాలు, మట్టెలు-ఇటువంటి సామాన్యపు టలంకరణతో కనిపించే స్త్రీమూర్తి తెలుగుతనం మూర్తీభవించిన ముత్తయిదువు.

నవనాగరికత తెచ్చిపెట్టిన వింత అభిరుచులతో-ఈ నాటి తెలుగు వారి అలంకరణలో ఎన్నో క్రొత్త పోకడలు కనిపిస్తాయి ఒకప్పుడు తాంబూల చర్వణంతో ఎరుపెక్కిన అధరాలకు ఈనాడు లిప్‌స్టిక్ శరణ్యమైంది. అలాగే-మైపూత కోసం పసుపు స్థానంలో ఎన్నో క్రీములు, ఫేస్ పౌడర్లు, గోరింటాకు బదులు నెయిల్ పాలిష్‌లు-వాడకంలోకి వచ్చాయి. అయితే -మనవాళ్ళ చీరకట్టు మాత్రం మార్పు చెందకుండా నిలిచి పోయింది.

ఆ నాడు మన స్త్రీలు ధరించిన ఆభరణాలు ఆపాదమస్తకము ఉండి ఎంతో ఆకర్షణీయంగా ఉండేవి. అమరావతి నాగార్జున కొండ శిల్పాలలో కొన్ని. మన ప్రాచీన సాహిత్యం ద్వారా కొన్ని-ఈ ఆభరణ విశేషాలను మనం దర్శించవచ్చును.

పాపిటి బిందీలు, రాగిడీ, కమ్మలు, చంద్రవంక, రావిరేక, చామంతిబిళ్ళ, ముక్కుపుడక, తిరుగుడు పువ్వులు, కుప్పెలు, గట్టినూళ్ళు, సందిదండలు, పాళీలు, సరిపెణలు, తాలూకాలూ, కాశీఉట్లు. మత్స్య బావిలీలు. కుతికంట్లు అడ్డిగెలు, పట్టెడలు, కాసుల పేర్లు, చంద్రహారాలు, ముత్తెపుపేరులు, వంకీలు, దండ కడియాలు, అంగుళీయకాలు. కడియాలు,అందెలు, పాంజేబులు, మట్టెలు, పిల్లేళ్ళు, చల్లాలు, బొబ్బిలికాయలు- ఇలా ఎన్నో పేర్లుగల ఆభరణాలు ఆ నాటి స్త్రీ ధరిస్తూ ఉండేది. కొన్నిటి పేర్లు మాత్రం తెలిసినా ఆ ఆభరణ విశేషం ఎలా ఉంటుందో ఇప్పటి వారికి తెలియదు. అయినా కొన్ని పేరుమార్పులతో, సవరింపులతో, ఈ పురాతనమైన ఆభరణాలన్నీ - ఇప్పుడు అమలులోకి వచ్చి ఆధునీకరణ పొంది చెలామణి అవుతున్నాయి.

తెలుగు వారికి పారమార్థిక చింతన ఎక్కువే! ఎంత చిన్న ఊరయినా, ఆ ఊరికి ఒక దేవాలయం ఉండకుండా ఉండదు. ఒక రామాలయమో, హనుమంతుని గుడో, ఒక శివాలయమో, కనీసం ఒక గ్రామదేవత గుడో ఉండి తీరుతుంది. రామయ్య తండ్రినీ, సీతమ్మ తల్లినీ మనవాళ్ళు అడుగడుగునా మననం చేసుకుంటారు. సీతారాముల కష్టాలు,

తమవి. సీతారాముల ఎడబాటు తమకు విరహం. వారి ప్రణయం తమ జీవితాల్లో మకరందం చిమ్ముతుంది. సీతా రాముల కథలు-ఎన్ని చెప్పుకున్నా తనివి తీరదు వారికి. వారిని తమ జీవితాల్లో ముడిపెట్టుకుని కష్టసుఖాలలో భాగ స్వాములనుగా చేసుకుంటారు.

"సీతమ్మ వాకిటా చిరుమల్లె చెట్టు
చిరుమల్లె చెట్టేమొ చితక పూసింది
చెట్టు కదలాకుండ కొమ్మ వంచండి
కొమ్మ విరగకుండ పూలు కోయండి
అందులో పెదపూలు దండ గుచ్చండి
దాచుకో సీతమ్మ రాముడంపేడు!"

సీతకు రాముడు పూలుపంపించడం అనే మనోహర భావన పాటలో నిక్షిప్తం చేసుకుని పరవశించి పోతారు.

అలాగే-చిలిపితనం చేసే చిన్నారి పసివాడిలో బాల కృష్ణుని దర్శించి ఆనందంతో మునిగి తేలుతుంది తెలుగు తల్లి. అంతేకాదు!

"కొబ్బెరా చెట్లకూ వెయ్యి రుయ్యాలా
గోపెమ్మ కొడుకునూ ఊచ రుయ్యాలా!"

అంటూ కొబ్బెర చెట్లకే ఉయ్యాలలు వేసి గోపాల బాలుణ్ణి అందులో కూర్చోబెట్టి ఉయ్యాల లూపుతుంది!

సంసారం సాగరం వంటిది. కల్లోల భూయిష్టమైన నిత్య జీవన వేగంలో కూడ భగవద్భక్తిని మరిచిపోదు ఆమె. ఒకవైపు సంసారపు కష్ట సుఖాలలో మునిగి తేలుతూనే,

మరొకవైపున పరమపద సోపానమార్గం సుగమం చేసుకొనే ప్రయత్నం చేస్తూ ఉంటుంది. సంవత్సరం పొడుగునా వచ్చే పండుగలు-ఎంతో దీక్షతో, ఉత్సాహంతో జరుపుతుంది.

తెలుగువారికి ప్రత్యేకమైన పండుగలు ఉన్నవి. ఒక్కొక్క పండుగకు ఒక్కొక్క రకమైన ప్రాముఖ్యత. కొన్ని పండుగలు పురాణ సంబంధమైనవి. మరికొన్ని ఋతుపరమైనవి.

ఉగాది-చైత్రశుద్ధ పాడ్యమినాడు తెలుగువారు జరుపుకునే సంవత్సరాది పండుగ. షడ్రుచుల సొతుతో జీవితంలోని సుఖ దుఃఖాలకు ప్రతీకగా ఉండే ఉగాది పచ్చడి - పంచాంగ శ్రవణం-ఆనాటి ప్రత్యేకతలు. చైత్రశుద్ధ నవమినాడు జరుపుకునే శ్రీరామనవమి-తెలుగువారి ఇలవేలుపు శ్రీరామచంద్రుడు అవతరించిన దినం. ఊరూరా పందిళ్ళు వేసి, ఆనాడు సీతారాముల కళ్యాణం వైభవంగా జరుపుతారు. శ్రావణ బహుళ అష్టమినాడు వచ్చే శ్రీకృష్ణ జన్మాష్టమి బాలగోపాలుడి పుట్టినరోజుగా వేడుక చేసుకుంటారు. భాద్రపద శుద్ధ చవితినాడు వచ్చే వినాయక చవితికి విఘ్న నాయకుడైన వినాయకుని పూజించి - కుడుములు, ఉండ్రాళ్ళు నైవేద్యం పెడతారు. దేవీ నవరాత్రులు విజయదశమి, తెలుగువారి పెద్ద పండుగలలో ఒకటి. దసరా వేషాలు, శక్తిపూజ, శమీపూజ, ఆయుధ పూజ - ఆనాటి పూజా కార్యక్రమాలు-సరదాలు. ఆశ్వయుజ బహుళ అమావాస్యనాడు నరక సంహారానికి విజయసూచకంగా జరుపుకునే దివ్వెల పండుగ దీపావళి వస్తుంది. సంక్రాంతి

తెలుగువారికి పెద్ద పండుగ. కర్షకులకు ఆనందకరమైన పండుగ. క్రొత్త అల్లుళ్ళ రాకతో - తెలుగింట నవోత్సాహం వెల్లివిరుస్తుంది. చలిమంటలు, సంక్రాంతి ముగ్గులు గొబ్బెమ్మల సరదాలు, హరిదాసుల చిఱుతవాద్యాలు, గంగిరెద్దుల ఆట పాటలు, ఎడ్ల పందాలు, కోడి పందాలు - ఇటువంటి సరదాలు ఎన్నో! మాఘ బహుళ చతుర్దశినాడు వచ్చే మహాశివరాత్రినాడు-పగలంతా పూజాపునస్కారాలతో ఉపవాసాలతో ఉండి రాత్రికి జాగరణ చేస్తారు. శైవక్షేత్రాలలో ఈ పర్వదినం వైభవంగా జరుపుతారు.

ఆడవాళ్ళు మాత్రమే జరుపుకునే పండుగలు కొన్ని. అట్ల తదియనాడు ఆడపిల్లలు తెల్లవారగట్ల లేచి, అభ్యంగన స్నానంచేసి, గోరింట పెట్టుకుని, అట్లూ, పెరుగన్నమూ తిని, ఊరిబయట తోటలవద్దకు వెళ్ళి ఉయ్యాల లూగుతారు.

" అట్లతద్దోయ్ - ఆరట్లోయ్
ముద్ద పప్పోయ్ - మూడట్లోయ్
పడకలమీదా పిల్లల్లారా
లేచి రారండోయ్ !"

అనే జానపదగేయం ఈ పండుగకు సంబంధించినదే.

కార్తీక శుద్ధ చవితినాడు వచ్చే నాగులచవితినీ, శ్రావణ శుద్ధ పంచమినాడు వచ్చే నాగపంచమినీ మన స్త్రీలు భక్తితో ఆచరిస్తారు. నాగ పూజ చేసే ఆచారం మనకు అనాదిగా ఉన్నది.

మంగళగౌరీ వ్రతం, వరలక్ష్మీ వ్రతం వంటి వ్రతాలు. స్త్రీలు ఇదివరకటి రోజుల్లో ఎక్కువగా చేసుకునేవారు.

"చాలు ఐదవతనము కొమరులా బలము
చాలు ఐదవతనము సంతాన బలము"

అంటూ స్త్రీకి ముఖ్యంగా పరిగణింపబడే సౌభాగ్యము సంతానం కోసం ఎన్నో నోములు నోచేవారు.

మనవాళ్ళకు మగ సంతానమంటే మరీ మక్కువ. ఆడపిల్ల ఎప్పటికయినా పరాయి ఇంటికి పోవలసిందే కదా- అనే ఉదాసీనభావం కనబడుతుంది. పిల్లలకు విద్యాభ్యాసం చేయించే పంతులుగారికి పంచెల చాపులూ ముడుపులూ అందేవి. ఆ పంతులుగారు చదువు ఎలా చెప్పినా, మధ్యాహ్నం వేళలో నిద్రకు ఒరిగే సమయంలో మాత్రం- అల్లరి చేస్తే పిల్లల్ని కొట్టి కోదండం తీయించేవారు. ఇది ఆ నాటి వీధిబడుల సంప్రదాయం. పిల్లలచేత గోడ కుర్చీలు వేయించే వారు. పేము బెత్తాలు పసివాళ్ళ అరచేతులు మీద విరిచేవారు. అయితే-దసరా రోజులు వస్తేమాత్రం పిల్లలు గురువుగారి మీద తమకు గల గౌరవాభిమానాలు గురించి తెలుపుతూ-

"అయ్యవారికి చాలు అయిదు వరహాలు
పిల్లవాండ్రకు చాలు పప్పు బెల్లాలు"

అంటూ పాటలు పాడుతూ, ఇల్లిల్లు తిరిగి అయ్యవారికి విత్తం సంపాదించి పెట్టేవారు.

కాని ఇప్పుడు మన విద్యా విధానం చాలా వరకు మారిపోయింది. వీధిబడుల స్థానంలో ప్రాథమిక విద్యాలయాలు వెలిశాయి. చదువుకునే చదువులో, గురుశిష్య సంబంధాలలో కూడా ఎన్నో మార్పులు వచ్చాయి.

ఆట పాటల మాటకు వస్తే-మన ప్రాచీన సాహిత్యంలో వర్ణించిన ఎన్నో క్రీడా విశేషాల పేర్లు గాని, అవి ఆడే పద్ధతులు కాని-ఇప్పటి వారికి తెలియవు. వాటి స్థానంలో క్రికెట్, బాట్మింటన్, టెన్నిస్ - వంటి ఆటలు మన మధ్యకు వచ్చి శాశ్వతంగా నిలిచి పోయినవి.

పెద్దల కోసం ఏర్పాటు చేసుకునే వినోదాలు, ఉత్సవాలు-తెలుగునాట పురాతన కాలం నుంచీ ఉన్నవి. పండుగ సమయాలలోనూ ఇతర విరామ సమయాలలోనూ-మనస్సుకూ శరీరానికీ ఉల్లాసాన్ని ఇచ్చే అనేక కళారూపాలు మనకు ఉన్నవి. సినిమాల ప్రభావం జనసామాన్యం పైన గాఢ ముద్రవేసుకున్న తర్వాత-మన ప్రాచీన కళావైభవం ఇంచు మించు అంతరించి పోతూ ఉంది. ఆదరం తగ్గటంతో వంశాను గతంగా నేర్చుకుంటున్న ఈ కళాప్రదర్శనలు మాని ఆయా కళాకారులు వేరువేరు వృత్తులలో దిగుతున్నారు. ఈ జానపద కళా సంపదను ఇలాగే అంతరించి పోనియకుండా పునరుద్ధరించ వలసిన బాధ్యత ప్రజల మీదా ప్రభుత్వం మీదా ఉన్నది.

కలంకారీ అద్దకాల వంటి కళా ప్రపూర్ణమైన చేతి పరిశ్రమలు మనకు ఉన్నాయి. వెనుకటి కాలంలో ఇటువంటి

పరిశ్రమలు- కుటీర పరిశ్రమలుగా జాతిజీవనంలో ఇమిడి పోయి ఉండేవి.

ఏనాడు ఎవరి నోట రూపొందినాయో మనకు తెలియదు కాని-మన మధ్య గాఢంగా నాటుకు పోయిన సామెతలు మన నుడికారానికి ఎనలేని సంపదలు. మన సంప్రదాయాన్ని, జీవన సరళినీ, మన బ్రతుకు బాటనీ-విమర్శించేవీ, పరామర్శించేవీ, ఎకసక్కెమాడేవీ, హాస్యమాడేవీ, వ్యంగ్యపు విసుర్లు విసిరేవీ- ఎన్నో సామెతలు మనకు ఉన్నవి. ఇవి ఒకప్పుడు మన సాహిత్యంలోనూ, సంభాషణల్లోనూ కలమెలగా కలిసి పోయినవే అయినా, ఇప్పుడు మనవాడుకలో చాలవరకు తగ్గిపోయినవనే చెప్పాలి. ఒక్క చెణుకుతో కొండంత హాస్యం కురిపించాలన్నా, ఒక్క మాటతో వీపు మీద కొరడా దెబ్బ వేసినంత చురుకు తగిలించాలన్నా ఒక్క విసురుతో వ్యంగ్యార్థపు బాణం విసరాలన్నా-ఒక్క తెలుగు సామెత వాడితే చాలును. ఈ సామెతల సంపదను కూడా మనం పరిరక్షించుకోవలసి ఉంది.

ప్రాచీనకాలం నుంచీ తెలుగుదేశాన్ని ఏలిన రాజులలో కళాపోషకులు, సంగీత సాహిత్యరస ప్రమాణ చక్రవర్తులు, విద్వత్ప్రభువులు- ఎందరో ఉన్నారు. ఆ మహారాజుల ఆస్థానాలలో ఆయా రంగాలలో ఉద్ధతులైన కవులు, గాయకులు, చతుష్షష్టికళలలో పేరెన్నిక గన్నవారు రాజుల ప్రాపు పొంది కళాసేవ చేసేవారు.

నన్నయ మొదలుకొని నవయుగవైతాళికుల వరకు మహితాత్ములయిన కవీశ్వరులు ఎందరో తెలుగు సరస్వతికి

అపూర్వాలంకారాలు చేకూర్చారు. ఆధ్యాత్మిక తత్త్వ వేత్తలు, నాదోపాసకులు, ఎందరో మహానుభావులు తెలుగు గడ్డపైన ఉద్భవించి అంతర్జాతీయ ఖ్యాతిని గడించారు.

బహుళార్థ సాధకం అయినది గృహస్థాశ్రమం అంటారు. తెలుగు గృహస్థుకు అతిథి సత్కారం ముఖ్య విధిగా భావింపబడుతుంది. కాని ఈ యాంత్రిక యుగంలో ఆ వెనుకటి ఆత్మీయత, బంధుప్రేమ, అతిథి అభ్యాగతుల మన్నన-మన ఇళ్ళలో కొరవడినవి.

మనం తినే ఆహారం మాటకు వస్తే-ఆహార ధాన్యా లలో, కూరగాయలలో, అవి పండించే పద్ధతిలో, వండుకునే విధానంలో, భుజించే పద్ధతిలో అన్నిటా ఈ మార్పు కని పిస్తూ ఉంది.

యంత్రాలు రాకముందు మనవాళ్ళు దంపుడు బియ్యం వండుకు తినేవాళ్ళు. ఇంటి ఇల్లాళ్ళు సామూహికంగా చేరి పాటలు పాడుకొంటూ సరస సల్లాపాలు ఆడుకుంటూ తీరిక వేళల్లో ధాన్యం దంచుకుంటూ ఉండేవాళ్ళు. ఆ దంపుడు బియ్యపు చేవ ఈ నాడు-మరపట్టి వెల్ల వేసిన తెల్లన్నంలో ఉండదు. అందువల్లనే- ఈ తరం జనంలో ఆ వెనుకటి దారుఢ్యం లోపిస్తూ ఉంది.

"సువ్వాని నేనొక్క పోటేసి తేను
చుక్కలు పిక్కటిల్లు సూరన్న కదులు
అస్సని నేనొక్క పోటేసి తేను
ఆకసమ్ము కదులు ఆ రాజు కదులు"

అంటూ రోకటి పోటు వేయగలిగిన శరీర బలిమీ, మనో బలిమీ ఏదీ ఇప్పుడు !

ఈ కాలం వారి తీరు ఇలా ఉందంటే మరీ బాగుం టుంది !

"రోకలెత్తా లేను రోలెత్తలేను
చేమంతి కడియాల చేయెత్త లేను
దంపు దంచా లేను దండెత్తలేను
దంచినా బియ్యమూ వండనూ లేను !"

యంత్రాలు మన మధ్యకు వచ్చి స్థిరపడిపోయి, మనకు సుఖభోగాలు అలవాటు చేసి, మనలను సుకుమారులుగా తయారు చేశాయనటానికి నిదర్శనం ఇదే !

మన పూర్వులు ఎటువంటి భోజనం ఆరగించేవారో- కవిసార్వభౌముడూ, భోజన ప్రియుడూ అయిన శ్రీనాథుని ఈ క్రింద పదంలో మనం తెలుసుకో వచ్చును.

"ద్రాక్షాపానక ఖండ శర్కరలతో
రంభాఫల శ్రేణితో
గోక్షీరంబుల తోడ మండెగలతో
క్రొన్నేతితో పప్పుతో
నక్షయ్యంబగు నేరు ప్రాల కల మా
హారంబు నిశ్శంకతన్
కుక్షుల్ నిండగ నారగించితిమి యు
ష్మ్రద క్షుధా శాంతికిన్ !"

సుసంపన్నమైన సంస్కృతి వంట పట్టించుకో బట్టి-అమెరికాకు వెళ్ళినా, ఆఫ్రికాకు వెళ్ళినా, ఆకాశ మండలానికి వెళ్ళినా, తెలుగు వాడు తనదైన జాతి గర్వాన్ని, దేశాభిమానాన్ని మరచి పోలేడు.

"కొండవీడు మనదేరా
కొండపల్లి మనదేరా
కాదని వాదుకు వస్తే
కటకం దాకా మనదేరా!"

కృష్ణదేవరాయల వారి కాలంలో చాకలి వాడు బట్టలు ఉతుకుతూ ఇలా వీరావేశంతో పాడుకునే వాడట!

నవయుగ వైతాళికుడు తన జాత్యభిమానాన్ని ఎంత దివ్యమైన అనుభూతితో చెప్పుకుంటాడో చూడండి!

"ఇమ్మహాకాకుళమ్ము మొదలీ వరకుం గల
యాంధ్ర పూర్వ రాజ్యమ్ముల పేరు చెప్పిన
హృదంతరమేలో చలించి పోవు
నార్ద్రిమ్మగు చిత్త వృత్తుల పురాభవ నిర్ణయమేని
ఎన్ని జన్మమ్ములు గాగ నీ తనువున్
ప్రవహించునో యాంధ్ర రక్తముల్!"-విశ్వనాథ!

ఇది వట్టి దురభిమానం కాదు! మహోజ్వలమైన మన గత చరిత్రకు పొంగి పోయి చేతులు దులుపుకు కూర్చోవటమూ కాదు! ఆంధ్రులది ఆరంభశూరత్వమనే అపప్రథ ఉన్నది. అది వట్టి అపప్రథ మాత్రమేనని నిరూపించుకుని-ఆంధ్రప్రజ ఇప్పుడు అన్ని రంగాలలోను ముందంజ వేసి దేశ ప్రగతికి దోహదం చేయాలి. * * *

78

# భోజన ప్రియత్వం

మీఁగడ పెరుగుతో మేళవించిన చల్ది
ముద్ద డాపలి చేత మొనయ నునిచి
చెలరేగి కొసరి తెచ్చిన యూరుగాయలు
వ్రేళ్ళ సందుల యందు వెలయ నిరికి-
సంగడీల నడుమ చక్కఁగ కూర్చుండి
నర్మభాషణముల నగవు నెరపి
యాగభోక్త కృష్ణుడ మరులు వెలుగంద
శైశవంబు మెరసి చల్ది గుడిచె — పోతన

మీగడ పెరుగు-చల్ది ముద్దలో మేళవించిన కమ్మదనం ఉప్పగా, కారంగా, పుల్లగా ఉన్న ఊరగాయ ముక్క వేళ్ళ సందున ఇరికించుకుని మధ్య మధ్య నాలికకు రాచుకుంటూ, గొల్లపిల్లల నడుమ కూర్చుని చల్దు లారగించే బాలకృష్ణుని శైశవ కథ చదువు తుంటే నోరూరని దెవరికి !

కానీ మన ఖర్మ! మీగడ పేరుగు ఏదీ ఇప్పుడు? అది కమ్మగా కలుపుకునే చల్దిముద్ద ఏదీ!

ఎర్రగా కాచి, మీగడతో సహా అన్నంలో పోసి తోడంటు పెట్టిన పెరుగు చలిది అన్నం తెలుగు వారికి అనాదిగా ఇష్టమైన పరిపుష్టమైన భోజనమే!

పొద్దుటే పళ్ళెంనిండా చలిది అన్నం పెట్టుకుని, ఇంత మీగడ పెరుగు పోసుకుని, రెండు ఉప్పుగళ్ళు వేసుకుని కలుపుకుని, నంజుకోవటానికి ఏ ఊరగాయో వేసుకుని, కడుపునిండా తిని త్రేన్చేటప్పటికి పిల్లలకూ-నీ, పెద్దలకూ-నీ ఏనుగంత బలం వచ్చినట్లుండేది. కడుపు నిండా దండిగా ఆహారం ఉండటంతో-మధ్యాహ్నం వరకూ భీమబలంతో ఎంత పని అయినా చేసుకో గలిగి ఉండేవాళ్లు.

భీమబలం మాటకు వస్తే - భారత కాలం నాటి భీమసేనుడు కూడా రోజూ ఉదయాన్నే మీగడ పెరుగు కలిపిన చద్ది అన్నం ఒక వాయనం భోంచేస్తూ ఉండేవాడని నా ఊహ! అందుకు ఆయన గారి దృఢ కాయమే తార్కాణం!

ఈ చలిది అన్నం తినటం-ఈ తరంవాళ్ళు ముఖ్యంగా తెలుగు నాటి ప్రజలు పోగొట్టుకున్న గొప్ప వరం అని పిస్తుంది నాకు. కాలానుగుణంగా వేషభాషలూ సాంఘిక జీవన పద్ధతులూ మారినట్లే నాజూకుదనం, నాగరీకం, ఎక్కువైనట్లే-మన జిహ్వాభిరుచులు కూడా మారాయని చెప్పక తప్పదు!

మనవాళ్లు కాఫీగత ప్రాణులు ఎప్పుడయ్యారో, ఇడ్లీ సాంబారు వ్యామోహితులు ఎప్పుడయ్యారో- ఆనాటి నుంచే చలిది అన్నం భుజించే సంప్రదాయం మన మధ్య లేకుండా పోయింది.

'అందని ద్రాక్షపండు పులుపు'-అన్న సామెతగా, మనజిహ్వాభిరుచి మారినట్లుగానే-మనకు మీగడ పెరుగు కూడా కరువై పోయిందిప్పుడు.

"చిక్కని పాలపై మిసిమి చెందినమీగడ పంచదారతో మెక్కిన భంగి...."

శ్రీరామ నామ సుధా రసాన్ని ఆస్వాదిస్తానని అంటాడు కంచెర్ల గోపన్న.

అంటే-రామదాసు గారి కాలం నాటికికూడా చిక్కటి పాలూ, వాటి మీద మిసిమి చెందే మీగడా పేరుకుని ఉండేవి కాబోలు. కాని ఈ 'చిక్కని' అనే పదార్థానికి 'దొరకని' అనే శ్లేషార్థం కూడ మనం చెప్పుకో వచ్చును ఈ నాడు. పిండి కలిపి, కాచి, చల్లార్చి, ఇంకేదో చేసి, సంచుల్లో నింపి-రెండు రోజుల తర్వాత మనకు అందే తెల్లటి పలుచటి పదార్థాన్ని -మనం 'పాలు' అని పేరు పెట్టుకుని తాగుతున్నాం. అప్పుడు తీసిన గుమ్మపాలు కమ్మదనం ఎరిగిన ఆంధ్రుడేడీ ఈ నాడు!

మన తాతలూ అవ్వలూ చెపుతూ ఉంటారు- వారి కాలంలో తోడు పెట్టిన పెరుగు చాకుతో కోసుకోవడానికి అనువుగా ఉండేదట! ఇహ ఆ పాల రుచీ పెరుగురుచి కూడ మన ముందుతరాల వారికే తెలిసి ఉండాలి!

తెలుగునాడు అనాదిగా పాడి పంటలకు పుట్టినిల్లు. పల్లెసీమల్లో-ఇప్పటికీ బంధుమిత్రులు ఒకరికొకరు ఎదురైతే "పాడి ఉందా?...." అంటూ ముఖ్యమైన కుశల ప్రశ్న ముందుగా వేసుకుని పరామర్శించుకుంటాగు. పాలూ,

పెరుగూ, నెయ్యీ - ముఖ్యమైన ఆహారం తెలుగువారికి. అందుకేనేమో - "ఆవు చంటిలో అరవై ఆరు పిండి వంట లున్నాయి"- అనే నానుడి వచ్చింది మనకు.

అన్నంలో ఎన్నిరకాల ఆదరువులు వేసుకు తిన్నా, ఆఖరుకు ఉంటే పెరుగో, లేకపోతే మజ్జిగో కలుపుకుని తింటే కాని మన భోజనం పూర్తి కాదు! వట్టికూరలతో తిని లేచిన భోజనం—ఏదో వెలితిగా, అసంపూర్తిగానే ఉంటుంది.

సరే, ఆ పెరుగో మజ్జిగో పోసుకుని కలుపుకున్న అన్నం ఊరికే తిన్నా, తిన్నట్లు ఉండదు! జుర్రుజుర్రంటూ ఆమడ దూరానికి అ జుర్రు వినిపించేటట్లు జుర్రుతూ, తింటేనే కాని తనివి తీరదు తెలుగు వాడికి!

"జుర్రెద మీ కథామృతము, జుర్రెద మీ పదకంజ తోయమున్, జుర్రెద రామనామమున జొబ్బిలుచున్న సుధా రసంబు".... అంటూ రామనామ సుధామృతాన్ని జుర్రుతా నని అంటాడు రామదాసు! పరమాన్నమైనా, పెరుగన్నమైనా, రామనామ సుధారసమైనా- చేరలనిండా జుర్రితేనే తృప్తి! పంక్తిభోజనాలలో - వరసగా జుర్రులు వినిపించినాయంటే- భోజనాలు ఆఖరు ఘట్టంలోకి వచ్చాయనే సంగతి - ఎంత దూరంలో ఉండేవాళ్ళయినా గ్రహించవచ్చు.

కాని, ఇప్పుడు జుర్రటం అనేది తెలుగు వారికి కూడా మోటయిపోయింది! అది సహపంక్తి సభ్యత - అంటే టేబిల్ మానర్సు కాకుండా పోయింది. పాశ్చాత్య ప్రభావంతో

సంక్రమించిన ఒకానొక నాగరీకత_ శబ్దం చేయకుండా, జుర్రకుండా- భోజనం ముగించటం మనకు నేర్పింది. మునిపంటితో కొరికి, నోరు తెరవకుండా నమిలి- అంటీ అంటనట్లు, ముట్టీ ముట్టనట్లు నాజూకుగా భోజనం చేయటం ఇప్పటి ఫ్యాషను. సంతృప్తిగా, హార్దిగా భోజనం చేసి, త్రేవ్ మని త్రేన్చి, తృప్తిగా బొజ్జ నిమురుకునే సంప్రదాయం వెనుకపడిందేమో అనిపిస్తుంది ఒక్కొక్కసారి!

కాని, నవనాగరీకుల మనుకునే వాళ్ళు కూడా- అవసరాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి-తమ జిహ్వాభిరుచిని మార్చుకోవటం కూడా కద్దు. 'అయ్యా! మీరు చద్ది వన్నం తింటారా'....అంటూ బుచ్చమ్మ అడిగితే- 'నాట్ ది స్లైటెస్ట బిజన్'.... అంటూ తల ఎగుర వేస్తాడు మన గిరీశం.

'వణ్ణం' కూడా అన్నమే! ఇప్పటికీ మన ఇళ్ళలో అవ్వలూ, అమ్మమ్మలూ - 'అన్నం' అనే పదానికి 'వణ్ణం' అనే అంటూ వుంటారు.

అన్నగతమైంది ప్రాణం- అంటారు. అసలు తెలుగు బిడ్డ భూమ్మీద పడి అయిదారు నెలలు గడిచిన దగ్గర నుంచీ, ఈ అన్నంతో సంబంధం ఏర్పడి ఉంటుంది. అన్నం ముట్టించడం-లేక అన్నప్రాశన- అంటూ వేడుక చేసి, అప్పటి నుంచీ అన్నం గుజ్జన గూడుగా వండి బిడ్డకు నోరు ముద్దలు పెడుతుంది తెలుగుతల్లి.

పొట్ట నిండటానికి ముఖ్యమైన అన్నశబ్దం- మన మాటల్లో సామెతల్లో - నిత్య జీవితాల్లో అనేక రకాలుగా అల్లుకు పోయింది.

దేనిని గురించి అయినా- మంచీ చెడూ నిర్ణయం చేయవలసి వచ్చినప్పుడు-

"అన్నం ఉడికిందో లేదో అంతా పట్టి చూడ నక్కర లేదు"... అంటాము. ఒక్క మెతుకు పట్టుకు చూసి-పదును తెలుసుకోవటం ఎంత అనుభవంతో నేర్చిన విద్య!

అలాగే—

'అన్నం అడిగిన వానికి సున్నం పెట్టినట్లు!'

'అన్నం తిన్నవాడు-తన్నులు తిన్నవాడు మరిచిపోరు!'

'అన్నం పెట్టిన వారింటికి కన్నం పెట్టినట్లు!'

ఇలా ఆయా సందర్భాలలో అన్న శబ్దాన్ని నిత్య జీవన సంబంధంగా అన్వయించుకుంటూ ఉంటాం మనం.

ఏ జ్వరమో, లంఖణాల జబ్బో వస్తే తప్ప - తెలుగు వాడు అన్నం లేకుండా ఉండలేడు. బియ్యం విరివిగా దొరకని ఏ ఉత్తర దేశమో వెళితే-తెలుగువాడికి భోజనం చేయటం సంకట ప్రాయంగా ఉంటుంది!

సరే! ఈ అన్నం వండటానికి ముఖ్యంగా కావలసిన ముడి సరుకు బియ్యం.

రేషన్ దుకాణాల ముందు క్యూలో నిలబడి బియ్యం సంపాదించుకు వచ్చే శ్రమ తెలిసిన ఇల్లాళ్ళకు మనముందు తరాలనాటి స్త్రీలు ఆ బియ్యం ఎంత శ్రమపడి తయారు చేసుకునే వారో బహుశా తెలిసి ఉండదు!

ఆ రోజుల్లో ఇప్పటిలాగా యంత్రాలూ, మరలూ, విద్యుచ్ఛక్తీ ఉండేవి కావు. మగవాడు చెమటోడ్చి పొలంలో

పండించి తెచ్చిన ధాన్యం ఎండబోసుకోవటం, మట్టిగడ్డలు బాగుచేయటం, వడ్లు దంచటం, చెరిగి బాగుచేయటం- ఇటు వంటి శ్రమతో కూడుకున్న పనులన్నీ ఇల్లాలే చేసుకోవలసి వచ్చేది. ఆ పైన వండి వార్చటం వగైరా తిప్పలంతా మామూలే!

అందుకే అనిపిస్తుంది ఒక్కొక్కసారి-వడ్లుదంచుకునే ఆ కష్టం ముందు- క్యూలో నిలబడి బియ్యం తెచ్చుకునే కష్టం ఎన్నవ వంతు!-అని.

ఆ కాలంలో స్త్రీలు వడ్లు దంచుతూ- అలుపు తెలియకుండా కట్టుకొని పాడుకొన్న పాటలు దంపుళ్ళ పాటలుగా జానపద సాహిత్యానికి ఎంతో సొంపునూ, సమగ్రతనూ చేకూర్చాయి.

మనిషిలో ఆనాటి చేవ, జీవశక్తి, దారుఢ్యం లేక పోవటంతో-ఇప్పటివాళ్ళకు శరీర శ్రమ ఏ మాత్రమూ చేయలేని స్థితి వచ్చింది.

ఆ నాటి మనవాళ్ళ కండపుష్టి దంపుడు బియ్యపు దారుఢ్యంతో వచ్చింది. ఈ నాటి ప్రజలది మరబియ్యపు నీరసం! అంతటి చేవా, జిగీ ఉండబట్టే-ఆ నాటి ఆడవాళ్ళు అలాగ్గా అంతపనీ చేసుకో గలిగేవాళ్ళు!

"దంపు దంపని యేరు అదియెంత దంపు!
ధాన్యరాసుల మీద చెయ్యేసినట్లు!"

అని పాడుకుంటూ - అంతటి ధాన్యరాసిని నిమిషాల మీద బియ్యపు రాశిగా చేయగలిగి ఉండేవాళ్ళు.

ఇంకా వెనక్కు తరచి చూచామంటే- మనతాతలూ ముత్తవ్వలూ-తమ చిన్నతనంలో వరిఅన్నం తిని యెరుగమని చెపుతూ ఉంటారు! ఆ కాలంలో ఎక్కువగా జొన్న, రాగి, సజ్జ-వంటి మెట్ట పంటలు పండించుకుని తినేవాళ్లు

సుమారుగా ఒక శతాబ్దం ముందు బ్రిటిష్‌వారు కృష్ణ, గోదావరి నదులకు ఆనకట్టలు కట్టి డెల్టా ప్రాంతమంతా స్వర్ణమయం చేశారు. అక్కడి నుండీ ఆ భూమి బంగారం పండే మాగాణి అయింది. ఆ భూముల్లో మనవాళ్ళు వరి పైరు వేయడం ప్రారంభించారు. వరిఅన్నం తినటం క్రమంగా అలవాటు చేసుకున్నారు.

మనవాళ్ళు తరం తర్వాత తరం-జొన్నన్నం తర్వాత దంపుడు బియ్యపు అన్నం, ఆ తర్వాత మరబియ్యం అన్నం-తింటూ అలవాట్లు మార్చుకున్నట్లే- శరీరంలో జీవశక్తి, దారుఢ్యత కూడా క్రమానుగతంగా తగ్గిపోతున్నవని చెప్పక తప్పదు.

జొన్నా, రాగీ, సజ్జావంటి ధాన్యాలు తినటం ఇప్పుడు వెనక పట్టినా- మనవాళ్ళు రానురానూ ఉత్తరదేశపు పంట అయిన గోధుమలు కూడా తినటం అలవాటు చేసుకున్నారు. ఆంధ్రదేశంలోనూ కొంతప్రాంతం గోధుమ పంట పండిస్తున్నారు గోధుమ రవ్వతో ఉప్మా, పిండితో రొట్టెలు, చపాతీలు, పూరీలు-వంటివి చేసుకుని తినటం సర్వసాధారణమై పోయింది.

అన్నం తిన్నా, రొట్టెతిన్నా- అందులోకి ఆధరువు కావాలి కదా! తెలుగుతనం మూర్తీభవించే మన వంట

కాలు, శాకపాకాల గురించి పదం పాడుతూ ఏకరువు పెడు తుంది బామ్మ. జాతి జీవనం, లక్షణం, సంస్కృతి - ప్రతిబిం బించేది వారి జానపద సాహిత్యం లోనే కదా!

రామచంద్రుడు పదునాల్గేండ్లు అరణ్యవాసం పూర్తి చేశాడు. ఎన్నో కడగండ్లకూ దుఃఖానికీ లోనయ్యాడు. భార్యా వియోగంతో పరితపించాడు. చివరకు రావణ సంహారంచేసి, విజయుడై సీతాలక్ష్మణ సమేతుడై అయోధ్యకు తిరిగి వచ్చాడు. మహా వైభవంగా పట్టాభిషేక మహోత్సవం కూడా ముగిసింది. మరి అంతటి ఆనంద సమయంలో విందు భోజనం ఉండాలి కదా! అడవిలో కందమూలాలతో కడుపు నింపుకుని కాలం గడిపిన సీతారామలక్ష్మణులకు జిహ్వ లేచి వచ్చి ఉంటుంది! ఆ వంటకాల వివరాలు ఎంత చక్కని పాటగా రూపు దిద్దుకున్నాయో!

"వడ్డించి రయోధ్య వల్లభుల పంక్తి
ప్రథమమే వడ్డించె పాయసాన్నములూ
సజ్జ పాయసము పరిమళబియ్యాముల పాయసాన్నములూ
రాజన్నములూ మంచి రమణి పాకములు
చిక్కుడుకాయ సిరిపొట్లకాయ
కాకరకాయతో గార వడియమునూ
అరటి కాయ మొదలైన అట్టెకూరలనూ
పనసకాయ మొదలైన పాకంపు కూర్లూ
తాలింపు కూరలు తరచుగా తెచ్చీ
అచ్చంగ కాచినా ఆవు నేతూలు

కర్పూర రసముతో పరిమళింపగను
అల్లమ్ము మొదలైన అరవై పచ్చళ్ళు
కందాను చేమాను కాయ పెండలము
పెసరపప్పు మంచి సిరి సెనగపప్పు
అమర వడ్డింతురా అచ్యుతల పంక్తి !"

పధ్నాలుగు సంవత్సరాలు వనవాసం చేసి వచ్చిన సీతా రామలక్ష్మణులకు ఈ శాకపాకాలన్నీ ప్రియమార వడ్డించుకున్నారు మనవాళ్ళు. మనం ఆనాటికీ ఈనాటికీ ఇంటింటా చేసుకునే కూరలూ వంటకాలూ ఇవే. శుభసమయాల్లో చేసుకునే పాయసాన్నాలూ ఇవే!

తెలుగు వారింట పండుగ వచ్చినా, పబ్బం వచ్చినా, చుట్టాలు వచ్చినా, మరే శుభకార్యమైన జరిగినా ముందుగా పాలు పొంగించు కుంటారు. క్రొత్తగా గృహప్రవేశం చేస్తే ఈ పాలు పొంగించడం అనే ఆచారాన్ని తప్పకపాటిస్తారు. పాయసంగా కాచే పాలు పొంగి అగ్ని హోత్రంలో కొంత పడితే-అది మనవాళ్ళు శుభసూచకంగా భావిస్తారు.

సంస్కృతాంధ్ర భాషల్లో కవిత్వం ఏ విధంగా ఉండాలో ఎంతో మనోహరంగా చెప్పారు అల్లసాని పెద్దనామాత్యులు. సంస్కృత కవిత్వం పాయసంవలె మధురంగా-రుచికరంగా ఉండవలెనట! ఎలా అన్నారో చూడండి!

"మనోహర ద్యోతక గోస్తనీ ఫల మధు ద్రవ
గోఘృత పాయస ప్రసారాతి రసప్రసార
రుచిర ప్రతిమంబుగ సారె సారెకున్ !"

ఎంత మధురమైనదో ఈ పాయసం !

"లేగటి పాలలో గ్రాగి మాగిన తీయ
తీయ కప్పుర భోగి పాయసంబు !"

అంటూ అచ్చ తెనుగు పాయసం ఎలా ఉంటుందో వర్ణిస్తారు తుమ్మల సీతారామ కవి.

లేగటి పాలలో కాగి, మాగిన తీయ తీయని పాయసం, సన్నని పచ్చకర్పూరపు సువాసనతో పరిమళం వెదజల్లే పాయసం వండనేర్చిన వారు మనవాళ్ళు.

'అచ్చంగా కాచిన ఆవునేతులు-' చారెడు వేసుకోనిదే భోజనం ముగిసేది కాదు ఆ నాడు. మజ్జిగ చిలికి, వెన్నతీసి, మట్టిపిడతలో అప్పటికప్పుడు కాచిన కమ్మని నెయ్యి, కూరలో, పచ్చడిలో, పప్పులో కలుపుకునితినటానికి అలవాటు పడిన మనవాళ్లు దురదృష్టవశాత్తూ ఈ రోజుల్లో బ్రతికిఉంటే వాళ్ళకు ముద్ద మింగుడు పడదు !

మంచినెయ్యి ఏదీ ఇప్పుడు! గగన కుసుమమైపోయింది. దాని ధరమాట! భూమి మీద ఉండనని చుక్కల్లోకి చక్కా పోయింది !

నేతిబీరకాయలో నేయి మృగ్యమై పోయినట్లు-పాడి పంటలకు కాణాచి అయిన తెలుగునాట స్వచ్ఛమైన నెయ్యి కరువై పోయింది.

శాక పాకాల మాటకు వస్తే, అన్నిరకాల కూరగాయలతో మధురుచులు మేళవించేటట్లు తయారు చేస్తుంది తెలుగు

గృహిణి. గుమ్మడికాయ తీపి, వంకాయ కమ్మదనమూ, కాకరకాయ చేదూ- అన్నీ మనకు ఇష్టమైన రుచులే!

"చవులూరు కరివేప చివురాకుతో గమ
గమలాడు పైరవంకాయ కూర".... అంటూనోరు ఊరే విధంగా వర్ణించుకున్నారు తెలుగు కవులు.

వంకాయ వంటి కూరయు
లంకాధిపు వైరివంటి రాజును గలడే
శంకరుని వంటి దైవము
పంకజ ముఖి సీతవంటి పణతులు గలరే!

దీనిని బట్టి వంకాయ కూర ప్రాశస్త్యం ఎంతగొప్పదో వెల్లడవుతుంది.

"గుత్తొంకాయ కూరోయి బావా...." అంటూ గుత్తివంకాయతో కూరిపెట్టిన లేవలపు బావముందు కుమ్మరిస్తుంది తెలుగుకన్నె!

కంద్రడ వంకాయలు, ముదురు బెండకాయలు, చేదు దోసకాయలు- వంటి దోషాలు దరికి రానీయకుండా కూరగాయలు ఎన్నిక చేసుకోగల నేర్పరి తెలుగు పడుచు. వాటిని వండుతూ, ఆ కూరల కమ్మదనానికి, రుచికి- మరింత సొంపూ, ఘుమాయింపూ నింపుతుంది.

అన్నం మాడటమో, పప్పులో ఉప్పు ఎక్కువో తక్కువో కావటమో, పులుసులో ముక్కలు ఉడకక

పోవటమో- క్వాచిత్కంగా- ఎప్పుడో ఆదమరపున జరిగే పనులు మాత్రమే !

ఇవన్నీ ఆవిడ పాకవిద్యాప్రావీణ్యానికి అగ్ని పరీక్షలే ! ఈ సాధక బాధకాలు-వండి వార్చడంలో గల కష్టనిష్టూరాలు- భుజించటం మాత్రమే ఎరిగిన మగవాడికి తెలియని విషయాలు !

రుచులు నిత్యనూతనంగా- వండినపదార్థం వండకుండా, ఏ రోజు కా రోజు క్రొత్తదనం తగ్గని శాకపాకాలు చేయగల నేర్పు, ఓర్పు - చిన్నతనంలోనే సంతరించుకుంటుంది తెలుగింట పుట్టిన ఆడపిల్ల.

ఎన్ని కూరలున్నా, అన్నంలోకి పప్పు, నెయ్యి-లేకపోతే ముద్దఎత్తరు మనవాళ్ళు. కమ్మగా కందులు వేయించి చేసిన కందిపప్పుతో చేసిన ముద్దపప్పు ముందుగా అన్నంలో పెట్టుకుని, అందులో గురిగి చేసుకుని, ఆ గురిగినిండా చారెడు కమ్మని నెయ్యి పోసుకుని కలుపుకుని, మొదటి ముద్ద ఆరగించిన తర్వాతే మిగతా కూరలూ పచ్చళ్ళ పని పడతారు భోజన ప్రియులు.

మనవాళ్ళు ఇంట్లో పెళ్ళీ పేరంటం వంటి శుభ కార్యాల గురించి అడగవలసి వచ్చినప్పుడు-

"మనింట్లో పెళ్ళి ఎప్పుడూ ? పేరంటం ఎప్పుడూ ?".... అని అడగరు.

"మనింట్లో పప్పన్నం ఎప్పుడు పెడతావోయ్ !" అని చనువుగా ప్రశ్నించుకుంటారు.

అంటే, తెలుగింట దినవారీ భోజనం కానీ, విందు భోజనం కానీ పప్పు లేకుండా జరగదన్నమాట! మన భోజనాల్లో పప్పు ప్రాముఖ్యం అంతటిది!

"పప్పుకూటికి పది ఆమడలైనా వెళ్ళమన్నారు!...." మనవాళ్ళకు పప్పు అన్నం అంటే ఎంత ప్రీతో తెలియ చెపుతుంది ఈ సామెత!

"పప్పుతో పది కబళాలు తింటే, పులుసెందుకు బుగ్గిలోకా!" అన్నాడట వెనుకటి కొక పప్పు ప్రియుడైన తెలుగువాడు. అయినా పప్పులో పులుసు మేళవింపును ఎరిగినదీ అతడే!

"పప్పులేని పెండ్లి, ఉప్పులేని కూర".... అంటూ పెదవి విరుస్తారు రసజ్ఞత లోపించిన సన్నివేశం పట్ల. ఇంత కమ్మని పప్పూ, కమ్మని నెయ్యీ కలిపిన అన్నం ఈ నాటి తెలుగు వాడికి అరుదుగా లభించే భాగ్యం అయింది. అధవా లభించినా, ఆ కమ్మదనం అనుభవంలోకి రాకముందే పానకంలో పుడకలాగా కటుక్కుమని పంటికిందకు వచ్చే కరకురాయి సంగతేమిటి?

ఆ కరకురాయి గురించి వ్రాయటానికి మాత్రమేమీ లేదు. బియ్యంలోకీ, ఇతర ధాన్యాలలోకీ అనువుగా కలిసి పోయేట్లు ఉండే సన్నని రాళ్ళను తయారు చేసే కార్ఖానాలకు, ఆ కార్ఖానాలు నడిపే యజమానులకూ- ఆ కరకు రాళ్ళను గురించి తెలిసి ఉండాలి!

అలా, ఆ పప్పూ నెయ్యీ కలుపుకుని కమ్మగా

నాలుగు ముద్దలు తిన్నాక, అన్నిరకాల కూరముక్కలు వేసి చేసిన దప్పళమో పులుసో కలుపుకుంటారు మనవాళ్ళు.

"క్రొత్తబెల్లపు తోడి కోడలై మరిగిన
ముదురు గుమ్మడి పండు ముదురు పులుసు."

తీయగాఉండే గుమ్మడి పండు ముక్కలతో గుత్తంగా చేసిన పులుసును ఊరించుకుంటూ తింటాడు తెలుగువాడు!

కాని, ఇదివరలో పప్పూ, పులుసూ తినే తెలుగువాడికి ఇప్పుడు సాంబారుపైన మోజు పెరిగింది. తెలుగు దేశపు హోటళ్ళలో ఇప్పుడు గట్టిపప్పూ పులుసూ సాధారణంగా దొరకదు. సాంబారు లేక సాంబారు పేరుతో చెలామణి అవుతున్న పప్పు దప్పళం వడ్డించని హోటలు కనపడదు. పదహారణాల తెలుగు భోజనం వడ్డించే తెలుగు హోటలేదీ ఇప్పుడు!

అలాగే చారుకు బదులు రసం, గారె బదులు వడ, అట్టు బదులు దోసె—మన హోటళ్లు మనకు అందిస్తున్నాయి. అరవ కన్నడ ప్రాంతాల వంటకాల ప్రభావం మనపైన బాగా పడింది. కారణం - మన తెలుగునాట ఎక్కువగా స్థిరపడి బాగా వ్యాపారం చేసుకుంటున్న హోటల్ పరిశ్రమ చాలా వరకు వాళ్ళదే కనుక!

పప్పు తరువాత మనవాళ్ళు వండనేర్చిన కాయ గూరలు ఇన్నీ అన్నీ కావు. ఆనాటి కాకరకాయ దగ్గర నుంచీ ఈనాటి కాలీఫ్లవరు వరకు-అన్ని కూరలూ తాలింపులతో-వేపుళ్ళతో చేయటం మనవాళ్ళ ప్రత్యేకత.

"దొండకాయ ములుకకాయ తొట్లకాయ
జంచి కాయయు నెజ్జల సరిదకాయ
వెలయు నుస్తె కాయయు రామములుగ కాయ
మేడికాయ కాచరకాయ కూడ నింక
రామగుమ్మడి యోబ రాజుగుమ్మడి చార
గుమ్మడి బూడిదె గుమ్మడులును
గిండి సొరయు దీగె కిన్నెర సొరయును
బీర సముద్రపు బీర నేతి
బీర పిచ్చుక పొట్ల పెద్ద పొట్లనుగు
దంతపు బొట్లయు తంబలు వెలి
కాకర పొట్టి కాకరలు మేకచెలి చి
క్కుడు పాల కణుపుల గోరుచిక్కు
డులు, సుగంధాలు బొంతనటులు సురకలు
గంజి పందిటి కపుర పొంకాయ తరులు
బూజు పచ్చకు రాసాని పుచ్చ బెద్ద
దోసనక్క దోసలు వానితోట గలవు!-
—'హంసవింశతి'

ఇవన్నీ అనాదిగా మనకు తెలిసిన కూరగాయల పేర్లు. ఇన్ని కూరగాయల కల వంటకాలు తెలుగు వంటకాలు.

ఎన్ని కూరలున్నా, పప్పూ పులుసూ దప్పళమూ ఉన్నా, ఎర్రని కారంతో చేసిన పచ్చళ్లూ ఊరగాయలూ లేక పోతే- ఆ భోజనం చప్పిడి భోజనంగానే- ఏదో స్వారస్యం కోల్పోయినట్లు ఉంటుంది తెలుగు జిహ్వకు!

ఒకవైపున కళ్ళనిండా నీళ్లు కారుతున్నా, నాలుక మీద జ్వాలానలంలాగా మంటలు రేగుతున్నా, తిన్నతర్వాత కడుపులో మంటలు రేగి బాధ పడవలసి వస్తుందని తెలిసినా, చేతిలో పచ్చడి కలిపిన ముద్ద మాత్రం వదలడు మనవాడు.

'చిలీ' దేశంలో అవతరించి, 'చిల్లీ' అనే పేరుతో అమెరికా దేశస్థులు బయటకు తెచ్చిన 'మిరపకాయ' క్రమంగా మనదేశానికి వచ్చి స్థిర నివాసం ఏర్పాటు చేసుకుంది. గుంటూరు మండలంలో పండించే మిరపకాయకు నీటూ, ఘాటూ ఎక్కువ. అందుకే అది ఆంధ్రదేశంలో ప్రాశస్త్యం గడించింది. ఈ మిరపకాయ మేళవించని తెలుగు పచ్చడి ఉండదు. పచ్చిమిరప కాయతో అప్పటి కప్పుడు నూరుకునే తాజాపచ్చడి లోనైనా, ఎండు మిరపకాయల కారంతో చేసుకునే ఊరగాయ పచ్చళ్ళలో నయినా, కారం పాలు ఎక్కువగానే ఉంటుంది.

ఉండటానికి మనకు ఒకటీ రెండూ కాదు- 'అల్లమ్ము మొదలైన అరవై రకాల పచ్చళ్ళు' ఉన్నాయి! ఏటికేడాదీ నిలవ ఉండి- అవసరమైనప్పుడల్లా అన్నంలోకీ, పిల్లల చద్దన్నాల్లోకీ ఆధరువుగా వాడబడుతూ నోరూరించే ఊరగాయలు పెట్టుకోవడం ఇల్లాలికి ఒక యజ్ఞం లాంటిది!

"మామిడికాయయు మారేడుకాయయు
కొండ ముక్కిడి కాయ కొమ్మికాయ
గురుగుకాయయు వెల్గకాయ యందుగుకాయు
లుసిరికాయలు నుస్తికాయ

లే కరక్కాయయు వాకుడు కాయయు
జిటినెల్లి కాయయు జిల్లకాయ
కలబంద గజనిమ్మకాయ నార్దబకాయ
చిన నిమ్మకాయయు జీడికాయ
కొండసపు గొమ్మ మామెనగొమ్మ బుడమ
కాయ యల్లము మిరియంపుగాయ బీర
కాయ కరి బొలు కరివేప కాయ లాది
యైన యూరు గాయలు గలవతిని ఇంట!"

—హంసవింశతి

ఇన్ని రకాల పచ్చళ్ళకు పుట్టిల్లయినా, తెలుగువాడు-లేక తెలుగునాడు-అనగానే యావద్భారతదేశానికీ ముందుగా స్ఫురణకు వచ్చేది ఆవకాయా-గోంగూరా!

"పంచభక్ష్యాలు తన కంచాన వడ్డించ
గోంగూరకోసమై గుటక లేసేవాడు"

ఇంకెవడు? తెలుగువాడే! అన్నాడు తెలుగుతనం తెలిసిన కవి.

ఆవకాయ రుచి ప్రాశస్త్యం - భారతదేశం లోని ఇతర ప్రాంతాలకే కాక, దేశ దేశాలకూ ప్రాకిందంటే అతిశయోక్తి కాదు.

వేసవి వచ్చిందంటే మల్లెలూ మామిళ్ళూ రావటమే కాదు- తెలుగింట పుట్టిన ఇల్లాలికి చేతినిండా పని. ఎంత ధర అయినాసరే ఆవకాయ వేసుకోవటానికి మాత్రం బడ్జెటు

జాగ్రత్తగా పెట్టుకుంటుంది ఆమె. ఎర్రని మిరపకాయలు
వెరి తెచ్చి ఎండబెట్టి-కళ్ళు చెదిరే రంగుగల కారం తయారు
చేసుకోవటం-ఘుమఘుమ లాడే శ్రేష్ఠమైన నువ్వులనూనెతో
ఆవపిండి పెల్లుల్లి వేసి పచ్చడికి ప్రసిద్ధమైన మంచి మామిడి
కాయలతో ఆవకాయ చేసుకోవటం - ఇదంతా ముఖ్యమైన
పని ఆవిడకు. తప్పనిసరికూడా! ఆ నాలుగు రోజులూ కష్ట
పడి ఆవకాయ ఊరగాయ చేసుకున్నదీ అంటే - ఏడాది
పొడుగునా ఆమెకు నిశ్చింత. ఓపిక లేని పూట కూరా
నారా చేయలేకపోయినా - అన్నంలో ఆవకాయ కలుపుకుని
నెయ్యి వేసుకుని తిని, ఇంత పెరుగో మజ్జిగో కలుపుకుని తిని
లేచి వెళ్ళిపోతారు ఇంట్లో పిల్లలూ పెద్దలూ. ఆవకాయను
ప్రాంతీయ విధానాలను బట్టి అనేక రకాలుగా పెట్టుకుంటారు.

అన్నంలోకి ఉండే ఆధరువులకంటే ఆంధ్రులకు ప్రీతి
పాత్రమైనవి నంజుళ్ళు. అప్పడాలు, వడియాలు - కరకర
లాడుతూ భోజనానికి తుష్టిని కలిగిస్తాయి. అప్పడాలు వత్తు
కోవటం, వడియాలు పెట్టుకోవటం ఒక గృహ పరిశ్రమగా
తెలుగు దేశంలో గణనకెక్కింది.

శరీరానికి ఆకు కూరలు ఎంత పుష్టిని ఆరోగ్యాన్ని
కలగచేస్తాయో-ఈనాడు మనం పత్రికలద్వారాను, రేడియో
ద్వారాను తెలుసుకుంటున్నాం కాని-మన తాతలూ అవ్వలూ
ఆకు కూరలు పుష్కలంగా తినేవాళ్లు వెనుకటి రోజుల్లో!

"గురుగుం జెంచలి తుమ్మి లేదగిరి పా
కుందింత్రిణీ పల్లవో
త్కరముం గూడ, జొరంటి నూనియలతో

గట్టాలి గుట్టారిణో
గిరముల్ మెక్కి, తమిన్ బసుల్ పొలములో
గ్రిపుల్ మెయిన్ నాక, మే
కెదువుం గుంపటి మంచమెక్కిరి ప్రభు
త్ర్యకాపి రెడ్డజ్జడిన్ !"

ఇది వర్షాకాలంలో రెడ్లు తినే భోజనాన్ని గురించి కృష్ణదేవరాయలవారి వర్ణన. ఎంతో నిశితమైన పరిశీలనతో- తాను మహారాజయినా, సామాన్యుల సామాజిక జీవితాన్ని గురించి ఎంతో సహజంగా కన్నులముందు పంచిపెట్టాడు రాయలవారి లోని కవి. గురుగు, చెంచలి, తుమ్మి, లేత తగిరిపాకు- ఈ నాలుగు రకాల కూరలు తరిగి, చింత చిగురు కలిపి, బాగా నూనె పోసి పొడికూరగా చేసి, కావలసిన ఉప్పు కారము మొదలైనవి చేర్చి, కలగూరగా చేసి ఆనాటి రెడ్లు తినేవారట !

ఇందులో వర్ణించిన ఆకుకూరల పేర్లు కొన్ని ఇప్పటికి కొంత నామాంతరము పొంది ఉండవచ్చును. కాని ఇందులో వర్ణించిన తింత్రిణీ పల్లవం-చింత చిగురు-పప్పులో వేసుకుని తినడం ఇప్పటికీ తెలుగువారికి ఇష్టమే !

చింతచిగురు వగరుపైన ఎంతమోజోమరి - దానికీ చిన్నదాని పొగరుకూ లంకెపెట్టి కవనం అల్లుకున్నాడు జానపదుడు.

కాని ఒకప్పుడు ఊరికే దొరికే చింతచిగురు విలువ ఇప్పుడు బాగా పెరిగి పోయింది! ఇప్పుడు చింత చిగురు ధర కూడ ఎంత ప్రియమై పోయిందో తెలుగు ఇల్లాలికి తెలుసు.

ఏ వంటకం చేసినా దానికి రుచీ, రాగమూ ఇచ్చే నీరుల్లి లేనిదే ఆ పదార్థానికి ఘుమాయింపు ఉండదు! తెలుగు వారికి ఎంతో ఇష్టమైన నీరుల్లిని గురించి శ్రీనాథ కవి ప్రశంస చూడండి!

"శ్రవణింతున్ నుతి కాలకంఠమకుటాట్టాల ప్రతోలీమిళ
త్స్రవ మానామర సింధు బంధుర పయస్సంభార
గంభీర వా
గ్వ్యవహారైక దురంధరత్వమున జిహ్వాలోలమ త్తల్లికిన్
జలికిం దల్లికి, గారవెల్లికి ధనుర్జ్యావల్లి నీరుల్లికిన్"

రుచికి తల్లి అట నీరుల్లి! శివుని జటా జూటంలో ఉండే అమర గంగానది పరవళ్ళు తొక్కుతూ, భూమికి దిగి నట్టి వాగ్గరితో నేను రుచులలో ఉత్తమమైనట్టి కారంతో కూడిన అల్లెత్రాడు రూపంలో ఉన్నట్టి నీరుల్లిని స్తోత్రం చేస్తాను- అంటాడు కవిసార్వభౌముడు!

నిజమే! "ఉల్లి చేసే మేలు తల్లికూడా చేయదు" కదా! అందుకే- "ఉల్లిని నమ్మి తల్లిని నమ్మి - చెడ్డవాడు లేడు" అనికూడా అన్నారు మనవాళ్ళు!

ఇహ- ఆ నాటి పిండి వంటల మాటకు వస్తే- గారెలూ బూరెలూ, అరిసెలూ, పులిహోరా, దధ్యోజనం వంటి పదార్థాలు ఎక్కువగా చేసుకునే వాళ్ళు వెనక.

పండుగ వచ్చినా, కొత్తఅల్లుడు వచ్చినా, పప్పునాన పోసి గారెలు వండవలసిందే!

"ఆవగింజంత సందు ఉంటే-అరవై గారెలు అప్పుడే తిననా!".... అన్నాడట వెనుకటి కొక గారె ప్రియుడు! దీనిని బట్టి మన పిండి వంటలలో గారెల ప్రాముఖ్యం వెల్లడి అవుతుంది. "తింటే గారెలు తినాలి-వింటే భారతం వినాలి." అనే సామెత ఊరికే పుట్టలేదు కదా మరి!

తెలుగు వాళ్ళ గారెకు మధ్యన చిల్లి ఉండటం ఎంతో అవసరం. అరచేతి ప్రమాణంలో-అరచేతి మందంతో, చంద్ర బింబం వంటి గుండ్రని రూపంతో, మధ్యన చూపుడు వ్రేలు దూరేటంత చిల్లితో- ఉండేది మన తాతల నాటి గారె!

కాని మనుష్యులకు వచ్చినట్లే ఈ నాటి గారెలకూ నాజూకుదనం వచ్చింది. రూపు రేఖలతో పాటు, ఊరూ పేరూ మార్చుకుంది. ఇప్పుడు గారెకోసం మన హోటళ్ళలో గాలించినా దొరకదు! మనకు హోటల్లో వడ-అంటే దొరుకు తుంది. దాని పేరు రూపాంతరం చెందటంతో పాటు- దాని ప్రమాణమూ, మందమూ తగ్గి- మధ్యలో చిల్లి లేకుండా పోవటం ఒక విశేషం! ఎక్కడైనా సంప్రదాయం వదల్లేక ఆ చిల్లిని అలాగే ఉంచినా, ఆ గారెలో చిల్లి ఎక్కువా- పదార్థం తక్కువాగా ఉంటూఉంది! అంటే- రాను రాను మధ్యలో చిల్లి పెద్దదై, చుట్టూ గారె - అనబడే పదార్థం చిన్నదై వారం రూపంలో ప్రత్యక్ష మవుతూ ఉంది.

"గారెలు వండాలే పెళ్ళామా అంటే వేలు చూపి నట్లు"- అనే సామెత ఎంత నిష్టుర సత్యాన్ని మనకు తెలియ చెపుతుందో !

"గారెల పిండి వంటకయి కాంతుడు కాంతను
బృచ్ఛసేయ నా
సారస నేత్రి వ్రేలొకటి చయ్యన జూపి యిదొక్క-
టున్నదా
ధార మటన్న సామెతగ"....

తిరుపతి కవుల హృద్యమైన పద్య పాదం ఇది !

గారెలు వండాలంటే మాటలా మరి ! మినప్పప్పు' నూనె-వంటి సామగ్రితో పాటు-గారెకు చిల్లి చేయ వలసిన వేలికి కూడా అంత ప్రాముఖ్యమూ ఉంది !

అలాగే. తెలుగు వారికి ఇష్టమైన మరో పిండివంట-పకోడీ గురించి తిరుపతి వెంకటేశ్వర కవులే ఒక అవధానంలో చెప్పిన చక్కని పద్యం-

"సెనగపిండి, ఉల్లిపాయ, చిన్న మిర్చికాయలుం
జూనిపి యందు అల్లమింత బొన్పి ముద్దచేసియున్
అనల తప్తమైన నేతియందు వైచి వేచినన్
జను పకోడి యనెడు పేర జక్కనైన ఖాద్యమై"

ఇంకా- ఆ నాడు మనవాళ్లు చేసుకున్న పిండి వంటల వివరాలు-

"కుడుములు సుకియలు గడియంపు టట్లు వె
న్నప్పాలు వడియంబు లప్పడాలు
పొంగరంబులు సొజ్జె బూరె తాగులు సేవ
లుక్కెర లరిసెలు చక్కిలములు
ఖర్జూర గోస్తనీ కదళికా సహకార
ఫలములు కొబ్బరి పనసతొనలు
తేనియలు జున్ను మీగడ లానవాలు
పానకములు రసావళ్ళు పచ్చడులును
అపచి యొలుపు బప్పును కూరలు పరమాన్న
మపుడు ప్రజనెల్ల దనియించె నహరహంబు!"

-కళాపూర్ణోదయం

గారెలూ, బూరెలూ, పప్పుదప్పళాలతో పాటు-ప్రకృతి ప్రసాదించిన స్వాదు ఫలాలు తిని సంపాదించుకున్న దేహ దారుఢ్యం మన తాతల నాటిది! నక్కదోసకాయలూ రేగు పళ్ళు, అరటి, మామిడి, సీతాఫలం-ఇలా ఏ కాలంలో దొరికే ఫలాలు ఆ కాలంలో కడుపుకు పట్టినన్ని చెట్టున కోసుకు తినేవాళ్ళట! పొలంలో దొరికే చిలకడ దుంపలూ మొక్కజొన్న కండెలూ అక్కడికక్కడే చెకుముకి రాళ్ళతో నిప్పుచేసి కాల్చుకుని తినే వాళ్ళమని చెపుతాడు తాతయ్యను పలకరిస్తే! ఊచబియ్యం వేయించుకుని చారెడు చారెడు తింటూ ఉంటే- ఇంకేమీ తినాలని అనిపించేది కాదుట!

"పరిపక్వ సురభి రంభాఫలంబుల తోడ
దలమెక్కు పనస పెండొలల తోడ

ఘృతపిండ నిభ కర్కరీ ఖండముల తోడ
బలు తెరంగుల మావి పండ్ల తోడ
గోస్తనీ మృదు గుళుచ్ఛ స్తోమముల తోడ
గప్పు దేరిన వడపప్పు తోడ
సుమధుర స్థూల దాడిమ బీజముల తోడ
రసదాడి గనెల తోడ దపపారు
పానకం బతిథుల కిడ్డ దాను గ్రోల
యర్చనా దత్త చందన చర్చ దేలి
విరులు సిగ దాల్చి కర్పూర వీటి జారు
కొట్టుచు ద్విజుండు వెన్నెల బిట్టు గాయు !"

-ఆముక్త మాల్యద

బ్రాహ్మణులు వేసవిలో అరటి పండ్లు, పనసతొనలు. నేతిముద్దల వంటి దోసబద్దలు, మంచి జాతుల మామిడి పండ్లు తియ్యదానిమ్మలు, రసదాడి అనే అరటి పండ్లు- పానకము మొదలైనవి తిని త్రాగుతూ ఉండే వారట ఆ రోజుల్లో.

ఏయే ఋతువులలో, ఏయే తిను బండారాలు, పానీయాలు ఆ రోజులలో తిని త్రాగుతూ ఉండేవారో- ఈ అందమైన పద్యంతో మనకు తెలియ చెప్పాడు సాహితీ సమరాంగణ సార్వభౌముడు కృష్ణదేవరాయులు.

విష్ణుచిత్తుని ఇంట నిత్య సమారాధనలోని వేసవి కాలపు భోజనం ఇలా ఉండేదట !

"తెలి నులి వెచ్చ యోగిరము తియ్యని చారులు
నిమ్మనంబులున్
బలుచని యంబళుల్ చెరకు పాలెడ నీళ్ళు రసావళుల్ ఫలం

బులును సుగంధి శీత జలముల్ వడపిందెలు నీరు జల్లయున్
వెలయగ బెట్టు భోజనము వేసవి జందన చర్చ మున్నుగన్ !"

ఎండాకాలం తాపంగా ఉండే సమయంలో తేలికగా భుజించ దగిన ఆహారం ఇది! తియ్యని చారులూ, చెరకు రసాలూ, పళ్ళు, చల్లని నీరూ- ఇటు వంటి భోజననియమాల తోనే ఆరోగ్యం కాపాడుకోవటం నేర్చిన వాళ్ళు మనవాళ్ళు.

అలా అని- ఈ ఆరోగ్య సూత్రాలు తెలియని వారే ఉండేవారు కారని మనం అపోహ పడకూడదు! అగ్రహారపు బడి తెలుగా పేరుపొంది, వీలయిన చోటల్లా తెగతిని, పనీ పాటూ లేక బొజ్జలు పెంచుకునే బ్రాహ్మయ్యలు ఆ నాడూ ఉన్నారు! ఈ నాడూ ఉన్నారు।

పిలవని వాళ్ళది పాప మన్నట్లు, ఎక్కడ పడితే అక్కడ ప్రత్యక్షమై, పెళ్ళి భోజనాల దగ్గర నుంచీ తద్దినం భోజనాల వరకూ తయారయ్యే భోజన ప్రియుల ఆరాటం, తిండిపైన తీపరం ఈ విధంగా ఉంటుందట!

"సుబ్బంభొట్లూ విన్నావషరా చూడి కొత్త పెళ్ళషరా
అబ్బాయిని అచ్చయ్యను మరి మన అవధాన్లను కేకెయరా
సంతర్పణలష! సంతస మొదవగ గొంతు వరకు తిందాం
ముంత మామిడి పప్పు మిషాయిష ముందు మనం పోదాం
అడిగినంతమటు కొడిష్షారష, అరటికాయ యిగురు
వడియము లప్పడ మటుకులు తెనెయు వడలు
పొంగలియు, చారు చెయ్యి దిగజార
గోఘృత మషరా చెప్పతరమె యనుచున్!"

సంతుష్టిగా భోజనం చేసి, త్రేన్‌మని త్రేనుస్తూ, బొజ్జలు నిమురుకుంటూ కదిలే భోజన ప్రియులు కన్నుల యందు కదులాడుతారు- ఈ మాటలు చదువు తుంటే!

రెడ్ల భోజనమూ, బ్రాహ్మణుల భోజనమూ వర్ణించి నట్లుగానే, మరొక చోట మత్స్యమాంసాలు తినే భోగులైన వారు వేసవిలో తినే భోజనాన్ని కూడా ఎంతో పరిశీల నాత్మక దృష్టితో దర్శించి వర్ణించారు కృష్ణదేవరాయలు.

"తారుణ్యాతిగ చూత నూత్న ఫలయుక్తైలాభిఘార స్వన
ద్ధారా ధూపిత శుష్యదంబు హృత మాత్స్యచ్ఛేద పాకోద్గతో
ద్గారంపుం గనరార్చు భోగులకు సంధ్యా వేళలం గేళి కాం
తారాభ్యంతర వాలుకా స్థిత హిమాంతర్నారి కేళాంబువుల్"

దోర మామిడి ముక్కలతో అప్పుడే తడియార్చిన చేప ముక్కలు వేసి, నువ్వుల నూనెతో తిరగబోత వేసి, తాలింపు చేసి తింటారుట! ఆ చేపలకూర తిన్న కనరు పోగొట్టుకోవటం కోసం-సాయంత్రం వేళల్లో ఇసుకలో పూడ్చిపెట్టిన కొంకాయల నీళ్ళు త్రాగుతూ ఉండేవారట!

ఇలా తాలింపువేసి, కమ్మని వాసనతో వంటకాలు తయారు చేయటం తెలుగు నారికి అనాదినుంచి తెలుసు. తాలింపు, తిరగబోత, తిరగమోత - ఇలా ఎన్నో రకాల నామాంతరాలు కలిగి, 'చుయ్' మంటూ శబ్దంతోపాటు ఘుమ ఘుమ లాడే తాలింపు వాసన రాని తెలుగు వంట యిల్లు ఉండదు!

ఈ తాలింపు సొగసును శ్రీనాధుడు ఎంత ఘాటుగా, కమ్మగా వర్ణించాడో చూడండి!

"ఘాణి పుటీ కుటీరముల గాపురముండ దొడంగె నిప్ప పా
షాణ ఘరట్ట ఘట్టన వశంబున బుట్టిన సత్తుగంద ము
త్క్షీణ కఠోర సౌరభ విజృంభణ దిక్కుల జల్లజొచ్చె సా
మ్రాణి పదార్థ జాలములు బ్రాహ్మణ కాంతలు
తాలబోయగన్"

కవిసార్వభౌముడి భోజన ప్రియత్వం గురించి తెలిసినంతగా-మనకు మరే ఇతర తెలుగుకవిని గురించి తెలియదు. శృంగార ఘట్టాలలో-సందర్భం ఉన్నా లేకపోయినా, స్త్రీ సౌందర్యాన్ని అంగాంగ వర్ణనలతో సాగదీసి వర్ణించిన మన ప్రబంధ కవులు-భోజన ప్రసక్తి వచ్చేటప్పటికి ఏదో అల వోకగా స్పృశించి వదలివేశారు.

శ్రీనాధ మహాకవి సరసుడు, రసజ్ఞుడు, భోగి. శృంగార విషయంలోనే కాక, భోజనం విషయంలో కూడా రుచులు మరిగిన రాజభోగి శాక పాకాల విషయంలో, రుచులలో-ఏమి హెచ్చు తగ్గులు వచ్చినా సహించలేని సుకుమారుడు!

సందర్భం వచ్చినప్పుడూ రానప్పుడూ కూడా చాలా చోట్ల కవి సార్వభౌముడు- ఆ నాటి రాజులూ శ్రీమంతులూ భుజించే భక్ష్యవిశేషాలను నోరు ఊరించే విధంగా వర్ణిస్తాడు. తన భోజన ప్రియత్వాన్ని గురించి నిర్మొహమాటంగా

తెలియ చెపుతూ, చక్కని పద్యాలు చాటువులుగా వ్రాశాడు. తాను మెచ్చిన శాకపాకాలు ఎంత హృద్యంగా వర్ణించాడో, తనకు నోరుదిగని వంటకాలను అంత ఘాటుగా విమర్శించాడు. ఆనాటి సమాజానికి దర్పణం పట్టిన చాటువులతో- ఆ నాటి తెలుగు వారి భోజనపుటలవాట్లు ఈ తరం వారికి కూడా కళ్ళకు కట్టినట్లు తెలుసుకోగల అవకాశం లభించింది.

కొండవీడు, రాజమహేంద్రవరం, విద్యానగరం- మొదలైన రాజధానీ నగరాలలో శ్రీమంతుల ఇళ్ళల్లో హేమపాత్రల్లో పంచభక్ష్య పరమాన్నాలతో విందు భోజనాలు ఆరగించిన కవిసార్వభౌముడికి చివరి దశలో దశ దయనీయంగా తిరిగిపోయింది. రాజ్యాలు అంతరించాయి. మహాకవులకు, సాహితీ సరస్వతికి ధ్వజం పట్టి మహోన్నత స్థితికి తీసుకు పోయిన మహారాజ పోషకులు లేరు. తెలుగు సాహిత్యపు వాసన కిట్టని వొడ్డెరాజులు అధికారంలోకి వచ్చారు. మరో వైపు నుంచి ముదిమి తరుముకుంటూ వచ్చింది. శ్రీనాథ మహాకవికి నగరి వాకిట నుండు నల్లగుండు మోసే దుర్దినాలు సంప్రాప్తమైనవి. తన పూర్వ వైభవాన్ని, అనుభవించిన రాజభోగాలనూ స్మరిస్తూ-

"స్వర్గస్థుడయ్యె విస్సన మంత్రి మరి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తి గలుగు...."

అని వాపోతాడు. ఈ పద్య పాదం చదువుతుంటే మన కన్నులు తడి అవక మానవు.

ఆ హేమ పాత్రల్లో ఏమేమి తినేవారో-రాజాన్నం, రమణీయ పాకాలూ భుజించటానికి అలవాటు పడ్డ శ్రీనాథుడు రాచనగరును వదలి దేశాటన చేసేటప్పుడు పడ్డ కష్ట నిష్ఠూరాలను ఎంత అనుభూతితో వర్ణించాడో చూడండి!

మసర రాజ్యాన్ని సందర్శించినప్పుడు అక్కడి సంకటి ముద్దలనూ, జనుప శాకాలనూ మింగలేక,

"అంకుల బ్రహ్మ ఈ మసర రాజ్యము నెట్లు సృజించె నక్కటా!".... అని విస్తుపోతాడు.

కన్నడ దేశంలో అడుగు పెట్టిన దగ్గర నుంచీ, తన వేషభాషలను, అలవాట్లనూ దేశకాలాను గుణంగా మార్చు కున్నాడు. పాపం - తలమీద కుళ్లాయి పెట్టుకుని, కోక చుట్టుకుని, మహా కూర్పాసనం కూడా తొడుక్కున్నాడు. పైగా, ఆచార విరుద్ధమైనా, వెల్లుల్లిని, తిల పిష్టాన్ని-భుజించాడు. అదిన్నీ విశ్వస్థ వడ్డింపగా నట!

ఆఖరుకు వైరాగ్యం వచ్చి - "రుచులు దోసంబంచు బోనాడి - "

ఇహ భరించ లేక - "తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మీ! దయలేదా నేను శ్రీనాథుడన్!" అని మొర పెట్టు కొంటాడు!

ఇంతటితో ఆగక, తాను భుజించలేని ఆ భోజనాన్ని ఇలా వర్ణించి బాధపడితేనే కాని ఆయన బాధ తీరలేదు.

"మూతిని ముట్టగా వెరతు ముద్దకు ముద్దకు గూటి లోపలన్
బాతిక పాలు సైకతము, పచ్చడి కొంచమె యాది
యంత్యమున్
జూతమటన్న లేదు మరి సున్నము కన్నను మెత్తనన్నమీ
రాతిరి వేళ భోజన మరాతికి నైనను వద్దు దైవమా!"

ఆ నాడు పాతిక పాలు సైకతం కాబోలు! ఈ నాడు అరభాగం సైకతం, కలితీ వస్తువులు, అధిక ధరలతో మనం పడేపాట్లు చూస్తే—శ్రీనాథ కవి ఇంకెంత ఘాటుగా పద్యం చెప్పిఉండే వాడో!

వస్తువులలో కలితీ కలపటం అనే దుర్గుణం ఆ నాడూ ఉండేదా! లేక అశ్రద్ధ చేత-సరిగా బాగుచేయని ధాన్యం దినుసులు వాడుతూ ఉండేవారా! ఏమో! కవిసార్వభౌముడే చెప్పాలి దీనికి సమాధానం!

రేనాటిలో కూడా శ్రీనాథుడికి పాపం, జొన్నన్నంతోనే ఆతిథ్యం తటస్థించింది. సన్నని రాజనాలు తినటానికి అలవాటు పడిన ఆ రాజభోగికి జొన్నన్నం దిగుతుందా? మహాకవి ఆ మెతుకులు మ్రింగ లేక-ఉరుమురిమి మంగలం మీదపడ్డట్లు ఎక్కడో కైలాసంలో కూర్చుని తపోముద్రలో ఉన్న శంకరుణ్ణి సవాలు చేస్తాడు

"గరళము మింగితి నంచుం
బురహర గర్వింప బోకు పో! పో! పో! నీ!
బిరుదింక గాన వచ్చెడిని
మెరసెడి రేనాటి జొన్న మెతుకులు దినుమీ!"

గరళం మ్రింగి అరిగించుకోగలిగిన ఆ శంకరుడు ఈ సవాలుకు ఏమి సమాధానం చెప్పాడో మనకు తెలియదు.

పలనాటి సీమలో కూడా శ్రీనాథుడికి జొన్నకూడే లభించింది! సన్నని వరి అన్నం తినటానికి అలవాటు పడిన ఆ మహాకవి ఆ జొన్న కూడు తినలేక ఆ విషయం పదే పదే ప్రస్తావిస్తాడు.

పలనాటి సీమలో పుడితే మాత్రం-కుసుమాస్త్రుడైనా జొన్నకూడే మెసవు తాడట! పలనాడంతా జొన్నమయమే నంటూ-ఈ అందమైన కందంలో ఫిర్యాదు చేస్తాడు-

"జొన్నకలి జొన్న యంబలి
జొన్నన్నము జొన్న పిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నుగ బల్నాటి సీమ ప్రజలందరకున్!"

కాని ఈ నాటి పల్నాటి సీమ చాలా మారిపోయింది. కవి సార్వభౌముడు ఏ అతీంద్రియ శక్తితో నయినా ఇప్పుడు పల్నాటి సీమలో పర్యటనకు వస్తే-బహుశా తన కళ్ళను తానే నమ్మలేక పోతాడేమో! అక్కడ ఇప్పుడున్న స్థితిగతులను గురించి మరింకెన్ని చక్కని పద్యాలు అల్లి ఉండేవాడో ఊహించుకుంటే-మనస్సు పరవశిస్తుంది!

పలనాడులో ఈ నాడు కృష్ణానది నీళ్ళు పరవళ్లు త్రొక్కుతూ ప్రవహిస్తున్నాయి. ఎక్కడ చూచినా పచ్చని పొలాలు దర్శన మిస్తాయి. ఆ ప్రాంతంలో నివసించే జనం ఇప్పుడు వరిఅన్నమే తింటున్నారు.

శ్రీనాథ కవి భోజన ప్రియుడే కాక హాస్య ప్రియుడు కూడాను! కలిదిండి రామయ మంత్రిగారి రాశాసి తిండిని గూర్చి ఎద్దేవా చేసి, తెలుగు సాహిత్య చరిత్రలో ఆయనకు అమరత్వం కలిగించాడు!

"గ్రామము చేతనుండి పరికల్పిత ధాన్యము లింట నుండి శ్రీ
రామ కటాక్ష వీక్షణ పరంపరచే గడ తేరె గాక మా
రామయ మంత్రి భోజన పరాక్రమమేమని చెప్పవచ్చు నా
స్వామి యెరుంగు దక్కబళి చాతురి తాళఫల ప్రమాణమున్!"

ఎంత నర్మగర్భంగా ఆడిన చతురోక్తి! పద్యం చదవటం పూర్తి అవుతూనే మనకు నవ్వు మొలకలు పుట్టక మానవు!

ఓరుగల్లులో మాత్రం-మహాకవికి మనసు తీరిన భోజనమే దొరికి నట్లుంది! అక్కడ ఒక్క రూపాయికే దొరికే భోజనం విందు భోజనంలా ఇలా ఉందట:

"కప్పుర భోగి వంటకము కమ్మని గోధుమ పిండి వంటయున్
గుప్పెడు పంచదారయును క్రొత్తగ కాచిన యాల నేయియున్
పప్పును. గొమ్ము నల్లనటి పండ్లును, నాలుగునైదు నంజులున్
లప్పలతోడ క్రొంబెరుగు లక్ష్మణ వజ్ఝల యింట రూకకున్!

పరదేశస్థులకూ బ్రహ్మచారులకూ-ఇంత మధురమైన భోజనం పెట్టగలిగే లక్ష్మణ వఝ్ఝలల సంప్రదాయం ఆనాటి పూటకూళ్ళమ్మలది.

కాని ఆ నాటి లక్ష్మణ వఝ్ఝల పెట్టగలిగిన భోజనం-ఈ నాడు తెలుగు నాట కరువే అయిందనిపిస్తుంది.

గుప్పెడు పంచదార ఏదీ ఇప్పుడు! క్రొత్తగ కాచిన యాల నేయి-పోనీ 'లప్పల తోడి క్రొంబెరుగు' ఏదీ!

తెలుగు తనం మూర్తీభవించే తెలుగు వంటకాలను గురించి ఇన్ని అందమైన పద్యాలు చెప్పి అజరామరమైన కీర్తిని సంపాదించి పెట్టాడు కనుకనే కవి సార్వభౌముని గురించి ఇంతగా ప్రస్తావించ వలసి వచ్చింది.

కాలంతో పాటు వేష భాషల్లో, అలవాట్లల్లో-ఎన్నో మార్పులు వచ్చినట్లే-మన రుచుల్లోనూ అభిరుచుల్లోనూ కూడా చాలా మార్పులు వచ్చాయి. ఇప్పుడు మనం చేసుకు తినే వంటల్లో కొంతవరకు తెలుగు తనం తగ్గి కొత్తపోకడలు కలిశాయి. భారత జాతి సమైక్యతా చిహ్నంగా అన్ని ప్రాంతాల వంటకాలనూ నేర్చి చిత్ర విచిత్రమైన వంటలు చేయ నేర్చింది తెలుగునారి.

ఎన్ని రకాల రుచులూ అభిరుచులూ ఉన్నా-ఏ ఎండకా గొడుగు పట్టగలిగే నేర్పూ ఓర్పూ కూడా ఉంది తెలుగు వాడికి. అందుకే-తనకిష్టమైన ఉప్పూ, పులుపూ, తీపితో పాటు- ఉగాది పచ్చడిలో రవ్వంత వగరూ, చేదూ కూడ కలుపుకుని తినటం నేర్చుకున్నాడు. జీవితంలో ఎదురువచ్చే సాధక బాధకాలను ఏదో ఒక విధంగా ఎదుర్కొ గలిగే స్థైర్యాన్ని అలవరచుకున్నాడు.

కాలమాన పరిస్థితులు అన్ని వైపుల నుంచీ కరవ వస్తున్నాయి. మనుగడకూ భోజనానికీ అవసరమైన ఉప్పూ చింతపండు, మిరపకాయవంటి నిత్యావసర వస్తువుల ధరలు

మిన్నంటుతున్నాయి. దొరికిన దాంట్లో సగభాగం కలితీ కలిపిన సరుకు. పొయ్యి మీదకూ పొయ్యి క్రిందకూ కూడా అవసరమైన వస్తువుల కోసం దినదినమూ చాంతాడంత క్యూలో నిలబడితేనే కాని రోజు గడవని పరిస్థితి వచ్చింది. అయినా, ఉగాది పచ్చట్లో చేదును భరించినట్లే-జీవితంలో చేదునూ భరించటం నేర్చుకున్నాడు తెలుగబ్బి.

పసిపిల్లవాడిని వాళ్ళోకూర్చోపెట్టుకుని, ఆ తల్లి వెన్నెట్లో కూర్చుని-ఆ బుల్లి చెయ్యి చేతుల్లోకి తీసుకుని-

"చేతులు కడిగి - అరిటాకేసి
పప్పు పెట్టి - బువ్వ పెట్టి
కూరేసి - నెయ్యేసి
చారోసి - మజ్జిగోసి"

అత్తారింటికి దారి చూపుతూ, తాను గలగల లాడుతూ, పసివాడికి కిత కితలు పెట్టి కిలకిల లాడిస్తుంది, ఇప్పుడా పప్పా, కూరా, నెయ్యా, కరువైనా,

"చేతులు కడిగి - అరిటాకేసి
అన్నం పెట్టి - పచ్చడేసి
చారోసి - మజ్జిగోసి"

బిడ్డడికి అత్తారిల్లు చూపుతుంది. అయితే ఒక్క సంగతి! ఇప్పుడలా అరిటాకేసి, నీళ్ళు జల్లి - అన్నంవడ్డించుకు తినే అలవాటు కూడా మనలో చాలా వరకు తగ్గి పోయింది. ఎక్కడో పంక్తి భోజనాలలో తప్ప, ఇప్పుడు విస్తరి భోజ

నాలు లేవు. వెనుకటి రోజుల్లో ప్రతివారూ విస్తట్లోనే భోజనం చేసేవారు. ఏమీ లేక పోయినా, ఉత్తుత్తి డాంబి కాలకు పోయి మిడిసిపడే వాళ్ళను చూచినప్పుడు - ఏమీలేక గాలికి ఎగిరెగిరి పడే విస్తరి జ్ఞాపకానికి వస్తుంది. అన్నీ ఉన్న విస్తరి అణిగి మణిగే ఉంటుందన్, అన్యాపదేశంగా మనవాడుక లోకి వచ్చిన నానుడి.

ఇంట్లో కంచాల్లో తిన్నా, దగ్గరి చుట్టాలకూ, అయిన వాళ్ళకూ కంచాల్లో వడ్డించినా - అతిథి అభ్యాగతులకు, కాస్త దూరపు బంధువులకు - విస్తరివేసి వడ్డించడం మన ఆచారం. అందుకే, ఎవరైనా దగ్గర వారిని నిరాదరణగా చూచి దూరపు వారిని ఆదరిస్తే - "అయిన వారికి ఆకుల్లోనూ కానివారికి కంచాల్లోనూ!" - అనే సామెత వాడుతూ ఉంటారు.

అయితే-ఇప్పుడు అంతటా ఆ విస్తరి భోజనాలు తగ్గి, గాజుప్లేట్లూ, ప్లాస్టిక్ ప్లేట్లూ, స్టీలు పళ్లాలూ వాడుకలోకి వచ్చాయి. అదే విధంగా-పీట వాల్చుకుని, బంతిచాప పరచుకుని, భోజనం చేసే అలవాటు ఇప్పుడు చాలా తెలుగు కుటుంబాల్లో తగ్గిపోయింది. ఆ స్థానంలో బల్లమీద భోజనాలు చేయడం పద్ధతిగా మారింది. విందు సమయాల్లో బఫే భోజనాలు-ఇల్లంతా తిరుగుతూ భోజనం చేయడం-ఫాషన్ అయిపోయింది. చేతితో అన్నం కలుపుకుని తినటం కూడా కొంతమంది శ్రీమంతుల ఇళ్ళల్లో అనాగరికం అయి

పోయింది. పాశ్చాత్య ప్రభావం మన మీద పడి-స్పూనూ, ఫోర్కూ, కత్తులూ, కటార్లూ పట్టుకుంటే గాని భోజనం లోపలకు పోని రోజులు వచ్చాయి.

ఎన్ని మార్పులు వచ్చినా, ఎన్ని నవీన పద్ధతుల్లో తిన్నా, ఏ కంచంలో తిన్నా, తెలుగువాడు తినేది ఆనాటికీ ఈ నాటికీ అన్నమే! అన్నగతమైనది తెలుగు ప్రాణం. ఇది తెలుగు వాళ్ళమైన మన అందరికీ బాగా తెలిసిన సంగతి. మరి ఈ కథంతా ఎందుకు? ఎందుకు మన అన్నాన్ని గురించి మనమే చెప్పుకోవటం!

"మరల నిదేల రామాయణం బన్నచో
నీ ప్రపంచక మెల్ల నెల్ల వేళ
దినుచున్న యన్నమే తినుచున్నదిన్నాళ్లు
తన రుచి బ్రతుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయు చున్నది
తనదైన యనుభూతి తనది గాన
తలచిన రామునే తలచెద నేనును"

అంటారు విశ్వనాథ.

మరి నా సమాధానం కూడా ఇదే. తర తరాలుగా తింటూ ఉన్న అన్నమే తింటూ ఉన్నా, నా మనస్సులో చవులూరిన భావనా లహరి ఇది. * * *

15

# ఆచారాలు

మండించి వేస్తున్న మండు వేసవి మధ్యాహ్నం హఠాత్తుగా ఒక చిరుగాలి వీచినట్లయింది. ఆ మంద పవనం చల్లగా లోపలకు దూరి నా ఒంటిని స్పృశించే సరికి ప్రాణం హాయి అనిపించి లేచి వరండాలోకి వచ్చాను.

నింగిలోంచి తొలకరి తొలిమబ్బు ఒకటి తొంగి చూచింది.

"తొలకరి ఒక మబ్బు తొంగి చూచింది
మబ్బులో ఒక మెరుపు మెరిసి పోయింది!
పెరటిలో ఒక జల్లు కురిసి వెలిసింది
జల్లులో నా మనసు జారి పోయింది!"

తొలకరితో పాటూ తిరిగి వస్తానన్న మగడు ఇంకా రాలేదు. తొలకరి జల్లుతో తడిసి ఎదురు చూచే కన్నె మనసు ఝల్లుమంటూ జారిపోయిందట! ఎంత తీరని వ్యథ!

పల్లెపదం ఇంత మధురంగా ఉంటే కాళిదాస మహా కవి కవనం ఇంకెంత బాగుందో!

"ఆషాఢస్య ప్రథమ దివసే మేఘ మాశ్లిష్ట సానుం
వప్రక్రీడా పరిణత గజ ప్రేక్షణీయం దదర్శ"

ఓహో! ఆషాఢమాసం వచ్చేసింది! ఈ వేళ ప్రథమ దివసం కాబోలును!

విరహాగ్నిలో వేగిపోతున్నాడు యక్షుడు. ఎక్కడో దూరాన ఉన్న ప్రియురాలికి ప్రేమ సందేశం మోసుకు పోవటానికి- ఈ ఆషాఢ మాసపు తొలకరి మేఘం రాయబారితనానికి వప్పుకుంది కాబోలును!

ఉన్నట్లుండి కారునల్లగా వ్యాపిచిం, ఆ మబ్బు బాలిక స్నిగ్ధమందహాసం చేసినట్లు, సన్నని మెరుపుతీగె ఒకటి లాస్యం చేసి మాయమయింది.

గజరాజు తెల్లని దంతాలతో అడ్డంగా రాపాడినట్లు ఆ శంపాలత ఆ విరహార్తుడికి కనిపించిందట! ఎంత మనోహరమైన వర్ణన! నాకు నవ్వు వచ్చింది. అసలు ఈ ఆషాఢ మాసం కూడా తక్కువ తిన్నదా? వస్తూ వస్తూనే క్రొత్త జంటల్ని వేరు చేస్తుంది. నవదంపతుల మధ్య అడ్డుగోడగా వెలుస్తుంది!

ఆషాఢం వచ్చిందంటే అంతే పెట్టినట్లే।
అత్తా అల్లుడూ గడప దాట కూడదు!
అత్తా కోడలూ ఎదురు పడకూడదు!
ఏమిటో ఈ ఆచారం। ఎందుకో ఈ అంతే।
"పిట్ట పిట్టా ముద్దు పెట్టుకున్నాయి
గోవులన్నీ ఇల్లు చేరుకున్నాయి
ఎదురు చూచిన గుండె చెదిరిపోయింది!"

అంటూ ఎంత మొత్తుకున్నా లాభం ఉండదు. పాపం, పిల్ల పుట్టింట్లోనూ, అల్లుడు అడంగులోనూ ఆషాఢాన్ని శాప నార్థాలు పెట్టుకుంటూ కాలక్షేపం చేయాలిసిందే!

నేను చప్పున లోపలకు పరిగెత్తి, బామ్మ దగ్గర కూల బడ్డాను. రాట్నం వడుకుతూ ఉన్న బామ్మ—

"నీ తొందర దొంగల్తోలా! ఏం పిల్లవే నువ్వు!"....
అన్నది.

"నాకో సంగతి చెప్పాలి బామ్మా! ఆషాఢమాసంలో మొగుళ్ళూ పెళ్ళాలూ-అంటే కొత్తగా పెళ్ళయినవాళ్ళు లే-ఒక దగ్గిర ఎందుకు ఉండకూడదు? అత్తా అల్లుడూ-అత్తా కోడలూ ఒకే గడప ఎందుకు దాటకూడదు?"....అన్నాను.

బామ్మను నేనీ ప్రశ్న ఎంతో ధీమాగానే వేశాను. ఎందుకంటే నాకు ఎప్పుడే సందేహం వచ్చినా అన్నిటికీ యుక్తి యుక్తంగా సమాధానాలు చెప్పగల ఒకే ఒక సోర్సే (Source) బామ్మ!

ఆచారాలు బాగా పట్టుకుంటుంది ఆవిడ. అడుగడుక్కూ ఆంక్షలు పెడతూ ఉంటుంది. ప్రతి చిన్న విషయానికి-ఇది మంచిదీ, ఇది మంచిదికాదూ-అంటూ సిద్ధాంతాలు చెపుతూ ఉంటుంది. ఆ 'మంచీ-చెడూ' ఏమిటోకాని-అది బామ్మ దృష్టిని దాటిపోవటం మటుకు చాలా అరుదు!

బామ్మ నావంక చూచి నవ్వి అన్నది.

"పెళ్ళిళ్ళు ఎక్కువగా మాఘమాసంలోనే చేస్తుండే వాళ్ళు కదుటే వెనుక! ఆరోజులలో-పెళ్ళయిందగ్గరనుంచీ

కొత్త అల్లుడు మనుగుడుపులు కుడుస్తూ అత్తవారి ఇంట్లో తిష్ట వేసుకు కూర్చునేవాడు. ఆరు నెల్లయినా అల్లుడు గడప దాటకపోతే, అమర్యాద లేకుండా అతగాణ్ణి సాగనంప టానికి మనవాళ్లు ఈ ఎత్తు వేశారు. అదే ఆచారమై కూర్చుంది!

ఆరు నెలలు అత్తారింట్లో మఠం వేసుకుని కూర్చునే ఆ వెనుకటి అల్లుళ్ళకు పనీ పాటూ యేమీ ఉండేదికాదా ఏమిటి? అసలు వాళ్ళకు అన్నాళ్లు అత్తారింట్లో తిని కూర్చోవటానికి అభిమానం అడ్డు వచ్చేది కాదా! ఎంత కొత్త పెళ్ళా మయితే మట్టుకు, వాళ్ళకు కాలం ఎట్లా గడిచేది?"....అన్నీ సందేహాలే నాకు!

వెనుకటివాళ్ళు అంతేనే పిల్లా! ఈ చదువులూ, ఉద్యోగాలూ అప్పుడెక్కడివీ! శలవు మంజూరు అయిందనీ, కాలేదనీ గొడవ ఉండేదికాదు. వ్యవసాయపు పనులేవీ ఉంటే, ఇంటికయిన తండ్రో, అన్నగారో-ఇంటి పెద్దగా వ్యవహరించి అన్ని పనులూ చూచుకునేవారు. ఇహ అత్తారింట్లో అన్నాళ్లు ఉండటం గురించి అభిమానం అంటావా? పెళ్ళయిన ప్రతి కొత్తల్లుడూ చేసే పనే అది! కాలం గడవటం ఎట్లా అంటావా! కొత్త పెళ్ళాంతో కాలం గడపటానికేం ఉందే! పగలంతా పైలాపచ్చీసుగా ఊళ్లో షికార్లు తిరగటమూ, రాత్రి అయేటప్పటికి పెళ్ళాంతో సరసాలు మొదలు పెట్టటమూ".... అంటూ నా సందేహాలన్నీ ఒక్క పెట్టున ఎగిరిపోయేటట్లు సమాధానం చెప్పింది బామ్మ!

"ఓహో! అత్తారింటో హనీమూన్ గడపడం అన్న మాట!"

"హల్లీ ముల్లీయో కాని, ఆరునెల్లూ ఆ అల్లుణ్ణి భరాయించే టప్పటికి ఆ అత్తారికి మాత్రం తల ప్రాణం తోకకు వచ్చేది!

"ఏం?...." అన్నాను.

"ఇప్పట్లాగా అనుకున్నావా ఏమిటేపిల్లా! అల్లుడింట్లో ఉన్నాడంటే ఎంత సందడి! ఎంతపని! ఎన్నిమర్యాదలూ! ముప్పూటా అన్నాలు తినే వాళ్ళు అప్పటి అల్లుళ్ళు! ముప్పూటా వంటచేసి వేడి వేడిగా వడ్డించవలసిందే! కాఫీలూ గట్రా లేక పోయినా, గారెలూ, బూరెలూ, కుడుములూ, సున్నుండలూ-ఇట్లా ఆ రోజుల్లో చేసుకునే పిండి వంటలన్నీ చేసిపెట్టేవాళ్ళు. వారం వారం మంగల్ని పిలిపించి నూనెపట్టించి, నలుగు పెట్టించి, తలంటించే వాళ్ళు. పండుగలొస్తే కొత్తబట్టలవీ సరేసరి!"

అందుకే కాబోలు—'అల్లుడు పదవగ్రహం' అని ముద్దుగా పేరు పెట్టుకున్నారు మనవాళ్ళు.

ఈ అల్లుళ్ళ కోరికలు ఆ నాటికీ ఈ నాటికీ ఒక్క తీరుగానే ఉన్నాయి. అర్జునుడంతటి వాడే భార్యను దెప్పి పొడిచే వాడట ఇలా-

"పున్నెంబు నాడైన బూరెలొండు కోసి
పుణ్యాడ రమ్మనీ పిలిచిరా మీ వాళ్ళు!

అమావాస్య నాడైన అట్లు వండుకోనీ
అల్లుడా రమ్మనీ పిలిచిరా మీా వాళ్ళు !"

అసలు ఈ గారెలూ బూరెలూ అంటే ఈ అల్లుళ్ళకు ఎంత ఇష్టమో మరి ! వెనకటికి-

"అల్లుడా ! ఎప్పుడు వచ్చావంటే-రాత్రి వండిన గారెల సంగతి చెప్పనా అన్నాడట !"

ఇలా ఆ కొత్తఅల్లుడు సకల మర్యాదలతో అత్తారింట్లో రాజభోగాలు అనుభవిస్తూ ఉండేవాడు. ఆ భోగాల్నీ అంతకు మించి కొత్త పెళ్లాన్నీ వదిలిపెట్టి పోవటం మహా కష్టంగానే ఉండి ఉంటుంది పాపం ఆ అర్భకుడికి !

అందుకే మన వాళ్ళు ఆషాఢమాసం వంక పెట్టుకుని ఈ అంతా ఏర్పాటు చేసుకుని ఉంటారు. అదీ సంగతి। అల్లుడికి అలక రాకుండా తెలివిగా ప్లాను వేశారు। అదే మనకు ఆచారంగా తయారయి ఉంటుంది।

తుమ్ములను గురించి బామ్మ పెట్టే ఆంక్షలూ, వాటి మంచి చెడులను గురించి ఆమె చెప్పే విషయాలూ ఇన్నీ అన్నీ కావు. తుమ్ములనేవి మనకు ఎవరికీ చెప్పిరావుకదా। నాకు మరీని। అవి జోత్తిగా అసందర్భమైన సమయాలలోనూ అనువు గాని స్థలాలలోనూ నన్ను పట్టుకుని వేధిస్తుంటాయి.

బామ్మ అలా వసారాలో కూర్చుని రాట్నం వడుకుతుంటే-గడప మీాద కూర్చుని ఆవిడతో మాట్లాడుతున్నప్పుడు నాకు ఒకటీ అరా తుమ్ములు రావటం కద్దు!

అందుకు పాపపరిహారంగా బొమ్మ చిటుక్కున ఒక చిటిక వేస్తుంది. తను చేస్తున్న పని ఆపి, లేచివెళ్ళి_ఇన్ని నీళ్ళు చేత్తో పట్టుకువచ్చి నా నెత్తిన చిలకరిస్తుంది.

"ఏమిటమ్మా ఇదీ!"....అంటే-

"అయ్యో! గడప గణ్ణం కాదుటే!" .... అంటుంది! ఏమిటో ఆ గడపగణ్ణం! బొమ్మను సృష్టించిన బ్రహ్మదేవుడికి తెలుసేమో మరి!

ఎప్పుడైనా దొడ్లో రోటిమీద కూర్చుని తుమ్మినా అంతే! ఇంట్లోకి వెళ్ళి రెండు బియ్యపు గింజలు తెచ్చి నా నెత్తిన జల్లుతుంది. దానితో ఆ తుమ్ముకు పరిహారం అయినట్లు తేలిగ్గా ఊపిరి తీసుకుంటుంది.

ఇహ తుమ్మడానికి బొత్తిగా అసందర్భమైన సమయాలు ఆవిడ దృష్టిలో వేరే ఉన్నాయి. ఎవరైనా ఎక్కడికైనా ప్రయాణమై ఇంట్లోనుంచి బయటకు బయలు దేరే వేళకు ఆపుకోలేని తుమ్మువస్తే, వాళ్ళ ప్రయాణం ఎంత ముఖ్యమైనదైనా సరే - వాయిదా వేయిస్తుంది. వాళ్ళు లోపలకు వచ్చి, కాళ్లూ చేతులూ కడుక్కుని పుక్కిలించి ఊసి, పసి పిల్లని మాయం చేసినట్లు ఆ తుమ్ముదుష్ఫలితాన్ని 'షూ మంకాళీ!' అంటూ మాయం చేసి అప్పుడు అడుగు బయటకు పెట్టవలసిందే!

ఏదైనా శుభకార్యం జరుగుతూ ఉన్న సందర్భాల్లో కూడా బొత్తిగా సమయ సందర్భాలెరగని తుమ్మువస్తుం

టుంది నాకు. ఆపుకుందామని చేసిన ప్రయత్నం విఫలం అయి, ముఖం ఇంత లావున కందిపోయి, వికారంగా అయినా కూడా-ఎట్లాగూ అది బయటకు వచ్చి తీరుతుంది!

ఆ సమయాల్లో మాత్రం ఏమి చేయటానికీ వీలు కాక, బామ్మ నా వంక కొరకొరా చూస్తుంది।

నాకు నెలకొక సారయినా, వంతుగా వచ్చి పోతూ ఉంటుంది జలుబు భారం. వస్తూ వస్తూ, తుమ్ము తెరల్ని కూడా వెంటేసుకు వస్తుంది. అందుకే, ఈ తుమ్ముల విషయంలో బామ్మకు తరచుగా నా పైన బోలెడు కోపం, అసంతృప్తి కలుగుతూ ఉంటుంది।

సైన్సు ఈ తుమ్ముల్ని గురించి చెప్పేకథ వేరుగా ఉంటుందని నాకు తెలిసినా, బామ్మ ఎదుట పడి నా సిద్ధాంతాన్ని చెప్పగలిగే సాహసం లేదు నాకు.

చిన్నప్పుడు ఆడుకొంటూ, గెంతుతూ-కాళ్ళారజాపుకుని లోకాభిరామాయణంలో మునిగిపోయిన పెద్దవాళ్ళ కాళ్ళ మీదుగా దాటిపోయేవాళ్ళం. బామ్మ అది చూచి భగ్గుమనేది. "అలా కాళ్ళు దాటకూడదర్రా!" .... అంటూ చెయ్యిపట్టుకువచ్చి, మళ్ళీ ఆ కాళ్ళ మీదుగా దాటించేది. అదేమిటో అప్పుడు తెలియక పోయినా, మొన్నీమధ్య అందులో విశేషం ఏమిటని అడిగితే బామ్మ ఇలా చెప్పింది.

కాళ్ళు దాటించుకున్న వాళ్ళ అయిదోతనం పోయి, దాటిన వాళ్ళకు అది సంప్రాప్తిస్తుందట! ఏనాటిదో ఈ నమ్మకం!

తల అంటుకోవటానికి నాకెప్పుడూ సమయందొరకదు. జలుబు లేని సమయ మెప్పుడో చూచుకుని, తలంటుకుందా మని మాడున ఆముదం పెట్టుకున్నానా, బామ్మ చూచిం దంటే, చేతిలో పని మానేసి, కొంపలంటుకు పోయినట్లు పరు గెత్తుకు వ సుంది. చేతినిండా ఆముదం వంపుకుని మాడుకు పట్టించి మర్దన చేస్తుంది.

"ఎన్నిసార్లు చెప్పానే పిల్లా నీకు-ఎవరికి వారే నెత్తిన నూనె పెట్టుకో కూడదని!".... అంటూ మందలిస్తుంది.

ఆముదం నెత్తిన పెట్టేముందు వేలితో ఒక్క చుక్క నూనె తీసి నేల రాస్తుంది. అది నేల తల్లికి నైవేద్యం కాబోలు!

శకునం చూచుకుని, మంచిరోజు చూచుకుని మరీ బయలు దేరటం మనకు ఇప్పటికీ ఆనవాయితీలో ఉన్న ఆచారమే: ఒంటి బ్రాహ్మణుడూ, పిల్లి, వితంతువు, కొత్త కుండలు-ఇవన్నీ ఎదురు రాకూడని నిషేధపు శాల్తీలు. వాటి ఖర్మకాలి, అవి ఎదురు వస్తే ఆ ప్రయాణం మరీ అంత అర్జంటు కాకపోతే అంతటితో ఆపుకోవటమో-మరీ తప్పని సరి అయితే, లోపలకు వచ్చి కాళ్ళూ చేతులూ కడుగుకుని-కొంతసేపు ఆగి-ప్రయాణం చేయటమో చేస్తారు శకునాలపై నమ్మక మున్నవాళ్ళు.

ము త్తయిదువలో, పసిపిల్ల తల్లో, మజ్జిగ కుండతో గొల్లెతో ఎదురువస్తే, ఆ వెళ్ళిన కార్యం ఘంటా పథంగా సానుకూల పడుతుందని మనవాళ్ళ ఊహ.

ఇది వట్టిఊహో గట్టిగాథో-ఎవరికి వారే అనుభవం ద్వారా తెలుసుకో వలసిన విషయం. జిజ్ఞాసువులైన వారు పరిశోధనకు పెట్టుకోవలసిన విషయం.

శకున శాస్త్రం అని ఒక శాస్త్ర విజ్ఞానం మనకు ఉన్నది. బల్లి శకునం ఇప్పటికీ చాలా మంది నమ్మే విషయం. మన పురాణాలలో శుభశకునాలు, అశుభ శకునాలు-ఎన్నో సందర్భాలలో పురాణ పాత్రలకు సూచనగా తోచడం, తదనుసారంగా శుభా శుభాలు జరగడం ఎన్నోచోట్ల ఉదహరింపబడింది.

శకునం వంటిదే స్వప్న ఫలితాలు కూడాను. మనకు స్వప్న శాస్త్రం ఉన్నది. ఒక్కొక్క రకమైన స్వప్నం ఒక్కొక్క రకమైన ఫలితాన్ని కలిగిస్తుందని నమ్ముతారు. తెల్లవారుఝామున వచ్చే కల వెంటనే సార్థక మవుతుందని అంటారు. కాని మొదటి జామున వచ్చిన కల సంవత్సరానికి ఫలిస్తుందట! రెండవ జామున వచ్చినది ఎనిమిది నెలలకు, మూడవ జామున వస్తే మూడు నెలలకు ఫలిస్తుందని స్మృతులలో స్వప్నాధ్యాయమున కొన్ని స్వప్న ఫలితాలు వ్రాయబడి ఉన్నవి. పగటి కలలు మాత్రం ఫలితం లేనివి కనుక త్యాజ్యములట !

" ఆరోహణం గో వృష కుంజరాణాం ప్రాసాద శైలాగ్రి వనస్పతీనాం విష్ఠాను లేపో రుదితం మృతంచ స్వప్నేష్వ గమ్యా గమనం చ ధన్యం "— కలలో ఎద్దులను, ఏనుగులను, మేడలను, కొండ శిఖరాలను చూచుట, కాచు,

పూచు చెట్లను ఎక్కుట, ఏడ్చుట, చచ్చుట - ఇవన్నీ శుభ ప్రదాలట !

"ఉరగో వృశ్చికో వాపి జలూకా దృశ్యతే యది అవ్యయం చార్థ సిద్ధించ పుత్ర తస్య వినిర్దిశేత్ !"

నిజ జీవితంలో మనం భయంతో ఎదుర్కోలేని కష్టం- పాముచేతనో, తేలుచేతనో, జలగ చేతనో, ఎలాగైనా కలలో ఒక్కసారి కళ్ళు మూసుకుని కరిపించుకుంటే - విశేష ధన ప్రాప్తి, పుత్ర ప్రాప్తి-కూడా కలుగుతుందని స్మృతి పురాణం.

ఇలా చెప్పుకుంటూ పోతే మనవాళ్ళకు అనాదిగా ఏర్పడిపోయిన నమ్మకాలూ, తద్వారా అలవాటు పడిన ఆచారాలూ ఎన్నెన్నో !

ప్రయాణం వస్తే - శకునాలూ వగైరా చూచుకో వటమే కాదు-అతడు బయలుదేరి వెళ్ళేటప్పుడు "ఎక్కడకు"? .... అంటూ కట్టుకున్న పెళ్ళామైనా అడగ కూడదు! అడిగితే-ఆ పని అంతటితో ఆఖరయినట్లే !

ఆ ప్రయాణానికి బొత్తిగా పనికిరాని తిథులు అష్టమి నవములు ! ఇవి ఏ శుభ కార్యానికీ పనికిరాని శనిగ్రహాపు తిథులు !

మరి త్రేతాయుగంలో శ్రీరామ చంద్రుడికీ, ద్వాపర యుగంలో శ్రీ కృష్ణమూర్తికీ-భగవదవతారాలు కదా- భూలోకంలో జన్మించటానికి ఈ రెండు తిథులే ఎందుకు కావలసి వచ్చినాయో ! ఏదో విశేషం లేకపోతే, ఆ పుణ్య మూర్తులు తమ అవతరణానికి ఆ రెండు దినాలూ ఎన్నుకుని ఉండరని నా నమ్మకం ! అష్టమి తిథి అయినా కృష్ణాష్టమీ,

నవమి తిథి అయినా శ్రీరామ నవమీ-మనం ఇంత పుణ్య దినాలుగా పరిగణించి వేడుక జరుపుకుంటున్నాం!

ఆ మాట నేనన్నానంటే, బామ్మతో మరో వివాదానికి నాంది ప్రస్తావన చేసుకున్నానన్న మాటే!

మళ్ళా ప్రయాణాల సంగతి ఎత్తుకుంటే మరింకెన్నో అంశాలు? ఆదివారం పడమటి ప్రయాణం చేయకూడదని కూడా అంటూ ఉంటుంది బామ్మ!

"రైళ్లూ, బస్సులూ, విమానాలూ ఏ వైపుగా ప్రయాణం చేస్తున్నాయో అంచనాలు కట్టి ప్రయాణం కుదుర్చుకోవటం ఎవరికి సాధ్యం!".... అని నేను కొంటెతనానికి అంటే-

"అంత తూర్పు పడమరా తెలియకుండా పోతుందా ఏమిటే నీకు!".... అంటూ గదమాయిస్తుంది.

అలాగే-తీరిక దొరికే రోజు కనుక ఆదివారం పూట తల అంటుకునే స్నానం చేశానా-బామ్మ చివాట్లు తప్పవు!

"ఆడపిల్లలు ఆదివారం పూట తలంటుకుంటే ఆవగింజంత అయిదవతనం తగ్గుతుంది!".... అంటూ గదుముకుంటుంది.

"మరి మగవాళ్ళు అంటుకుంటేనో!".... అని నేను అడిగితే-"ఆయుర్దాయం తరుగుతుంది!" .... అంటూ తడుముకోకుండా సమాధానం చెపుతుంది.

హాత్తోస్సి! ఆదివారం తెచ్చిపెట్టేపాట్లు ఇన్నీ అన్నీ కావు అయితే!

బామ్మకు ఇంచుమించు ప్రతి రోజూ ఏదో ఒక పని చేయటానికి నిషేధమైనదిగానే ఉంటుంది.

మంగళవారం వస్తే పాతగుడ్డలు చిరిగినవి కుట్టుకో కూడదంటుంది! ఇంకా మంగళవారం పొయ్యిమీద మంగలం పెట్టి వేయించకూడదు!—ఈ రోజుల్లో మంగలాలు పొయ్యి మీద పెట్టి అసలు ఏవారంలోనూ ఎవరూ వేయిస్తున్నట్లు కనపడదు!

మంగళ బుధ వారాలు ఎట్టి పరిస్థితిలోనూ మంచం బిగించకూడదు!

శుక్రవారం పసుపు కొట్టుకోకూడదు!

ఇలా చెప్పుకుంటూ పోతే బామ్మ ఏదో ఒక పనికి ఏదో ఒక రకంగా పెట్టే ఆంక్షలకు లెక్క ఉండదు!

మంగళవారమో, శుక్రవారమో, అష్టమిపూటో గాజులసెట్టి వచ్చాడని మోజుగా గాజులు తొడిగించుకోబోతే వల్లమాలిన కోపంతో ససేమిరా వల్లకాదంటుంది!

బస్తీలో గాజుల షాపుల్లో దూరి అన్ని వస్తువుల్లాగా గాజులు కూడా కొని తెచ్చుకునే ఈనాటి ఇల్లాళ్ళకు బహుశా ఈ ఆంక్ష తెలిసి ఉండకపోవచ్చు! తెలిసి, నిజంగా ఈ నమ్మకం వాళ్ళ మనసులో నాటితే - గాజుల షాపులవాళ్ళ వ్యాపారం ఏంకాను!

అష్టమీ, అమావాస్యా వస్తే - కొత్త మడత విప్పి కొత్త బట్టలు కట్టుకోనివ్వదు బామ్మ.

ఇహ పెళ్ళి, పేరంటాళ్ళ వంటి శుభ సమయాల్లోనూ, ఆడపిల్ల చూలింత, బాలింతగా ఉన్నప్పుడూ-బామ్మ విధించే నియమాలూ, చెప్పే మంచి చెడులూ-ఎన్నెన్నో!

ఇలా ప్రతిదానికీ-"కాదూ, కూడదూ, వల్లకాదు!" అంటూ అడ్డంవచ్చే బామ్మని చూస్తే ఒక్కొక్కసారి చిరాకుగానే ఉంటుంది.

కానీ ఏం చేస్తుంది పాపం ఆవిడ! ఈ అంతటి లన్నిటికీ కర్తృత్వభారం ఆవిడది కాదు పాపం! ఏనాడో మనవాళ్ళు ఏదో కారణంగా, తమకు తామే విధించుకున్న కట్టుబాటులివి. కొన్నిటికి శాస్త్ర సమ్మతమైన వైజ్ఞానిక కారణాలు మూలం కావచ్చును. కొన్నిటికి ఏ ఆధారమూ ఉండక పోవచ్చును. వాటిని తు. చ. తప్పకుండా అనుసరించటం మాత్రమే అనూచానంగా వస్తూ ఉన్న సంప్రదాయం.

ఆ నాటి నమ్మకాలూ, పెద్దవాళ్ళు చెప్పే ఆచారాలూ-ఒక్కొక్కసారి చిత్రంగా కనిపిస్తాయి. ఈతరంవాళ్ళకు ఇదంతా-"మూఢ నమ్మకం, చాదస్తం, సింగినాదం - జీలకర్ర".... గా కనిపిస్తాయి. కాని, ప్రతి 'చాదస్తానికీ' ఏదో ఒక మూలకథ ఉంటుందనే నా నమ్మకం! ప్రతి ఆచారానికీ కాకపోయినా, కొన్నిటికైనా విజ్ఞానశాస్త్రం జవాబు చెపుతుందని నా విశ్వాసం. ఆ చాదస్తానికికానీ, ఆ ఆచారానికానీ-కారణభూతమైన మూలకథ వర్తమానంలో మనకు వర్తించేదీ కావచ్చును, కాకనూ పోవచ్చును. ఒక్కొక్క ఆచారానికీ గల మూల కథను వైజ్ఞానిక దృష్టితో పరామ

అందుకు పాపపరిహారంగా బొమ్మ చిటుక్కున ఒక చిట్కా చేస్తుంది. తను చేస్తున్న పని ఆపి, లేచివెళ్ళి-ఇన్ని నీళ్ళు చేత్తో పట్టుకువచ్చి నా నెత్తిన చిలకరిస్తుంది.

"ఏమిటమ్మా ఇదీ!"....అంటే-

"అయ్యో! గడప గణ్ణం కాదుటే!" .... అంటుంది! ఏమిటో ఆ గడపగణ్ణం! బొమ్మను సృష్టించిన బ్రహ్మదేవుడికి తెలుసేమో మరి!

ఎప్పుడైనా దొడ్లో రోటిమీద కూర్చుని తుమ్మినా అంతే! ఇంట్లోకి వెళ్ళి రెండు బియ్యపు గింజలు తెచ్చి నా నెత్తిన జల్లుతుంది. దానితో ఆ తుమ్ముకు పరిహారం అయి నట్లు తేలిగ్గా ఊపిరి తీసుకుంటుంది.

ఇహ తుమ్మడానికి బొత్తిగా అసందర్భమైన సమ యాలు ఆవిడ దృష్టిలో వేరే ఉన్నాయి. ఎవరైనా ఎక్కడి కైనా ప్రయాణమై ఇంట్లోనుంచి బయటకు బయలు దేరే వేళకు ఆపుకోలేని తుమ్ము వస్తే, వాళ్ళ ప్రయాణం ఎంత ముఖ్యమైనదైనా సరే-వాయిదా వేయిస్తుంది. వాళ్ళు లోపలకు వచ్చి, కాళ్లూ చేతులూ కడుక్కుని పుక్కిలించి ఊసి, పసి పిల్లని మాయం చేసినట్లు ఆ తుమ్ముదుష్ఫలితాన్ని 'షూ మంకాళీ!' అంటూ మాయం చేసి అప్పుడు అడుగు బయటకు పెట్టవలసిందే!

ఏదైనా శుభకార్యం జరుగుతూ ఉన్న సందర్భాల్లో కూడా బొత్తిగా సమయ సందర్భాలెరగని తుమ్ము వస్తుం

టుంది నాకు. ఆపుకుందామని చేసిన ప్రయత్నం విఫలం అయి, ముఖం ఇంత లావున కందిపోయి, వికారంగా అయినా కూడా-ఎట్లాగూ అది బయటకు వచ్చి తీరుతుంది!

ఆ సమయాల్లో మాత్రం ఏమి చేయటానికీ వీలు కాక, బామ్మ నా వంక కొరకొరా చూస్తుంది।

నాకు నెలకొక సారయినా, వంతుగా వచ్చి పోతూ ఉంటుంది జలుబుభారం. వస్తూ వస్తూ, తుమ్ముల్ని కూడా వెంటేసుకు వస్తుంది. అందుకే, ఈ తుమ్ముల విషయంలో బామ్మకు తరచుగా నా పైన బోలెడు కోపం, అసంతృప్తి కలుగుతూ ఉంటుంది।

సైన్సు ఈ తుమ్ముల్ని గురించి చెప్పేకథ వేరుగా ఉంటుందని నాకు తెలిసినా, బామ్మ ఎదుట పడి నా సిద్ధాంతాన్ని చెప్పగలిగే సాహసం లేదు నాకు.

చిన్నప్పుడు ఆడుకొంటూ, గెంతుతూ-కాళ్ళారజాపుకుని లోకాభిరామాయణంలో మునిగిపోయిన పెద్దవాళ్ళ కాళ్ళ మీదుగా దాటిపోయేవాళ్ళం. బామ్మ అది చూచి భగ్గుమనేది. "అలా కాళ్ళు దాటకూడదర్రా!" .... అంటూ చెయ్యిపట్టుకువచ్చి, మళ్ళీ ఆ కాళ్ళ మీదుగా దాటించేది. అదేమిటో అప్పుడు తెలియక పోయినా, మొన్నీమధ్య అందులో విశేషం ఏమిటని అడిగితే బామ్మ ఇలా చెప్పింది.

కాళ్ళు దాటించుకున్న వాళ్ళ అయిదోతనం పోయి, దాటిన వాళ్ళకు అది సంప్రాప్తిస్తుందట! ఏనాటిదో ఈ నమ్మకం!

తల అంటుకోవటానికి నాకెప్పుడూ సమయందొరకదు. జలుబు లేని సమయ మెప్పుడో చూచుకుని, తలంటుకుందా మని మాడున ఆముదం పెట్టుకున్నానా, బామ్మ చూచిం దంటే, చేతిలో పని మానేసి, కొంపలంటుకు పోయినట్లు పరు గెత్తుకు వస్తుంది. చేతినిండా ఆముదం వంపుకుని మాడుకు పట్టించి మర్దన చేస్తుంది.

"ఎన్నిసార్లు చెప్పానే పిల్లా నీకు-ఎవరికి వారే నెత్తిన నూనె పెట్టుకో కూడదని!".... అంటూ మందలిస్తుంది.

ఆముదం నెత్తిన పెట్టేముందు వేలితో ఒక్క చుక్క నూనె తీసి నేల రాస్తుంది. అది నేల తల్లికి నైవేద్యం కాబోలు!

శకునం చూచుకుని, మంచిరోజు చూచుకుని మరీ బయలు దేరటం మనకు ఇప్పటికీ ఆనవాయితీలో ఉన్న ఆచారమే! ఒంటి బ్రాహ్మణుడూ, పిల్లి, వితంతువు, కొత్త కుండలు-ఇవన్నీ ఎదురు రాకూడదని నిషేధపు శాస్త్రీలు. వాటి ఖర్మకాలి, అవి ఎదురు వస్తే ఆ ప్రయాణం మరీ అంత అర్జంటు కాకపోతే అంతటితో ఆపుకోవటమో-మరీ తప్పని సరి అయితే, లోపలకు వచ్చి కాళ్ళూ చేతులూ కడుగుకుని-కొంత సేపు ఆగి-ప్రయాణం చేయటమో చేస్తారు శకునాలపై నమ్మక మున్నవాళ్ళు.

ముత్తయిదువలో, పసిపిల్ల తల్లో, మజ్జిగ కుండతో గొల్లెతో ఎదురువస్తే, ఆ వెళ్ళిన కార్యం ఘంటా పథంగా సానుకూల పడుతుందని మనవాళ్ళ ఊహ.

ఇది పట్టెడూహో గట్టిగాథో-ఎవరికి వారే అనుభవం ద్వారా తెలుసుకో వలసిన విషయం. జిజ్ఞాసువులైన వారు పరిశోధనకు పెట్టుకోవలసిన విషయం.

శకున శాస్త్రం అని ఒక శాస్త్ర విజ్ఞానం మనకు ఉన్నది. బల్లి శకునం ఇప్పటికీ చాలా మంది నమ్మే విషయం. మన పురాణాలలో శుభశకునాలు, అశుభ శకునాలు-ఎన్నో సందర్భాలలో పురాణ పాత్రలకు సూచనగా తోచడం, తదను సారంగా శుభా శుభాలు జరగడం ఎన్నోచోట్ల ఉదహరింప బడింది.

శకునం వంటిదే స్వప్న ఫలితాలు కూడాను. మనకు స్వప్న శాస్త్రం ఉన్నది. ఒక్కొక్క రకమైన స్వప్నం ఒక్కొక్క రకమైన ఫలితాన్ని కలిగిస్తుందని నమ్ముతారు. తెల్లవారుఝామున వచ్చే కల వెంటనే సార్థక మవుతుందని అంటారు. కాని మొదటి జామున వచ్చిన కల సంవత్సరానికి ఫలిస్తుందట! రెండవ జామున వచ్చినది ఎనిమిది నెలలకు, మూడవ జామున వస్తే మూడు నెలలకు ఫలిస్తుందని స్మృతు లలో స్వప్నాధ్యాయమున కొన్ని స్వప్న ఫలితాలు వ్రాయ బడి ఉన్నవి. పగటి కలలు మాత్రం ఫలితం లేనివి కనుక త్యాజ్యములట !

"ఆరోహణం గో వృష కుంజరాణాం ప్రాసాద శైలాగ్ర వనస్పతీనాం విష్ఠాను లేపో రుదితం మృతంచ స్వప్నేష్వ గమ్యా గమనం చ ధన్యం"— కలలో ఎద్దులను, ఏనుగులను, మేడలను, కొండ శిఖరాలను చూచుట, కాచు,

పూచు చెట్లను ఎక్కుట, ఏడ్చుట, చచ్చుట - ఇవన్నీ శుభ ప్రదాలట !

"ఉరగో వృశ్చికో వాపి జలూకా దృశ్యతే యది అవ్యయం చార్థ సిద్ధించ పుత్ర తస్య వినిర్దిశేత్ !"

నిజ జీవితంలో మనం భయం తో ఎదుర్కోలేని కష్టం-పాము చేతనో, తేలు చేతనో, జలగ చేతనో, ఎలాగైనా కలలో ఒక్కసారి కళ్ళు మూసుకుని కరిపించుకుంటే - విశేష ధన ప్రాప్తి, పుత్ర ప్రాప్తి-కూడా కలుగుతుందని స్మృతి పురాణం.

ఇలా చెప్పుకుంటూ పోతే మనవాళ్ళకు అనాదిగా ఏర్పడిపోయిన నమ్మకాలూ, తద్వారా అలవాటు పడిన ఆచారాలూ ఎన్నెన్నో !

ప్రయాణం వస్తే - శకునాలూ వగైరా చూచుకో వటమే కాదు-అతడు బయలుదేరి వెళ్ళేటప్పుడు "ఎక్కడకు"! .... అంటూ కట్టుకున్న పెళ్ళామైనా అడగ కూడదు! అడిగితే-ఆ పని అంతటితో ఆఖరయినట్లే !

ఆ ప్రయాణానికి బొత్తిగా పనికిరాని తిథులు అష్టమి నవములు ! ఇవి ఏ శుభ కార్యానికీ పనికిరాని శనిగ్రహాపు తిథులు !

మరి త్రేతాయుగంలో శ్రీరామ చంద్రుడికీ, ద్వాపర యుగంలో శ్రీ కృష్ణమూర్తికీ-భగవదవతారాలు కదా-భూలోకంలో జన్మించటానికి ఈ రెండు తిథులే ఎందుకు కావలసి వచ్చినాయో ! ఏదో విశేషం లేకపోతే, ఆ పుణ్యా మూర్తులు తమ అవతరణానికి ఆ రెండు దినాలూ ఎన్నుకుని ఉండరని నా నమ్మకం ! అష్టమి తిథి అయినా కృష్ణాష్టమీ,

నవమి తిథి అయినా శ్రీరామ నవమీ-దినం ఇంత పుణ్య దినాలుగా పరిగణించి వేడుక జరుపుకుంటున్నాం!

ఆ మాట నేనన్నానంటే, బామ్మతో మరో వివాదానికి నాందీ ప్రస్థావన చేసుకున్నానన్న మాటే!

మళ్ళా ప్రయాణాల సంగతి ఎత్తుకుంటే మరింకెన్నో ఆంక్షలు? ఆదివారం పడమటి ప్రయాణం చేయకూడదని కూడా అంటూ ఉంటుంది బామ్మ!

"రైళ్ళూ, బస్సులూ, విమానాలూ ఏ వైపుగా ప్రయాణం చేస్తున్నాయో అంచనాలు కట్టి ప్రయాణం కుదుర్చుకోవటం ఎవరికి సాధ్యం!".... అని నేను కొంటెతనానికి అంటే-

"అంత తూర్పూ పడమరా తెలియకుండా పోతుందా ఏమిటే నీకు!".... అంటూ గదమాయిస్తుంది.

అలాగే-తీరిక దొరికే రోజు కనుక ఆదివారం పూట తల అంటుకునే సన్నాహం చేశానా-బామ్మ చివాట్లుతప్పవు!

"ఆడపిల్లలు ఆదివారం పూట తలంటుకుంటే ఆవగింజంత అయిదవతనం తగ్గుతుంది!".... అంటూ గదుముకుంటుంది.

"మరి మగవాళ్ళు అంటుకుంటేనో!".... అని నేను అడిగితే-"ఆయుర్దాయం తరుగుతుంది!" .... అంటూ తడుముకోకుండా సమాధానం చెపుతుంది.

హాతోస్మి! ఆదివారం తెచ్చిపెట్టేపాట్లు ఇన్నీ అన్నీ కావు అయితే!

బామ్మకు ఇంచుమించు ప్రతి రోజూ ఏదో ఒక పని చేయటానికి నిషేధమైనదిగానే ఉంటుంది.

మంగళవారం వస్తే పాతగుడ్డలు చిరిగినవి కుట్టుకో కూడదంటుంది! ఇంకా మంగళవారం పొయ్యిమీద మంగలం పెట్టి వేయించకూడదు!— ఈ రోజుల్లో మంగలాలు పొయ్యి మీద పెట్టి అసలు ఏవారంలోనూ ఎవరూ వేయిస్తున్నట్లు కనపడదు!

మంగళ బుధ వారాలు ఎట్టి పరిస్థితిలోనూ మంచం బిగించకూడదు!

శుక్రవారం పసుపు కొట్టుకోకూడదు!

ఇలా చెప్పుకుంటూ పోతే బామ్మ ఏదో ఒక పనికి ఏదో ఒక రకంగా పెట్టే ఆంక్షలకు లెక్క ఉండదు!

మంగళవారమో, శుక్రవారమో, అష్టమిపూటో గాజులసెట్టి వచ్చాడని మోజుగా గాజులు తొడిగించుకోబోతే వల్లమాలిన కోపంతో ససేమిరా వల్లకాదంటుంది!

బస్తీలో గాజుల షాపుల్లో దూరి అన్ని వస్తువుల్లాగా గాజులు కూడా కొని తెచ్చుకునే ఈనాటి ఇల్లాళ్ళకు బహుశా ఈ ఆంక్ష తెలిసి ఉండకపోవచ్చు! తెలిసి, నిజంగా ఈ నమ్మకం వాళ్ళ మనసులో నాటితే - గాజుల షాపులవాళ్ళ వ్యాపారం ఏంకాను!

అష్టమీ, అమావాస్యా వస్తే - కొత్త మడత విప్పి కొత్త బట్టలు కట్టుకోనివ్వదు బామ్మ!

ఇహ పెళ్ళి, పేరంటాళ్ళ వంటి శుభ సమయాల్లోనూ, ఆడపిల్ల చూలింత, బాలింతగా ఉన్నప్పుడూ-బామ్మ విధించే నియమాలూ, చెప్పే మంచి చెడులూ-ఎన్నెన్నో!

ఇలా ప్రతిదానికీ-"కాదూ, కూడదూ, వల్లకాదు!" అంటూ అడ్డంవచ్చే బామ్మని చూస్తే ఒక్కొక్కసారి చిరాకుగానే ఉంటుంది.

కానీ ఏం చేస్తుంది పాపం ఆవిడ! ఈ అంక్షలన్నిటికీ కర్తృత్వభారం ఆవిడది కాదు పాపం! ఏనాడో మనవాళ్ళు ఏదో కారణంగా, తమకు తామే విధించుకున్న కట్టుబాటులివి. కొన్నిటికి శాస్త్ర సమ్మతమైన వైజ్ఞానిక కారణాలు మూలం కావచ్చును. కొన్నిటికి ఏ ఆధారమూ ఉండక పోవచ్చును. వాటిని తు. చ. తప్పకుండా అనుసరించటం మాత్రమే అనూచానంగా వస్తూ ఉన్న సంప్రదాయం.

ఆ నాటి నమ్మకాలూ, పెద్దవాళ్ళు చెప్పే ఆచారాలూ-ఒక్కొక్కసారి చిత్రంగా కనిపిస్తాయి. ఈతరంవాళ్ళకు ఇదంతా-"మూఢ నమ్మకం, చాదస్తం, సింగినాదం - జీలకర్ర".... గా కనిపిస్తాయి. కాని, ప్రతి 'చాదస్తానికీ' ఏదో ఒక మూలకథ ఉంటుందనే నా నమ్మకం! ప్రతి ఆచారానికీ కాకపోయినా, కొన్నిటికైనా విజ్ఞానశాస్త్రం జవాబు చెపుతుందని నా విశ్వాసం, ఆ చాదస్తానికికానీ, ఆ ఆచారానికానీ-కారణభూతమైన మూలకథ వర్తమానంలో మనకు వర్తించేదీ కావచ్చును, కాకనూ పోవచ్చును. ఒక్కొక్క ఆచారానికీ గల మూల కథను వైజ్ఞానిక దృష్టితో పరామ

ఇందులో పేర్కొన్నది కొన్ని నౌకా జాతుల పేర్లు. ఆ సెట్టి ఇంకా ఏయే దేశాలనుంచి ఏయే వస్తు సంచారములను తెప్పించి వర్తకం చేసేవాడో ఈ క్రింది పద్యం తెలుపుతుంది.

"పంజార కర్పూర పాదపంబులు తెచ్చి
జలనోంగి బంగారు మొలక తెచ్చి
సింహళంబున గంధ సింధురంబులు తెచ్చి
హురుముంజి బలు తేజి హరులు తెచ్చి
గోప సంశుద్ధ సంకుమద ద్రవము దెచ్చి
యాంప కట్టాణి ముత్యాలు తెచ్చి
భోట కస్తూరికా పుట కోశములు దెచ్చి
చీని చీనాంబర శ్రేణి తెచ్చి
జగద గోపాల రాయ వేశ్యాభుజంగ
పల్లవాదిత్య భూదాన పరశురామ
కొమరగిరి రాజ దేవేంద్రు కూర్మి హితుడు
జాణ జగజెట్టి దేవయ చామి సెట్టి!"

ఆ ...టి నుండి ఈ నాటికీ ఆంధ్రులు విదేశాలకు విరివిగా వలసలు వెళుతూనే ఉన్నారు. విద్యాభ్యాసం కోసం, ఉద్యోగాల కోసం, ధనసముపార్జన కోసం-ఇతర దేశాలకు వెళ్ళి స్థిరపడినా, తెలుగువారు తమ జాతీయతను, సంస్కృతిని మరిచిపోకుండా ఉండటం గర్వించదగిన విషయం.

అలాగే, ఇతరదేశాల నుండి వచ్చి-మన ఆంధ్ర దేశంలో ఎంతోమంది విద్యాభ్యాసం చేసేవారని చరిత్ర చెపు

తున్నది. ధాన్యకటకం, నాగార్జున కొండలలోని బౌద్ధుల విశ్వవిద్యాలయాలలో సింహళం, బర్మా, చైనా, టిబెట్టు దేశాలనుండి విదేశీయులు వచ్చి విద్యార్జన చేసేవారట! ఇది తెలుగు వారికి గర్వకారణం. ఇలా అన్ని దేశాలతోనూ- అనాదిగా సంబంధ బాంధవ్యాలు కలిగి, అన్ని జాతుల సంస్కృతిని తరచి చూచినజాతి తెలుగుజాతి.

తెలుగు మహిళ: రచయిత్రులుగా, రాజకీయ దురంధరులుగా, నర్తకీ మణులుగా, ఆధ్యాత్మిక వేత్తలుగా ప్రసిద్ధి పొందినవారు తెలుగు మహిళలు. ఏ దేశంలో ఉన్నా, ఎంత నవనాగరిక సమాజంలో మెసులుతున్నా-తమ జాతి సంస్కృతినీ, సంప్రదాయాన్నీ మరువకుండా కాపాడుకు వస్తున్నది స్త్రీలే! పండుగ పబ్బాలు సమయంలోను, వివాహాది వేడుకలలోను, సౌభాగ్యం కోసం చేసే నోములు, వ్రతాలు, పూజలు ద్వారాను-సంప్రదాయాన్ని కొంతలో కొంత వారే పాటిస్తున్నారు. ఆధునిక కాలంలో పాటించిన ధర్మాలు చాలవరకు రూపు మాసిపోయినా- తెలుగు స్త్రీ- తన కట్టు, బొట్టు, ఆచారాలు విషయంలో-మతవిశ్వాసంలో ఇంకా మారిపోలేదు.

చారిత్రిక యుగంలోకి పోయి చూస్తే-మహిళలు మన దేశంలో స్వతంత్రించి ఎన్నో ప్రజాహిత కార్య క్రమాలు తలపెట్టినట్లు తెలుస్తుంది. బౌద్ధమతం స్వీకరించి మహాచైత్యాలు నిర్మించారు. చాళుక్య మహారాణి అయిన మహాదేవి విజయవాడవద్ద జైన దేవాలయాన్ని నిర్మించింది.

పల్నాటి యుద్ధకాలంలో నాయకురాలిగా ప్రసిద్ధికెక్కిన నాగమ్మ చూపిన రాజకీయ చతురిమ సాటిలేనిది. ఎన్నోవేళ్ళ ఎడబాటు తరువాత-తనయందు అనురక్తుడై వచ్చిన బాల చంద్రుని ప్రేరేపించి యుద్ధరంగానికి పంపిన మాంచాల; యుద్ధభూమిలో డస్సిపోయి వెను దిరిగి వచ్చిన ఖడ్గ తిక్కనకు పసుపు ముద్దలు పెట్టి, రోషం తెప్పించి తిరిగి యుద్ధ రంగానికి పంపిన చానమ్మ-వీరంతా తెలుగు మహిళలే! అద్వితీయ పరాక్రమంతో రాజ్యాన్ని పరిపాలించి వాసికెక్కిన రాణీ రుద్రమదేవి తెలుగునారి. ఆ నాటికీ ఈ నాటికీ-మగవాడి వెనుక నిలబడి అతడికి స్ఫూర్తినీ, ప్రోత్సాహాన్నీ అందించేది స్త్రీయే! వంటయింట్లో ఉన్నా, గడపదాటి బయటకు వచ్చినా-తెలుగుస్త్రీ చైతన్యానికి ప్రతీక.

మధ్య యుగాలలో-ముస్లిం దోపిడీలలో-ఆంధ్రదేశం అల్లకల్లోలమై - సతీ సహగమనం లాంటి దురాచారాలు పుట్టుకు వచ్చాయి. రాజారామ్‌మోహనరాయ్ వంటి మహా పురుషుల పట్టుదల మూలంగా-ఆచారం పేరిట స్త్రీలకు జరిగే దురన్యాయం తగ్గిపోయింది.

బాల్య వివాహాలు కూడా-వీరేశలింగం పంతులు గారి వంటి మహాత్ముల అకుంఠిత దీక్షతో-చాలావరకు రూపుమాసి పోయినట్లే! కాని. తెలంగాణాలో కొన్ని మారుమూల ప్రాంతాల్లో ఇప్పటికీ అతి బాల్య వివాహాలు జరుగుతున్నట్లే తెలుస్తున్నది. కన్యాశుల్కం స్థానంలో-ఇప్పుడు వరకట్నం ప్రాబల్యంలోకి వచ్చి-ఆడపిల్లల పెళ్ళిళ్ళు సమస్యగా తయా రవుతున్నవి.

స్వాతంత్ర్యంతో గడపదాటి బయటకువచ్చిన స్త్రీకి ఇప్పటికీ బయటి ప్రపంచంలో రక్షణ లేదు. ఆమెకు ఆర్థిక సమానత్వం లేదు. తండ్రి చాటు తనయగానో, భర్త చాటు భార్యగానో, కొడుకుచాటు తల్లిగానో ఆమెకు సంఘంలో లభించే స్థానం. ఇది మను ధర్మ శాస్త్రం స్త్రీకి విధించిన న్యాయం.

ఈ విధంగా-మగవాడి మాటున రక్షణ, భద్రత-పొందుతూ మనుగడ సాగించే స్త్రీ-ఆ కాలం నుంచీ అబలగానే పరిగణింప బడుతూఉంది. ఈ కాలంలో చాలామంది తెలుగు పిల్లలు చదువుకొని ఉద్యోగాలు చేస్తున్నారు. సంపాదిస్తున్నారు. సంఘంలో ఒక స్థాయిని అందుకొని వ్యక్తిత్వాన్ని పెంపొందించుకో గలుగుతున్నారు. అయినా, ఇటు ఇంట్లోను, అటు బయటా-ఎక్కువగా పాటు పడవలసి వస్తుంది ఆమె. తెలుగు గడ్డపైన పుట్టిన మగవాడికి అభిజాత్యం ఎక్కువ. ఇంటి పనులు చేయడంలో, భార్యకు సహాయపడటంలో-తప్పు లేదనీ, మారుతున్న సమాజంలో అది ఎంతో అవసరమనీ మన మగవాళ్ళు తెలుసుకోవాలి. ఈ విషయంలో పాశ్చాత్యుల నుంచి మనం నేర్చుకోవలసింది చాలా ఉంది.

<u>ఆచార వ్యవహారాలు - భోజనం :</u> తెలుగుజిహ్వకు రుచులు ఎక్కువ. ఆంధ్రుడికి ఆవకాయకు - అవినాభావ సంబంధం ఉన్నదనే సంగతి అందరికీ తెలిసిందే! ఆవకాయను గురించీ గోంగూర చవిని గురించీ మనవాళ్ళు ఎన్నోపాటలూ

పద్యాలూ అల్లుకున్నారు. ఆవకాయ ఆవిర్భావం ఎలా అయిందో జానపదుల నోట ముచ్చటగా చెప్పుకొన్నపదం-

"మామిడీ మామిడి మంచి మామిడి
కొమ్మల్లు వంచేరు కోసేరు నిన్నూ
మేదరా కత్తీన నరికేరు నిన్నూ
ఉప్పు కారం తోటి ఉంచేరు నిన్నూ
ఆవా కారంతోటి అద్దేరు నిన్నూ!"

అదే విధంగా గోంగూర రుచిని లొట్టలు వేసుకుంటూ చెప్పిన గువ్వల చెన్న శతకం లోని పద్యం-

" వెల్లుల్లి బెట్టి పొగిచిన
పుల్లగోంగూర రుచిని బొగడగ వశమా
మొల్లముగ నూని వేసుక
కొల్లగ భుజియింప వలయు గువ్వల చెన్నా!"

గోంగూర పచ్చడి ముద్ద-అంటే అతడికి ఎంత పక్షపాతమో! ఊరగాయలు, పులుసు కూరలు, ముద్దపప్పు, పులిహోర, గారెలు, బూరెలు, అరిసెలు-వంటివి అచ్చ తెలుగు వంటలు.

తెలుగు వాడికి షడ్రుచులు కావాలి. మనవంట కాలలో సాధారణంగా పోషక పదార్థాల కన్నా, రుచులకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది.

ఇతర ప్రాంతాలవారి వంటలు - పిండివంటలు-అప్పు డప్పుడు చేసుకు తినటం ఈ నాటి తెలుగు వారు అలవాటు చేసుకున్నా-అన్నం, పప్పు, కూరలు, పచ్చడి, పులుసు, నెయ్యి

పెరుగు-ఉంటే చాలు-ఆంధ్రుడికి ఏ దేశమేగినా, ఎందు కాలిడినా-జిహ్వా లేచి వస్తుంది.

వేషధారణ: తెలుగు వారికి కట్టు, బొట్టు, మాట, ఆచార వ్యవహారాలు, జీవన విధానం-అన్నిటా తమదైన ప్రత్యేక సంప్రదాయం ఉన్నది. వాటిని మనవాళ్ళు తరాలుగా కాపాడుకుంటూ వస్తూనూ ఉన్నారు. తెలుగు వారి చీరకట్టు దేశవిదేశాలలో ప్రసిద్ధి పొందింది.

"పట్టంచు చీరతో పణతి రావమ్మా
సేలంచు చీరతో చెలియ రావమ్మా
నీలంచు చీరతో నెలత రావమ్మా
కరకంచు చీరతో కలికి రావమ్మా
మల్లెపువ్వుల చీరతో మగువ రావమ్మా
ఉల్లి మళ్ళ చీర ఉవిద రావమ్మా
గోరంచు చీరతో కొమ్మ రావమ్మా!"

అంటూ, చీరల అందాలూ అంచులూ ఏకరువు పెడుతూ జానపదులు వర్ణించుకొన్న తెలుగుతనం రూపు కట్టిన బొమ్మ చీరకట్టిన తెలుగు కొమ్మ!

చీర, రవిక, బొట్టు, కాటుక, గాజులు, మంగళసూత్రం నల్లపూసలు-ఇలా అలంకరణ చేసుకుంటే తెలుగు ఆడపడుచు రూపం కన్నుల ముందు మెదలుతుంది. ధోవతి, ఉత్తరీయం తలపాగా-పల్లెపట్టుల ఇప్పటికీ తెలుగు రైతు ధరించే వేషం, కాలక్రమాన్ని అనుసరించి నాగరీకుల వేషధారణలో పాశ్చాత్య

ప్రభావం కానవస్తున్నా, పల్లెపట్టుల్లో మన కట్టు, బొట్టు ఇంకా మారలేదు. అమెరికాకు వెళ్ళినా, ఆఫ్రికాకు వెళ్ళినా, అడపాదడపా పాశ్చాత్య వేషం ధరించినా—తెలుగువారి చీర కట్టును, తెలుగు తనాన్ని మరిచి పోలేము.

తెలుగు ఆడపడుచులకు నగలపైన మోజు ఈ నాటిది కాదు. అలంకార ప్రియులైన మన స్త్రీలు వెనుకటి రోజులలో ధరించిన నగలు రకరకాల పేర్లతో ఆపాద మస్తకము ఉండేవి.

“ మట్టియ లుబ్బాల మణి నూపురంబులు
మొలనూలు వస్త్రముల్ ముత్తియములు
కన్నవడంబులు గట్టి నూళ్ళను సుద్ద
సరి తీగె మినుకులు సందిదండ
అంగుళీయములు హారకంకణములు
చేకట్టు పాలెలు చెన్ను మెరుగు
టాకులు సరిపెణలాల కత్తకము పూత
కాటుక తిలకంబు కమ్మపువ్వు
లాదిగా గల మేలి ద్రవ్యముల నొప్ప ”

ఆ నాటి స్త్రీలు చేసుకునే అలంకరణలు కొన్ని ఈ పద్యంలో ఉదహరింపబడినవి. వాటికి మారుగా—నేటి స్త్రీలు అధునాతనమైన, నాజూకైన నగలు ధరిస్తున్నారు. నగల పైన తెలుగు వారికి ఇంత మోజు కనుకనే, అమెరికాకు వెళ్ళినా, అమ్మగారు పెళ్ళిలో పెట్టిన ఆభరణాలు అమ్మాయి అతి భద్రంగా తీసుకు వెళుతుంది. నలుగురు ఆడవాళ్ళు ఒక

చోట చేరితే-"ఈ చీర ఎంతకు కొన్నారు?"-"ఈ నగ ఎక్కడ చేయించారు?" అని ఒకరినొకరు పలకరించుకోవటం చాలా మామూలు సంగతి.

పెళ్ళిళ్ళు: జాతి సంస్కృతిని ప్రతిబింబింప చేసేవి మన ఆచార వ్యవహారాలు. పెళ్ళి, పేరంటాళ్ళు, పండుగ పబ్బాలు-వంటి సమయాలలో మన వేడుకలు, ఆచారాలు-ప్రస్ఫుటంగా కానవస్తవి.

పెళ్ళంటే-నూరేళ్ళ పంట-అని నానుడి. కులం, రూపం విద్య, గుణం, ధనం, అన్నింటిలోను మిన్నగా ఉండే సంబంధం పెద్దలే విచారించి నిర్ణయించి వివాహం చేసే పద్ధతి ఇప్పటికీ ఆచరణలో ఉన్నది. పిల్లలే స్వతంత్రించి తమ జీవిత భాగస్వామిని ఎన్నుకుని వివాహం చేసుకోవటం-చదువు కొన్న ధనిక వర్గాలలోను, నగర వాసులలోను, అక్కడక్కడా జరుగుతున్నది.

వరకట్నం నానాటికీ ఆడపిల్లల తండ్రులకు విషమ సమస్యగా తయారవుతున్నది. పెళ్ళిళ్ళలో జరుపవలసిన లాంఛనాలు పెట్టుబడులు కూడా వధువు తలిదండ్రులకు భారమై పోయినవి. మేనరికాలు వంటి దగ్గరి సంబంధాలు మంచివి కావని శాస్త్రరీత్యా నిరూపించ బడినా-అనాదిగా ఆచారంగా వస్తున్న రక్తసంబంధీకుల మధ్య వివాహాలు ఇంకా తెలుగునాట అక్కడక్కడా జరుపుతూనే ఉన్నారు.

పెళ్ళిళ్ళు శాస్త్రోక్తంగా, మంత్రయుక్తంగా, సర్వలాంఛనాలతో జరుపుకుంటారు. వెనుకటి అయిదురోజుల

పెళ్ళిళ్ళకు బదులు-ఇప్పుడు ఒక్క పూటతోనే పెళ్ళితంతు ముగుస్తున్నా, తత్సంబంధమైన వేడుకలు, ముచ్చట్లు-ఇంకా కొన్ని మనవాళ్ళు జరుపుకుంటూనే ఉన్నారు.

బుగ్గను చుక్క, నుదుట కళ్యాణ తిలకం, వధూవరుల చేత జీలకర్రబెల్లం ముహూర్త సమయానికి నడినెత్తిన పెట్టించటం, మంగళసూత్రధారణ, తలంబ్రాలు, సప్తపది, నల్లపూసలు కట్టించడం, మట్టెలు తొడగడం, అరుంధతి దర్శనం చేయించడం-వంటి తతంగాలు పురోహితుల మంత్రోచ్చారణతో పాటు జరుపుతారు. అప్పగింతలు, మంగళహారతులు తలుపు దగ్గర పేర్లు చెప్పించటం-ఇవన్నీ పూర్తిగా ఆడవాళ్ళు చేసుకునే వేడుకలు. ఆయా సందర్భాలకు తగినట్లు-ఎన్నో పాటలు పాడి, విసుర్లు విసిరి, హాస్య ప్రసంగాలు చేసి - మన వివాహ సమయాల్లో స్త్రీలు ఎక్కువ ఉత్సాహంతో పాల్గొంటారు.

<u>పండుగలు:</u> తెలుగువారు అతి వేడుకతో జరుపుకునే పండుగలు ఉగాది, వినాయకచవితి, దసరా, దీపావళి, సంక్రాంతి.

పచ్చడుల సౌరుతో, మామిడాకులు కట్టిన ముంగిళ్ళ మంగళ రూపంతో, పంచాంగ శ్రవణంతో, క్రొత్త సంవత్సరపు కొసరు కోరికలతో-ఇట్టింటా ఉగాది పండుగ జరుపుకుంటారు. విఘ్ననాయకుడైన వినాయకుడికి ఉండ్రాళ్ళు పెట్టి, భక్తి శ్రద్ధలతో పూజచేసి, 'అవిఘ్నమస్తు' అని

ప్రార్థించుకుంటారు. దసరా-దేవీ నవరాత్రులుగా జరుపుకునే పండుగ. శక్తి స్వరూపిణి అయిన అమ్మవారిని ఒక్కొక్క దేవి మూర్తిగా భావించి అలంకరించి పూజచేస్తారు. దసరాకు మన ప్రాంతాల బొమ్మలకొలువులు పెడతారు. తెలంగాణాలో బతుకమ్మలు ఆడుతారు. తమస్సును పటాపంచలు చేసే దివ్వెల పండుగ దీపావళి. ముగ్గులతో, గొబ్బిపాటలతో, క్రొత్త అల్లుళ్ళరాకతో, కోడిపందాలు, సాతాని జియ్యరులు, గంగిరెద్దుల ఆటలతో-కళకళ లాడుతూ వస్తుంది-సంక్రాంతి పండుగ. ఆంధ్రప్రదేశ మంతా సుసంపన్నంగా సస్యశ్యామలంగా ఉండి, కర్షకుల శ్రమ ఫలితం ఇంటికి చేరి, వారికి ఆనందం కలిగించేది సంక్రాంతి పండుగ వేళనే!

సంక్రాంతి వేళ ఉండే చలిని, వాతావరణాన్ని శ్రీనాథమహాకవి ఎంత చక్కగా వర్ణించాడో చూడండి.

"ఇండ్ల మొదలను నీరెండ నీడికలను
అనుగు దమ్ముడు నన్నయు నాటలాడు
అత్తయును కోడలును గుమ్మలాడు కుమ్మ
గాచు చోటికి మకర సంక్రాంతి వేళ!"

అత్తా-కోడలూ కీచులాడుకోవటం మరే విషయం గురించో కాక కుమ్మ కాచుకోవటం కోసం-అంటే ఎంత మనోహరంగా ఉన్నది!

కాల పరిస్థితులను బట్టి, ఆర్థిక ఇబ్బందులను బట్టి ఈ పండుగలు జరుపుకోవటంలో ఈ తరం వారికి ఆ వెనుకటి శ్రద్ధ, ఉత్సాహం-సన్నగిల్లినా, ఆయా పండుగల ప్రాముఖ్యం తెలుగు జాతి జీవనంలో ముఖ్యభాగంగానే ఉంటూ ఉన్నది.

ఆటపాటలు: మనదేశం ఆట పాటలకు పుట్టినిల్లు. మన పురాణాలలోనూ, చరిత్రలోనూ ఎన్నో రకాల ఆటలు వర్ణింప బడ్డాయి. పాటలు పాడుతూ ఆటలు ఆడుకోవటం చిన్నతనం నుంచీ పిల్లలకు తెలుగు దేశంలో ఉగ్గుతో నేర్పుతారు.

"దాగుడు మూతా దండాకోర్
పిల్లీ వచ్చే ఎలుకా భద్రం"

అంటూ ఆడుకునే దాగుడు మూత ఆటలోనే పిల్లికీ ఎలుకకూ గల వైరం పిల్లలకు తెలియ చెప్పటానికి ఉద్దేశింప బడింది. అట్లాగే 'కాళ్ళాగజ్జీ-కంకాణమ్మా' వంటి చిన్న పిల్లలు ఆడుకునే ఆటలో మందులు, ఔషధాలు-గురించిన విజ్ఞానం నిక్షిప్తమై ఉంది.

"చింతకాయ దప్పళం
పప్పేసి కలపటం
కంతమెల్ల మెక్కటం
కడుపు నొప్పి రావటం"

ఎక్కువగా తినటం వల్ల కలిగే అనర్థం గురించి పిల్లలకు పాటలోనే చెపుతూ-దానికి విరుగుడు కూడా పాట లోనే చెప్పారు!

"కోమటింటి కెళ్ళటం
శొంఠికొమ్ము తేవటం

అప్పుడె సాన తీయటం
అరగ తీసి నాకటం !"

మగవారు కర్రసాము, ముష్టియుద్ధం, మల్లయుద్ధం, బలప్రదర్శనలు, కత్తిసాము-వంటి వ్యాయామ క్రీడలలో ఆరితేరి ఉండేవారు.

రంకురాట్నం ఆనాడే పిల్లలకు వినోద సాధనంగా ఉండేది. ఈ నాడు 'Giant Wheel' అనే పేరుతో చలా మణీ అవుతున్న రంకురాట్నం గురించి పద్యం బసవ పురాణంలో కానవస్తుంది.

"చటిల సంస్కృతి జీవఘట చక్ర కర్మ
పటు పరివర్తన భ్రమణంబు గూర్చి
కీలు వొందించి యాంత్రికయ రాటనముల
వాలి యాడించు నా వడ్రంగి యతడు !"

చింతగింజలు, వామన గుంటలు, అచ్చన గండ్లు, పచ్చీసు, పాచికలు, పులిజూదం వంటివి ఇళ్లలో ఆడుకునే ఆటలు.

కోలాటము, పేరణము, గొండిలి, గిల్లదండ, చెడుగుడు, గోడుంబిళ్ళ, బొంగరాలు వంటి ఆటలు ఆనాడు ఆడుకునే వారు.

పల్నాటి వీరుడైన బాలచంద్రుడు బొంగరాల ఆటే కాక-ఇంకా ఎన్నో ఆటలు ఆడేవాడట !

"గుమ్మడి కాయలు కొంతసేపాడి
చెరుకుల పందెంబు చెల్వొప్ప గెలిచి
పోకలాటల చేత బుచ్చు ముపొద్దు!"

ఈ ఆటల పేర్లు ఇప్పటివారికి తెలియవు.

కరాటే నేర్చుకునే ఈనాటి ఆడపిల్లలకు-వెనుకటి ఆట పాటలు ఏదో చిన్నపిల్ల చేష్టలుగా తోస్తాయనటంలో సందేహము లేదు! ఆనాటి బాలికలు ఆడుకొనే ఆటలు ప్రధానంగా ఇలా ఉండేవని కళాపూర్ణోదయంలో కవి వర్ణిస్తాడు.

"దినముల్ కొన్ని చనంగ నంత కడు న
ర్థిన్ బొమ్మ పెండ్లిండ్లు, గు
జ్జెన గూళ్ళచ్చన గండ్లు, పింపిళులు, కు
చ్చిల్, గీరన గింజ, లో
మన గుంటల్ కనుమూసి గంతనలు, కం
బాలాట లోనైన ఖే
లనముల్ మీరగ బోంట్లతో నలరె బా
లా రత్న మెల్లప్పుడున్।"

ఇంకా ఆనాడు మగపిల్లలు ఆడుకునే ఆటలు ఎట్లా ఉండేవో, వాటి పేర్లేమిటో-ధూర్జటి తన కాళహస్తి మహాత్మ్యంలో ఇలా వర్ణించాడు.

"చిట్లపొట్లకాయ సిరి సింగణావత్తి
గుడుగుడు గుంచాలు కుందెన గుడి
ఢాగిలిముచ్చులాటలు గచ్చకాయలు
వెన్నెల కుప్పలు తన్ను బిళ్ళ

తూరన తుంకాలు గీరన గింజలు
పిల్ల దీపాలంకి బల్లి గోడు
చిడుగుడు లవ్వాల పోటి చెండుగట్టిన బోది
యల్లి యుప్పన బట్టె లప్పళాలు
చిక్కనాబిల్ల లోటిల్లు చిందరాది
మైన శైశవ క్రీడా విహార సరణి .... ”

వీటిలో సగం ఆటలు కూడా ఈనాటి పిల్లలకు అర్థం అయి ఉండవు! కాని, కొన్ని ప్రాచీన క్రీడలు ఈనాడు కొన్ని మార్పులతో, క్రొత్త పేర్లతో వాడుకలోకి వచ్చినవి.

వినోదాలు : జానపద వినోదాలలో ముఖ్యమైనవి-తోలుబొమ్మలాటలు, పగటి వేషాలు, బుట్టబొమ్మలు, విప్రవినోదాలు పులి వేషాలు, దొమ్మరాటలు, ఇంద్రజాలాలు మొదలైనవి. ఆంధ్రుల మొట్టమొదటి కళారూపం కురవంజి వంటి దృశ్యకావ్యం, యక్షగానాలు, వీధినాటకాలు, జంగం కథలు, హరికథలు, గొల్ల భాగవతులు, యానాది భాగవతులు, చెక్క భజన వంటి జానపద కళారీతులు ఎన్నో ఆ కాలంలో ఆంధ్రులకు వినోద సాధనాలుగా ఉండేవి. ఆధునిక యుగంలో సినిమా ప్రభావంతో ఈ ప్రాచీన కళా సంపద చాలవరకు అంతరించిపోయినా-వీటిలో కొన్నిటినయినా పునరుద్ధరించే ప్రయత్నం ఇప్పుడిప్పుడే కొంత జరుగుతున్నది.

నాటకం : సాహిత్య ప్రక్రియ లన్నిటిలోను నాటకం ఉత్తమమైనదని మన పూర్వుల సిద్ధాంతం. కాళిదాసాదులు

సంస్కృతంలో రచించిన ఉత్తమ నాటకాలతో పరిచయం ఉన్నప్పటికీ తెలుగు కవులు ఎందుచేతనో 19 వ శతాబ్ది చివరి వరకు ఈ ప్రక్రియను చేపట్టలేదు. ఆంధ్రులకు యక్షగానాలు, వీధి నాటకాలు-తప్ప ఉత్తమశ్రేణి నాటకాలు నూరేళ్ళక్రితం వరకు లేవు.

చిలకమర్తి లక్ష్మీనరసింహం, వీరేశలింగం, ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసాచార్యులు, తిరుపతి వేంకటకవులు ప్రభృతులు రచించిన పౌరాణిక నాటకాలు విజయవంతంగా ప్రదర్శింపబడటంతో ఆంధ్ర నాటక రంగం సుస్థిరమైంది.

ఆంధ్ర నాటక రంగానికి మణిపూస - అనదగినది గురజాడ అప్పారావు గారి స్వతంత్ర సాంఘిక నాటకం 'కన్యాశుల్కం'. సినిమాల ప్రభావంవల్ల నాటకరంగానికి ఈ నాడు అంతగా ప్రోత్సాహం, జనాదరణ-లభించటం లేదు.

తెలుగు భాష - సాహిత్యం: 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని - 'దేశ భాషలందు తెలుగు లెస్స' అని పేరు పొందినది మన తెలుగు భాష. ఇతర భాషలలోని సాంకేతిక పదాలను తనలో ఇముడ్చుకో గలిగిన శక్తివంతమైన భాష తెలుగు అనీ-జాతీయ భాషగా ఉండదగిన భాష అనీ హాల్డేన్ వంటి విజ్ఞులు వినుతించారు.

తెలుగు సాహిత్యానికి వెయ్యి సంవత్సరాల ఉజ్జ్వలమైన చరిత్ర ఉంది. మన జాతిమనుగడకే ఆలంబనం అనదగిన

కవిత్రయము వారి మహాభారత అనువాదమే-ఇప్పటి వరకు మనకు తెలియవచ్చిన ఆది తెలుగు గ్రంథము. చాళుక్య రాజయిన రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహంతో, నన్నయ్య మహాభారతంలోని మొదటి రెండున్నర పర్వాలను తెనిగించాడు. అప్పటి వరకు గాసట బీసటగా ఉన్న తెలుగును సంస్కరించి, అనువాదమైనా స్వతంత్ర రచన వలె వ్రాసి- తెలుగులో కూడా హృదయంగమమైన కవిత్వాన్ని వ్రాయ వచ్చునని నిరూపించి, ముందు తరాల వారికి మార్గ దర్శకు డైనాడు. తిక్కన, ఎఱ్ఱాప్రగడ, భారత శేషాన్ని అద్వి తీయంగా పూరించి-తెలుగును కావ్య భాషగా తీర్చిదిద్ది- తెలుగు సరస్వతికి అపూర్వాలంకారాలు తీర్చిదిద్దారు.

దేశీయమైన పలుకు బళ్ళతో జాను తెలుగులో రచనలు చేసిన శివకవులు-అందులో ముఖ్యంగా పాల్కురికి సోమనాథుడు తెలుగు జాతికి చిరస్మరణీయులు.

> "ఉరుతర పద్య గద్యోక్తుల కంటె
> సరసమై పరగిన జాను తెనుంగు
> చర్చింపగా సర్వసామాన్య మగుట
> కూర్చెద ద్విపదలు కోర్కి దైవార!"

అంటూ అలతి అలతి పదాలతో అందరికీ సులభంగా అర్థమయ్యే ద్విపద కావ్యం రచించి గణన కెక్కిన కవి పాల్కురికి సోమనాథుడు.

పోతన్నగారి ఆంధ్ర మహాభాగవతం తెలుగు సాహి త్యానికి మాధురీ మహిమను సంతరించి పెట్టింది. ఇక

శ్రీనాథ కవి సార్వభౌముడు ఉభయభాషలలో అసమానమైన కవితా కౌశల్యం సంపాదించి రాజాస్థానాలలో కనకాభిషేకాలను చేయించుకొన్న మహానుభావుడు. రెడ్డిరాజుల కాలంలో బహుశాస్త్ర పారంగతుడు, బహుగ్రంథకర్త, పండితుడు, రసికజనాభిరాముడు-అయిన శ్రీనాథకవి విద్యాధికారిగా ఉండేవాడు. ఆ నాటి కవులకు రాజాస్థానాలలో ఎంతటి ఆదరణ సత్కారం జరిగేదో-శ్రీనాథ కవి సమాశ్వాసన పూర్వకంగా రాజును అడిగిన ఈ పద్యం చెపుతుంది.

"అక్షయ్యం బగు సాంపరాయుని తెలుం
గాధీశ! కస్తూరికా
భిక్షాదానము జేయురా! సుకవి రా
డ్బృందారక శ్రేణికిన్
దాక్షారామ చళుక్య భీమ వర గం
ధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభి కుంభములపై
వాసించు నవ్వాసనల్ !"

రాయలయుగం తెలుగు సాహిత్యానికి స్వర్ణయుగం. సాహితీ సమరాంగణ చక్రవర్తి అయిన శ్రీ కృష్ణదేవరాయలు అల్లసాని పెద్దన రచించిన "మను చరిత్రం బందుకొను వేళ పురమేగి పల్లకి తన కేల బట్టి' - ఎత్తటంలో తెనుగులో ప్రబంధ యుగం ప్రారంభమైంది. కృష్ణరాయలు

సంతరించిన 'ఆముక్తమాల్యద' ప్రౌఢకావ్యం. అందులో అని తర సాధ్యమైన కవితా వ్యుత్పత్తులను అతడు ప్రదర్శించాడు.

వ్యంగ్య శ్లేష ప్రధానమైన రామరాజభూషణుని 'వసు చరిత్ర'లో సంగీతసాహిత్య సమ్మేళనం సమ్మోహనకరంగా జరిగింది. పింగళి సూరన 'కళాపూర్ణోదయం' అనే కల్పనా కథను కావ్యంగా వ్రాసి తెలుగు సాహిత్య పథంలో క్రొత్త పుంతలు తొక్కాడు. ముక్కుతిమ్మన, ధూర్జటి, తెనాలి రామకృష్ణుడు-మొదలైన మహాకవులంతా ఈ యుగానికి చెందిన వారే! 20 వ శతాబ్దంలో తిరుపతి వేంకట కవులు సంప్రదాయ కవిత్వాన్ని సామాన్యునికి అందుబాటు లోకి తెచ్చారు.

గత శతాబ్దిలో, ఆంగ్ల వంగ సంప్రదాయాల ప్రభా వంతో తెలుగువచన వాఙ్మయం బహుధా విస్తరించింది. నవల, నాటకం, కథ, వంటి ప్రక్రియలు పరిణతి చెందినవి. స్వీయ చరిత్రలు, జీవితచరిత్రలు, సాహిత్య విమర్శలు-ఈ నాడు పుంఖాను పుంఖంగా వస్తున్నవి.

గురజాడ, పిడుగు గిడుగుల కృషితో-వ్యావహారిక భాషావాదం బలం పుంజుకుంది. వచనం చలం వంటి వారి చేతులలోపడి పదునైన ఆయుధంగా మారింది.

భావకవిత్వానికి రాయప్రోలు వారు శ్రీకార చుట్టారు. కృష్ణశాస్త్రి, అబ్బూరి, దువ్వూరి రామిరెడ్డి-ప్రభృతుల చేతులలో-తెలుగు కవిత్వం విచిత్రమైన విన్యాసా లతో మధురంమంజులంగా విహారం చేసింది. తెలుగు కవనం

'ఎంకి పాటలలో' నండూరివారి చేతులలో నవయుగ జానపద గేయంగా మారి-తెలుగువారి నాలుకలపై నాట్యమాడింది. శ్రీశ్రీతో తెలుగు సాహిత్య పథంలో 'మరో ప్రపంచం' మొదలైంది.

తెలుగు సాహిత్యం ఎడతెగని ప్రవాహం వంటిది. ఎన్నెన్నో క్రొత్త పోకడలు, ప్రక్రియలు, మలుపులతో రసవద్వాహినిగా నిరంతరం సాగి పోతూనే ఉంటుంది.

<u>లలిత కళలు - వాస్తుకళ</u>: అనాది నుండీ మన దేశంలో లలిత కళలన్నింటికీ మతమే ఆలంబనగా ఉండేది.

స్థూప, చైత్ర. విహార నిర్మాణాలతో బౌద్ధులు మొట్ట మొదట ఆంధ్రదేశంలో మహత్తరమైన వాస్తుకళా ఖండాలను నిర్మించారు. అమరావతి, నాగర్జున కొండ, ఘంటసాల, భట్టిప్రోలు, స్థూప శిధిలాలు ఆ నాటి బౌద్ధుల వాస్తు కళా వైభవాన్ని చాటిచెపుతున్నాయి.

హిందువుల వాస్తుశిల్పం వారి దేవాలయ నిర్మాణాల్లో పరాకాష్ట నందుకొన్నది. భారతదేశంలో ప్రప్రథమంగా హిందూ దేవాలయాలు ఆంధ్రదేశంలోని నాగార్జునకొండలో నిర్మింప బడినవని నిరూపింప బడినది. అలంపురంలోని నవబ్రహ్మేశ్వరాలయాలు, కాకతీయుల నాటి వేయిస్థంభాల గుడి, రామప్ప దేవాలయంలోని వాస్తుశిల్ప వైచిత్రి-చూచేవారికి ఆశ్చర్యం కలిగించే విధంగా ఉంటుంది. విజయ

నగర రాజులు మహాత్తరమైన గాలి గోపురాలను నిర్మించటంలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నారు.

శిల్పకళ: ఆంధ్రశిల్పం ప్రపంచ ప్రఖ్యాతి పొందినదని చెప్పటానికి సందేహం లేదు. అమరావతిలో ఆంధ్రశిల్పులు అద్భుతమైన కళాఖండాలు సృష్టించారు. బుద్ధ భగవానుడి చరణ పద్మాలను తన్మయత్వంతో ఆరాధిస్తున్న స్త్రీ మూర్తి శిల్ప ఫలకం ప్రపంచ శిల్ప ఖండాలలోనే అత్యుత్తమమైనదిగా పరిగణింపదగినది. రామప్ప, తాడిపత్రి-దేవాలయాలలో కాకతీయ విజయనగర కాలం నాటి అపూర్వ శిల్ప ప్రతిమలు ఈ నాటికీ చూపరులకు కన్నుల పండువు చేస్తున్నాయి. ప్రాణంతో స్పందిస్తున్నట్లు, జీవంతో నడయాడుతున్నట్లు - భ్రమ కలిగించే చిన్న చిన్న శిల్ప మూర్తులు కాకతీయ శిల్పకళా వైభవాన్ని, వైదుష్యాన్ని-వెల్లడి చేస్తున్నవి.

చిత్రకళ: ప్రపంచ ప్రసిద్ధి పొందిన అజంతా గుహలలోని తొలిచిత్రాలు శాతవాహనుల నాటి ఆంధ్ర చిత్రకారుల చిత్రణలే నని కళాభిజ్ఞుల అభిప్రాయం. వారు బోధిసత్త్వుని జాతక కథలను అత్యద్భుతంగా చిత్రించి-వాటికి అమరత్వం కలగజేశారు. లేపాక్షిలోని కుడ్య చిత్రాలు విజయనగర చిత్రకళకు మచ్చుతునకలు.

సంగీతం: దాక్షిణాత్య సంగీతానికి ఎంతో వైవిధ్యాన్ని, నిండుతనాన్ని తెచ్చారు తెలుగువారు. వాళ్ళ

పాక అన్నమాచార్యులు తిరుపతి వేంకటేశ్వర స్వామి మీద వేలకొలది భక్తి స్ఫోరకములైన పదాలు రచించి సంకీర్తన సంప్రదాయ సంగీతాన్ని ప్రచారంలోకి తెచ్చారు. ఆయన కుమారులు, మనుమలు-కూడ పదకవితకు దోహదంచేశారు.

ఆంధ్రభాష సంగీతానికి ఎంతో అనుకూలంగా ఉండే పద జాలంతో కూడినది. ఇందుకు తార్కాణం-ఇతర ద్రావిడ భాషలవారు తెలుగు పాటలను ఎక్కువగా సమాదరించటం!

17 వ శతాబ్దిలో క్షేత్రయ్య శృంగార పరమైన భక్తియుత పదరచన చేసి సంగీతానికి వన్నె చిన్నెలు చేకూర్చాడు. 19 వ శతాబ్దిలో త్యాగరాజు ఎన్నో భక్తి పరమైన కృతులను రచించి కర్నాటక సంగీతాన్ని తీర్చి దిద్ది తెలుగు వాగ్గేయ కారుడుగా దక్షిణాపద మంతటి లోనూ ప్రసిద్ధి కెక్కాడు. 'నాదబ్రహ్మ' రూపంలో సంగీతాన్ని ఉపాసించిన మహనీయుడు త్యాగయ్య. ఆయన రచించిన కృతులు-సంగీతం, సాహిత్యం-సమపాళ్ళగా కలిసిన పరమాద్భుత సౌందర్య కృతులు. శ్యామశాస్త్రి, ముత్తు స్వామి దీక్షితులు, త్యాగరాజు - ఈ ముగ్గురూ కర్నాటక సంగీతంలో త్రిమూర్తులని పేరుపొందిన వారు.

భద్రాచల రామదాసు కీర్తనలు భక్తికి ప్రాధాన్యం ఇచ్చేవి. భగవంతునితో ముఖాముఖి మాట్లాడే టంతటి సుకుమార సుందర భావగర్భితమైనవి. కొన్ని భజన సంప్రదాయానికి చెందినవి. హరికథా పితామహ-ఆదిభట్ల నారాయణదాసు, ద్వారం వెంకటస్వామి నాయుడు, ఈమని

శంకరశాస్త్రి, బాలమురళీ కృష్ణ, మొదలైన వారు సంగీతకళ ద్వారా తెలుగు దేశానికి గొప్ప పేరు ప్రతిష్టలు తెచ్చి పెట్టిన వారు.

<u>నృత్యకళ :</u> ఆంధ్రులు మొదటినుంచీ నృత్య, గీత, వాద్య ప్రియులే! అమరావతి, రామప్పలోని శిల్ప ప్రతిమల నృత్య భంగిమలూ, వాద్య విశేష శిల్పాలూ చూస్తే తెలుగు దేశంలో నృత్యకళ అత్యున్నత స్థితిలో ఉండేదని తెలుస్తుంది.

నృత్య సంప్రదాయం నట్టువ మేళం అనీ, నాట్య మేళమనీ రెండు రకాలు. నిన్న మొన్నటి వరకు దేవాలయాలలో దేవదాసీలు స్వామిసన్నిధిని చేసేఆరాధనా నృత్యాలు. కళ్యాణ మంటపాలలో చేసే కేళికా నృత్యాలు, నట్టువ మేళ సంప్రదాయానికి చెందినవి.

తెలుగు దేశాన్ని ఏలినరాజులు, తమ ఆస్థానాలలో నాట్యకళను ప్రోత్సహించి పోషించటమే కాక, స్వయంగా-సంగీత, నాట్యకళలమీాద ప్రామాణిక గ్రంథాలను, ,వ్యాఖ్యలను-రచించారు. ప్రతాపరుద్రుని ఆస్థానంలో మాచల్దేవి, కుమారగిరి రెడ్డి ఆస్థానంలో లకుమాదేవి, కృష్ణదేవరాయల ఆస్థానంలో రంజకం కుప్పాము- అనే నర్తకీ మణులు నాట్య శాస్త్ర ప్రవీణులుగా ప్రసిద్ధి పొందారు.

నృత్య నాటకాలు ఆడేవారిని 'నాట్య మేళము' అంటారు. కూచిపూడి భాగవతులు ఈ నాట్య మేళంలో ప్రసిద్ధులు.

కూచిపూడి భాగవతులు క్రీ. శ. 1500 ప్రాంతాల నుంచి, సిద్ధేంద్రయోగి రచించిన 'భామాకలాపము' ఆడుతున్నారు. 19 వ శతాబ్ది మధ్యవరకు-ఇందులో పురుషులే స్త్రీలవేషం ధరించేవారట. కూచిపూడి నర్తకులు నృత్యమందే కాక, సంగీత సాహిత్యాలలోను, వేద వేదాంగాలలోను నిష్ణాతులుగా ఉండేవారు.

కూచిపూడివారి నృత్య నాటక సంప్రదాయాల నుండే, మేలట్టూరు భాగవత సంప్రదాయాలు-భామాకలాప, రాజ నర్తకి సంప్రదాయాల నుండి భరత నాట్యము-రూపొందింపబడినవి.

చేనేతపనులు: ఆంధ్రదేశం మొదటినుంచీ చేనేత పనులకు ప్రసిద్ధి పొందినది. వ్యవసాయం తరువాత మనదేశంలో నూలు, చేనేత పరిశ్రమలు ముఖ్యమైనవి. రుద్రమ దేవి కాలంలో-ఆంధ్రదేశాన్ని దర్శించిన మార్కో- పోలో-ఆనాటి సన్నని నూలు వస్త్రాలను, రవసెల్లాల నాణ్యతను-ఎంతగానో కొనియాడాడు.

"కవ్వమాడని ఇల్లు-కదురు త్రిప్పని కొంప
మగ్గము లేనూరు-మరికానరాదు!"

అన్న చందంగా - ఇంటింటా ఆ నాడు రాట్నం తిరుగుతూ ఉండేది. పల్నాటిలో 'రంభమైన యేకులు వడికే దని' శ్రీనాథుడు చక్కని పద్యం చెప్పాడు.

కాకతీయుల కాలంలో తయారవుతూ ఉండే వస్త్రాల పేర్లు చిత్ర విచిత్రంగా పాల్కురికి సోమనాధకవి వర్ణించిన పద్యం.

" వెంజావళియు, జయరంజియు, మంచు
పుంజంబు, మణిపట్టు, భూతిలకంబు,
శ్రీవన్నియయు, మహాచీని, చీనియును,
భావజ తిలకంబు, పచ్చని పట్టు
రాయ శేఖరమును, రాయవల్లభము
వాయు మేఘము, గజపాళంబు, గండ
వడము, గాఫులు, సరిపట్టును, హంస
పడియు, వీణావళి, పళ్ళడదట్టి
వారణాసియు, జీకు వాయు, కెందొగరు,
గౌరి గనయమును, క్షీరోదకంబు,
పట్టును, రత్నంబు పట్టు, సంకుపట్టును
మరకత పట్టు, పొంబట్టు
నెరపట్టు, వెలిపట్టు, నేత్రంబు పట్టు
మరితవరాజంబు, మాండొళరవియు !"

షిఫాన్, నైలాన్, నైలెక్సువంటి పేర్లతో మాత్రమే పరిచయమున్న ఆధునికులకు ఆనాడు మనవాళ్ళు నేసిన వస్త్ర విశేషాల పేర్లు కొరుకుడు పడనివిగా ఉంటాయనటంలో సందేహం లేదు !

డచ్, ఫ్రెంచ్, ఇంగ్లీషు వర్తకులు-16, 17, 18 శతాబ్దులలో-మచిలీపట్నం, నరసాపురం, యానాం, నిజాం

పట్నం, మొదలైన రేవులనుంచి రకరకాలైన వస్త్రాలను యూరపు, అరేబియా, ఆగ్నేయాసియా దేశాలకు భారీ ఎత్తున దిగుమతి చేసుకునేవారు.

గద్వాల, పోచంపల్లి, ఉప్పాడ, వెంకటగిరి - చేనేత చీరలు ఇప్పటికీ ఎంతో కళానైపుణ్యంతో నేస్తున్నారు. మచిలీపట్నంలో తయారయిన కలంకారీ అద్దకపు వస్త్రాలను ఢిల్లీలోని మొగల్ రాజుల దివానీ ఆమ్ దర్బారులో గోడలకు అలంకరణ కోసం నిండుగా పరిచేవారట! ఇప్పటికీ కాళహస్తిలోను, మచిలీపట్నం లోను-చిత్రవిచిత్రాలయిన కలంకారీ అద్దకాలు తయారు అవుతున్నవి. ఆర్మూరు సిల్కులు-పెద్దాపురం పట్టు చేనేతలు, హైదరాబాదు హిమ్రూలు-ఇవన్నీ మన చేతిపనుల పరిశ్రమలకు ప్రతీకలే!

ఏలూరులోను, వరంగల్‌లోను, మొగలుల కాలం నుంచీ తివాచీనేత జరుగుతున్నది. ఇప్పటికీ ఇవి చేతిపరిశ్రమల కేంద్రాలుగా కొనసాగుతున్నవి.

నిర్మల్ బొమ్మలు, కొండపల్లి లక్క బొమ్మలు, తిరుపతి ఎర్రచందనం బొమ్మలు, విశాఖపట్నం దంతపు బరిణలు, కరీంనగరం వెండి ఫిలిగ్రీ పనులు, హైదరాబాదు బిద్రీవస్తువులు-ఇంకా ఎన్నెన్నో తెలుగు దేశపు కళాకారులు సృష్టించే కళాఖండాలు.

జానపదగేయాలు: సహజ సుందరంగా ఉండి-సూటిగా గుండెలకు హత్తుకు పోయే విధంగా-జానపదులు

పాడుకొన్న పాటలు మనకు కోకొల్లలు. స్త్రీల పాటలు, గ్రామీణ గీతాలు, పెళ్ళి పాటలు-ఇలా-ఆయా సందర్భాలలో పాడుకొనే పాటలు కొంతవరకు కాల ప్రవాహంలో కలిసి పోయినవి. వీటిని సేకరించి, అక్షరబద్ధం చేసి, తెలుగు సాహిత్యంలో సుస్థిర స్థానం ఇవ్వవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

భారత దేశానికి అన్నపూర్ణగా వాసికెక్కిన ఆంధ్ర దేశపు చరిత్ర-ఎంతో వైవిధ్యమూ, భిన్నత్వంలో ఏకత్వమూ కలిగిన ఉజ్జ్వలమైన చరిత్ర-

"తన గీతి యరవ జాతిని పాటకులనుగా
దిద్ది వర్థిల్లిన తెలుగు వాణి
తనపోటులు విరోధి తండంబులకు సహిం
పనివిగా మెరిసిన తెనుగు కత్తి,
తన యందములు ప్రాంత జనుల కభిరుచి వా
సన నేర్పనలరిన తెనుగు రేఖ,
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ
లను జేయ జెలగిన తెనుగు భూమి,
అస్మదార్ద్రి మనోభూమి నావహింప
జ్ఞప్తి కెలయించు చున్నాడ; చావలేదు
చావలేదు! ఆంధ్రుల మహోజ్వల చరిత్ర
హృదయములు చీల్చి చదువుడో సదయులార!"

—రాయప్రోలు

* * *

# హాస్యప్రియత్వం

ధనుర్మాసం వచ్చిందంటే తెలుగింటి పడుచు పిల్లకు పరమానందం. పక్షుల కన్నా, పిట్టల కన్నా, ముందే లేచి పోవాలని పందెం వేసుకుంటుంది.

ఆ చలిలో, చిరుచీకట్లో-లేచి ముస్తాబై-ముగ్గుడబ్బా చేతిలో పుచ్చుకుని వీధిలోకి వస్తుంది.

కసవు శుభ్రంగా చిమ్మి, పేడకలిపిన కళ్ళాపు చల్లిన వాకిలి. ఆ వాకిట్లో వేయాలి ముగ్గు! ప్రక్కింటి సీతా, ఎదురింటి రాధా-వేసిన దానికన్నా పెద్ద అందమైన ముగ్గు వేయాలి. ఆపైన గొబ్బెమ్మలు పెట్టుకోవాలి. గొబ్బి తట్టుతూ పాడుకోవాలి!

"సుబ్బి గొబ్బెమ్మా సుఖము లియ్యావే
తామర పువ్వంటి తమ్ముణ్ణియ్యావే
చేమంతి పువ్వంటి చెల్లెల్నియ్యావే
మొగలీ పువ్వంటి..........."

కూనిరాగం తీస్తూ ముగ్గుపెడుతూన్న పిల్లకు ఎక్కడ లేని సిగ్గూ వచ్చిపడింది. బుగ్గల్లో గులాబీలు పూసినట్లయింది. ముసి ముసిగా పెదవుల నందుకు త్రోసుకు వస్తున్న నవ్వును

దాచుకోవాలని అణచి పెట్టుకుంటూ-ఏదో అలికిడి అయి నట్లయి వెనక్కి తిరిగి చూచింది.

ఆ మసక వెలుతురులో-చల్లగా, చప్పుడు చేయకుండా ఎప్పుడు వచ్చాడో కాని-బావ నిలువెత్తు విగ్రహంతో- చిరునవ్వు నవ్వుతూ ఎదురుగా నిలుచుని ఉన్నాడు.

దొంగలాగా వచ్చి తనపాటను విన్నాడు కాబోలు! ముందుకి వంగి-మరదలు పిల్ల జడగంటలు చేజిక్కించుకుని- "ఏం! ఆగిపోయావేం! మొగలీపువ్వంటి........?" అంటూ కొంటెగా రాగం తీశాడు.

పడుచుపిల్లకు సిగ్గుతో పాటూ ఉక్రోషం ముంచుకు వచ్చింది. అయితే గడసరితనమూ, సరసంగా సమయ స్ఫూర్తితో మాట్లాడటమూ తెలుగు కన్నెకు ఉగ్గుతో అలవడిన విద్యకనుక వెంటనే తేరుకుంది ఆ పిల్ల! ఒక్క విసురుతో-అతడి చేతిలో ఇరుక్కున్న జడగంటలు వదిలించు కుని-

"అత్త కొడుకొచ్చాడు పందిరెయ్యండీ
పందిట్లో బావకీ పీటవెయ్యండీ
పళ్లేరు తెప్పించి పక్క వెయ్యండీ
నల్లేరు తెప్పించి నలిచీ విడువండీ"

అని పాడుతూ ఇంట్లోకి పరుగు తీస్తుంది.

ఈ స్వాగతం-అందుతో పాటూ తనకు అందబోయే సత్కారం-విన్న కుర్ర నాగన్న-తానూ అంతటి గడసరి కాడైన ధీరోదాత్తుడై తే-నవ్వుకుంటూ, ఆ పిల్ల వెనకనే

ఇంట్లోకి దారి తీస్తాడు. కాస్త అర్భకుడైతే, మరదలు పిల్ల అన్నంత పనీ చేయిస్తుందేమోనని తటపటాయిస్తూ-గడప ఇవతలే నుంచుండి పోతాడు.

హాస్యాలు ఆడుకోవడమూ చమత్కారంగా మాట్లాడుకోవడమూ-తెలుగు గడ్డపైన జన్మ ఎత్తిన వాడికి జన్మతః అలవడే విద్య.

ఒక చల్లని హాసం-ఒక రమ్యమైన పరిహాసం-సంభాషణల మధ్య విద్యుల్లత వంటి ఒక చమత్కారం లేక పోతే, ఎన్నో భయాలు, దిగుళ్ళు, ఒడిదుడుకులతో కూడిన మానవ జీవితంలో స్వారస్యం ఇంకా మిగిలి ఉంటుందా!

తెలుగన్నల బ్రతుకులు-అవి తీపి తక్కువ బ్రతుకులైనా, అక్కడొక చమక్కు-ఇక్కడొక తళుక్కు-సంతరించుకొనే ఉంటాయి. హాస్యాన్ని-అది లలిత హాస్యమైనా, మోటు హాస్యమైనా సరే-బ్రతుకులోకి ఈడ్చి తెచ్చుకుని మరీ పులకరించి పోతాడు. తనచుట్టూ ఉన్నవారిపైన శీతల తుషారంలా నవ్వుల పువ్వులను విరజిమ్మి-తానూ అంతకు అంతగా ఆనందిస్తాడు!

సరసాలతో, సరాగాలతో, పరిహాసాలతో - అడుగడుగునా అమృతపు సోనలను నింపుకుంటూ - సమస్యల మయమైన సంసార యానం సాగిస్తాడు.

మనస్సును గిలిగింతలు పెట్టే ఈ రాగతనం, ఈ జాణతనం, ప్రేయసీ ప్రియుల మధ్య, బావా మరదళ్ళ మధ్య,

భార్యాభర్తల మధ్య-ఒక సరసంగా, ఒక ప్రణయ భావంగా-పరిణమించి-చుట్టూఉండే వారికి కూడా గుండెలు పులకించే టట్లు చేస్తుంది.

అలా పండుగ వేళ, తెల తెలవారుతూ ఉన్న వేళ, వాకిటి లోకి వచ్చిన బావ - అత్తకొడుకే కానివ్వండీ - కాబోయే మొగలి పువ్వంటి మొగుడే కానివ్వండి .... ఆకాస్త పాటతో వదిలిపెడుతుందా మరదలుపిల్ల !

ఓహో! ఎన్ని చమక్కులు! ఎన్ని చమత్కారాలు చేస్తుంది బావని పట్టుకుని! ఎన్ని తిప్పలు పెడుతుంది అతడిని! ఎన్ని గిరికీలు తిప్పుతుంది అతడిని!

" బావయ్యొచ్చాడూ
కూరేమి లేదు
కుళ్ళిపోయిన గుమ్మడి కాయ
బావకు కూర! "

అంటూ రాగం తీసేటప్పటికి-ఏ బావకైనా గుండెల్లో రైళ్ళు పరుగెత్తకుండా ఉంటాయా !

తిరిగి చూసేటప్పటికి మరొకవైపునుంచి చెంగున వస్తుంది ఆ పిల్ల. ఓణీచెంగు నడుం చుట్టూ దోపి-ఒక చేత్తో చావడి స్థంభం పుచ్చుకుని గుండ్రంగా తిరుగుతూ—

" బావా బావా పన్నీరు
బావను పట్టుకు తన్నేరు
వీధి వీధి తిప్పేరు

పీసెడు గంధం పూసేరు
చావడి గుంజకు కట్టేరు
చప్పిడి గుద్దులు గుద్దేరు!"

అంటూ రాగంతో పాడేటప్పటికి-ఆ బావగారి స్థితి ఎలా ఉంటుందో మనకు తెలియదు! అతడి అప్పటి వైఖరికి నవ్వాలో, జాలిపడాలో కూడా తెలియదు! మరదలికన్నా గడసరికాడైతే-ఆ పిల్లను తత్క్షణం వాటుపుగా పట్టుకుని-వీపుమీద వీశెడు గుద్దులు వడ్డించి వదలటం మాత్రం తథ్యం!

"కోతీ బావకు పెళ్ళంటా
కోవెల తోటా విడిదంటా
మల్లీ మాలతి వస్తారా
మాలికలల్లీ తెస్తారా" —కృష్ణశాస్త్రి

పాట ఎంత మధురంగా ఉన్నా, బావను ఉడుక్కునేట్లు చేస్తుంది. ఆ 'కోతి' అనే విశేషణం.

పొట్టిబావ, చిట్టి మరదలు - ఆడుకునే హాస్యాలతో త్రుళ్ళి త్రుళ్ళి నవ్వుకోని తెలుగిల్లు ఉండదు.

అసలు ఈ పరిహాసాల పరంపర ముఖ్యంగా మన పెళ్ళి పందిళ్ళలో పరాకాష్ఠ పొందుతుంది-అనటంలో అతిశయోక్తి లేదు.

బావా మరదళ్ళ సరాగం దగ్గర నుంచి, వియ్యాల వారి సరసాల వరకూ-హాస్య రసం మిళాయించుకొని - విద్వత్తుతో పాటూ విద్యుత్తును కూడా జీవితంలో విరియ జల్లుకునే సంప్రదాయం మనది.

ఆడపిల్లను కన్న తల్లి దండ్రులకు-శక్తికి మించిన అరణం ఇచ్చి అల్లుణ్ణి కుదుర్చుకు రావటం ఒక ఎత్తు! వివాహ సన్నాహాలు సంతృప్తికరంగా చేసి, ఎవరికీ ఏలోటు పాటులూ జరుగకుండా, ఆ శుభకార్యం నిర్వహించడం ఒక ఎత్తు! అందులో వియ్యాల వారికి మొగపెళ్ళివారికి సకల మర్యాదలూ చేసి మెప్పించడం మరొక ఎత్తు!

ఎంత చేసినా తృప్తి పడరు-మొగపిల్లవాడిని కన్న గర్వంతో విర్రవీగే మనస్సులేని మర మనుషులు! ఇలావెత్తి పొడుస్తారు. అందులో కొంత విసురు, విమర్శ-పైకి మాత్రం హాస్యంగా, కాస్త అతిశయోక్తిగా-అన్నట్లు కనిపిస్తుంది-

"ఏలాగు భోంచేతుమూ
ఈ విందు మే మేలాగు భోంచేతుమూ
విస్తర్లు వేశారు దోసెడేసి
వెడల్పు లేదండి హస్తము కదలుటకూ
ముక్క బియ్యము వండిరీ
దానిలోకి ముద్దా పప్పే వేసిరీ!
చెప్పుకుంటె సిగ్గౌతుంది
చెయ్యి కడిగిన జిడ్డే లేదు
కూరే వంకాయ కూర
దానిలోకి మార్చే పచ్చడిలేదు
కలహంబులే కానీ కారంబులు గుచ్చెత్తిరి!
పులిహోర పులుపట
అబ్బ! చింత కాయ పులుసు!

ఏ కలహంబు లేకా మరి
కరివేపాకు గుచ్చి త్రిరి
వడ్డించే వదిన గారికి వడ్డాణ మూడి పోయె !"

పైన ఆడిన నిష్ఠూరాలకు బిక్క-ముఖం పడిపోయి ఉంటుంది ఆడపెళ్ళివారికి ! కాని, ఆఖరు చరణంలో ఉన్న సురుచిర హాసం స్ఫురణకు వచ్చేసరికి-ఇదంతా ఒక ఎకసక్కే-నికి-వేళాకోళానికి-వియ్యాల వారు చేసే అధిక ప్రసంగం కాబోలు-అనుకుని గుండెల మీద చేయి వేసుకుంటారు ఆడపిల్లను కన్న అమ్మా-అబ్బా !

అసలే అణిగి మణిగి వొత్తులు వొత్తుతూ ఉండే ఆడపెళ్ళివారిని-మరికాస్త ఉడికించాలని మగపెళ్ళి వారికి బుద్ధి పుట్టిందంటే-

" విందూ చేసినారూ-వియ్యాల వారి ఇటా
విందూ మాట చెపితే, వింతగా ఉంటుంది
పొట్టిబావగారూ. కొట్లు పెత్తన మట
కొట్టులో సరుకులూ-ఇవతలకు రానీయరూ
అత్తగారు వచ్చి పళ్ళెం తట్టినాదీ
మామగారు వచ్చి మటమట లాడేరు !"

అంటూ చరణం ఎత్తుకుంటారు ! ఇలా పాట ఎత్తుగడ జరిగిందీ అంటే, ఎన్ని చింతలూ చీకాకులూ ఉన్నా-ఇరుపక్షాల వారి మూఖాలూ, మట మటలు చాలించి-మతాబాలుగా వెలిగిపోవలసిందే !

వియ్యాపురాలికి సకల మర్యాదలూ చేయవలసిన విధి ఉంది.

కనుక-తప్పని సరిగా చేస్తుంది. కాని-తెలుగమ్మాకు అందులోనూ పరిహాసమే! వేళాకోళమే!

హాస్యాల మధ్య వదినగారికి స్వాగతం ఇలా చెపుతుంది.

"నీళ్ళు ఇద్దామంటె చిల్లి చెంబాయె
చాప వేద్దామనగ చోటు దొరకదాయె!
కోడి కోడదామంటె గుడ్లగోడాయె!
వడ్లు దంచీ చూడ విత్తనాలాయె!
పీట లేయాబోవ పిల్లడ్డమాయె!"

ఆ వచ్చిన వదినగారి ముఖంలో రంగులు మారిమారి హరివిల్లులా విరుస్తుందనటంలో అనుమానం ఉండదు!

ఈ వియ్యపురాళ్ళ వినోదం ఈనాటిదా మరి! ద్వాపరయుగం నాటినుంచీ మనకు ఆనవాయితీగా సంక్రమించిన పరసమే ఇది!

సుభద్రార్జునుల వివాహ సమయం. వేడుకలకూ, వేళాకోళాలకూ వేళాపాళా ఉండని సమయం.

"రుక్మిణీ దేవి తమ యత్త మ్రోల కచికి
బసిడి చిన్నియు కస్తూరి యొసగ నామె
చేదిగిచి దేవకీదేవి మీద జిలికి
వదినె గారని యొకకొంత లాలి నెరపె!"

—విజయవిలాసము

అంతటితో ఆగక-

"వీయపురాలివైతి గదవే యిపుడ త్తవు తొంటివావి నో
తోయజ నేత్రు గాంచిన వధూమణి!"

అంటూ వరుసలు తిరగ వేస్తుంది ఇంద్రాణి।

ఈ వావి వరుసలూ, వేళాకోళాలూ-అమర కాంతలకే అంత మనస్సైనప్పుడు-ఆంధ్రనారి తీసిపోయిందా?

"వదినగారు మీరు వచ్చినారండీ కుదురుగ
గూర్చుండి మీరు నోరు ముయ్యండి!
పాట తెలియదు మాట తెలియని వదినెగారు।"

అంటూ కాస్త మోటు హాస్యం కూడా చేస్తుంది అప్పుడప్పుడు।

ఈ మోటు హాస్యం ఒక్కొక్క సారి మోతాదు మించుతుంది. అది పెళ్ళికొడుకు పైకే రివ్వున వచ్చి చంద్ర హాసంలా తాకితే- ఇలా ఉంటుంది!

"ఎక్కడ దొరికినాడమ్మా ఈ పెళ్ళి కొడుకు
అడ్డెడు మానెడు పోసినాము
అరిసెలైన వండినాము
అంగుడైన జూపడాయె
అర మొగము పెళ్ళికొడుకు
అయిదు వేలు పోసినాము
అత్తరు పన్నీరు చల్లినాము
చల్లుకోవటం చేతకాదు
చవట మొగం పెళ్ళికొడుకు!"

అయిదువేలు పోసి కొని తెచ్చుకొన్న పెళ్ళికొడుకు పైన ఆడపెళ్ళి వారికి ఆవగింజంత అక్కసు ఉండటం సహజమేనేమో! అది ఈ రకమైన దెప్పిపొడుపుతో-హాస్యం పేరుతో - ఆడపెళ్ళివారు తీర్చుకుంటున్నారేమోననీ అని పిస్తుంది!

పెళ్ళితంతు పూర్తయినాక - అమ్మాయిని అత్తవారి ఇంటికి సాగనంపాలి. అమ్మాయిని అత్తగారి తరపువారంద రికీ అప్పగింతలు పెడుతూ పాటలు పాడుతారు. ఆ పాటలు వింటూ ఉన్నవారికి కూడా ఆ సమయంలో హృదయం ద్రవించక మానదు. ఆ సన్నివేశం అటువంటిది. కని, కంటికి రెప్పలా సాకి-ఒక అయ్య చేతిలో పెట్టి, బంధం తెంచుకోవలసిన విషాద ఘడియ అది. ఇటువంటి బరువైన సన్నివేశాన్ని కూడా-నవ్వుతూ, తేలికగా తీసుకునే పాట ఇలా ఉంటుంది.

"పతివ్రతా ధర్మంబు భక్తితో సలిపి
అతని చెంపమీద అంటిస్తు ఉండు!
సేవచేయించుకో చిన్నత్తలా చేత!
బావగారిని సేదు బానిసగ దూడు
తోటి కోడలి బిడ్డ కూటికేడిస్తే
పీట కోడిచ్చుకో ఒక కొట్టవమ్మ!
అత్త వచ్చి నిన్ను పని చేయమంటె
తలకి పట్టేసుకో పడ కేయవమ్మ!

ఏకువలె మొత్తంగ ఎరుగనట్లుండీ
మేకు వలె బిగుసుకుని మేలుకొని యుండు!"

పరాయి ఇంటికి వెళ్ళిపోతున్నా ననే పరాకుతో - దిగులుతో ఉన్న పెళ్ళికూతురయినా, ఈ పాట వింటే - కారే కన్నీళ్ళు కారుతుండగానే ఫక్కు-మని నవ్వకుండా ఉంటుందా!

వదినా మరదళ్ళ మధ్య ఎన్ని సరసాలు! ఎన్ని వాక్చమత్కృతులు! వరుసకు వదినయితే చాలు-వదిలి పెట్టదు తెలుగు పడుచు!

"వంట వంటనియేరు అదియెంత వంట!
వదినతో మరదళ్ళు వాదాడినట్లు!"

అంత తేలిక-సరదా-వంట చేయటం కాని, వరస లాడటం కాని! ఆ వరసలాడటంలోనూ ఒకవరస ఉంటుంది! మాటకు మాట, వేటుకు వేటు-అన్నట్లుగా ఆ విసిరి కొట్టు కునే వాగ్బాణాలకు వేడీ వాడీ-ఉంటుంది.

కొత్తగా పెళ్ళయి కాపురానికి వచ్చింది అన్న పెళ్ళాం. ఇంటి ఆడపడుచుకు తిరిగే కాలూ తిట్టేనోరూ. ఇప్పుడు ఆడ బిడ్డను అయానననే కొత్తగర్వం-హోదా! "ఆడబిడ్డ-అర్థ మొగుడు"- అని అననే అన్నారు మనవాళ్ళు!

"వదినా వదినా వల్లంకి పిట్టా
గదిలో పెట్టా గంజినీళ్ళోయ్యా
నీకొడుకు పుట్టా నాపేరెట్టా
అన్నయ్య కొట్టా నువ్వేడ్వా నేన్నవ్వా!"

అంటూ రాగం తీసి, వదిన ముఖంవంక చూసి – పడీ పడీ నవ్వుతుంది హాస్యాల మారి ఆడపడుచు.

అన్నయ్య మాత్రం తనవాడు. తనకు తోడపుట్టిన వాడు. వదినను పరిహాసం చేస్తూ, మేలమాడటం లోనూ మంచి కోరికే కోరింది. వదినకు కొడుకు పుట్టాలి! తన పేరు, లేకపోతే తనపేరుతో కలిసేపేరు-వాడికి పెట్టాలి! ఆ పుట్టిన వాడికి మళ్ళీ వెంటనే కార్పణ్యం! వదినని అన్నయ్యకొడితే, ఆమె ఏడిస్తే, తానుచూచి నవ్వాలి! ఏమి కోరిక!

ఇది హాస్యానికి కట్టినపాటే! ఈపాట పాడుతూ చప్పట్లు చరిచే ఆడబిడ్డవంక చూచి, ఆ అన్నపెళ్లాం ముసిముసిగా నవ్వుకుంటుంది తప్ప, కోపగించుకోదు! కొడుకు పుట్టడమంటే కొండంత వరమే కద! ఆ నవ్వించే పాటలోనిపదాలు శూలాల్లాగా ఆమెను బాధించవు! ఏ మల్లెల మాలో, ఏ విరజాజి దండో-విసురుగా వచ్చి తగిలి మనస్సును గిలిగింతలు పెట్టినట్లయి, తానూ తిరిగి ఆ పూలమాలను విసిరికొట్టటానికి సన్నద్ధం అవుతుంది.

పురాణకాలం నాటి వదినా మరదళ్ళ హాస్యమూ మనకు కొన్ని చోట్ల సరస సుందరంగా కనిపిస్తుంది.

సుభద్ర అభం శుభం తెలియని ముద్దరాలు. కపట సన్యాసిని యోగి పుంగవుడిగా భావించి శుశ్రూష చేసింది. కొంతకాలానికి కపట సన్యాసి కథ తెలిసింది. తన మనసు నిండా నింపుకొన్న మగవాడు-మహావీరుడు-అర్జునుడు-తన కోసం ఈ మారువేషం వేసుకుని వచ్చాడు! సుభద్ర

మనసంతా, తనువంతా - పులకరింతలు-అతడికోసం పలవరింతలు!

వదినెలు తమ ముద్దుల ఆడపడుచు స్థితి కనిపెట్టారు. సరసాలతో ఆమెను చుట్టుముట్టారు!

అందరి హాస్యోక్తులూ ఒక ఎత్తు; సరస శృంగార మూర్తి, కృష్ణమూర్తి అష్ట భార్యలూ సరసాలు ఆడటంలో ఆరితేరినవారే! కాని అందరిలోనూ సత్యభామ విసిరే వాగ్బాణాలకు చురుకు ఎక్కువ! ఆవిడ అంటుందీ-

"క్రాగి యున్నది మిగుల నంగంబు చూడ
గల వరించుచు నున్నది; కలదొ యేమొ
సోకు; డల్ల సన్యాసికే చూపవలయు
భామ నని పల్కె నా సత్యభామ నగుచు!"

—విజయ విలాసము

వొళ్లు చూడబోతే కాలిపోతూ ఉంది. మనిషి చూడబోతే కలవరింతలలో ఉంది. ఏదైనా గాలీ ధూళీ సోకిందేమో నమ్మా! ఆ సన్యాసికే చూపిస్తే-మా ఆడబడుచుకు మంత్రిమో తంత్రిమో వేసి ఈ తీపరం పోగొడతాడు! .... అంటుంది వదినగారు!

ఇటువంటిదే - వదినా మరదళ్ళ మధ్య జరిగే సరస సంభాషణ మన జానపద కావ్యం—'ఊర్మిళాదేవి నిద్ర'లో మనకు దొరుకుతుంది.

పద్నాలుగు దీర్ఘ సంవత్సరాలు దీర్ఘ నిద్రలో మునిగి, భర్త ఎడబాటును వేగించింది ఊర్మిళాదేవి. లక్ష్మణస్వామి

అన్నా వదినలతో పాటు అరణ్యవాసానంతరం - అయోధ్యకు తిరిగి వచ్చాడు. ఏకాంతంలో ధర్మ పత్నిని కలుసుకున్నాడు. ఆమె స్థితికి కన్నీరు పెట్టుకున్నాడు. ఆ తరువాత అనునయింపులూ, కష్టసుఖాలు చెప్పుకోవటాలూ అయినాక - ఊర్మిళ గది వదిలి బయటకు వచ్చింది. ఆమెకు అభ్యంగన స్నానం చేయించి అలంకారాలు చేశారు. అసలే చక్కని చుక్క! శోభనపు పెళ్ళికూతురి ముస్తాబుతో-మరీ మెరిసి పోతూ ఉంది. ఆమెను చూచేటప్పటికి ఆడపడుచు శాంతకు సరదా వేసింది! తమ్ముని భార్యకు కాస్త గిలిగింతలు పెడదామని హుషారు పుట్టింది.

"చేడె వినవే జానకీ! నీ చెలియ
యూర్మిళ బుద్ధులన్ని
భమిడి పానుపున సొలసి
యుండె నొక పదునాలు గేండ్లు పడతీ
కుందనపు ప్రతిమ కళలు ఈ కళ
ఎందుండి దాగున్నదో!
దృష్టి తగులాకుండను నీలాల
నివ్వాళు లివ్వరమ్మా!"

ఊర్మిళకు ఎక్కడలేని సిగ్గూ వచ్చింది. సిగ్గుతో ముఖం ఎర్రబడిపోయిన చెల్లెలివంక ఒకసారి చూచి నవ్వుతూ, సీత గడుసుగా వదినగారికి జవాబు చెప్పింది.

"ఇంద్ర చంద్రాదులను వళపించు
చంద్రులూ మీ తమ్ములూ

దృష్టి తగులా కుండను
నీలాల నివ్వాళు లివ్వరమ్మా !"

శాంత తక్కువ తిన్నదా ? వెంటనే అందుకుని,

"అక్క చెల్లెండ్రు మీకు
మిక్కిలి సౌందర్య శాలురమ్మా
మా తమ్ములా నలుగురిని వలపించు
జాణలకు దృష్టి తగులా...."

అంటూ మరదళ్ళ జాణతనాన్ని ఎత్తిపొడిచింది !

అయితే, పెద్ద మరదలు సీతకు ఈ ఎత్తిపొడుపులో అనుకోకుండా ఒక పట్టుగొమ్మ చిక్కినట్లయింది ! దానిని వెంటనే దొరక పుచ్చుకుని-

"మా యన్న ఋష్యశృంగు మనస్సులో
కూడి యెడ బాయకున్న
ఏమి యెరుగని తపసిని-ఓ వదినె
కేళించి విడిచినావూ !"

అని సూటిగా విసిరేటప్పటికి - ఘోటక బ్రహ్మచారి ఋష్యశృంగుడిని - వలచి వలపించుకున్న శాంత-తానెంత మాటకారి అయినా, ఏమి సమాధానం చెప్పగలుగుతుంది !

అది-త్రేతా యుగంలో-శాంతకూ, సీతకూ-నిజంగా జరిగిన సరస సంభాషణమేనా - అని తర్కించే వారికి సమాధానం చెప్పటం కష్టం, కాని, ఒక్క మాట మాత్రం

నిజం! తెలుగు పడుచుల గుండెలలో ఉబికి వచ్చే హాస్య ప్రియత్వం-ఆ పురాణ పాత్రలకు అలా ఆపాదించుకుని - మనస్సును రాగ రంజితం చేసుకున్న మధుర భావన మటుకు అవును!

అలాగే-బావా మరుదులమధ్య కూడా, వరుసలాడు కోవడం కద్దు. మన పల్లెటూళ్ళలో, ఇప్పటికీ, పడుచు వారయినా ముసలి వారయినా-బావా మరుదుల మధ్య, సమార్ద్రమయిన, సరస భూయిష్టమైన సంభాషణలు దొర్లుతూ వినవస్తుంటాయి. ఈ సల్లాపం-వినేవారి మనస్సులను కూడా రంజింప చేసేదిగా ఉంటుంది. వరివంగడం గురించి అయినా, వంశాంకురంగా వెలిసిన మునిమనవడి ముద్దు ముచ్చటల వరకు-వారేది మాట్లాడుకున్నా ఒక విసురు, ఒక విరుపు వినవస్తూ-వినేవారిని వివశులను చేస్తూనే ఉంటుంది.

మన పురాణాల మాటకు వస్తే-ముందుగా మనకు గుర్తుకు వచ్చే బావా మరుదులు కృష్ణార్జునులే! వారిద్దరి మధ్య ఎన్ని సరాగాలు, సరస సంభాషణలు! ఎన్ని రహస్యాలు! అదంతా ఏకరువు పెట్టాలంటే - అది ఒక మధుర గాథాలహరి!

ఇహ, ప్రేయసీ ప్రియులమధ్య, భార్యాభర్తల మధ్య-శృంగార పరమైన హాస్యానికీ, చమత్కారానికీ, లోటు ఏముంటుంది! అందునా, హాస్య ప్రియులైన తెలుగు లోగిళ్ళలో!

పల్లెటూరి కాలవ వొడ్డు. ఒడ్డున కూర్చుని నీళ్ళల్లోకి పాదాలు ఆడిస్తూ, కోర మీసాల చిన్నవాడిని ఆట పట్టిస్తూ పడుచుపిల్ల రాగం తీస్తుంది.

"ఒకరికీ చేతులిచ్చాన్
ఒకరికీ కాళ్ళూ ఇచ్చాన్
ఒకరినీ చేతా బట్టీ
కూకున్నానోయ్ బావా
కూకున్నానోయ్ ........"

పడుచు గుంటడికి నిజంగానే కాళ్లూ చేతులూ ఆడకుండా పోయి "ఏమిటేమిటీ! ...." అంటూ ఆవేళ పడతాడు పాపం!

ఆ కొంటె పిల్ల అతగాడి ఆరాటానికి విరగబడి నవ్వుతూ—

"గాజులకీ చేతూ లిచ్చాన్
కడియాలకి కాళ్ళనిచ్చాన్
డబ్బుల్నీ చేతాబట్టీ
కూకున్నానోయ్ బావా
కూకున్నా నోయ్! ...."

అనేటప్పటికి-ఆ కోర మీసాల కుర్రవాడితో పాటూ, మనమూ నవ్వేయకుండా ఉండగలమా!

ఇది ప్రేయసీ ప్రియుల మధ్య జరిగే సరాగానికి మచ్చు తునక. భార్యాభర్తల మధ్య సాగే సరస సల్లాపాలు కూడా

ఇంతకు ఏమీ తీసిపోనివి గానే ఉంటాయి. అవి పడుచు జంట లయినా, పొద్దు పడమటికి వాటారిన ముసలి జంటలయినా, హాస్యోక్తుల విరివాన వారి మధ్య ఎప్పుడో ఒకప్పుడు విరియ కుండా ఉండదు!

భార్యా భర్తల మధ్య సరాగం-అనగానే, ముందుగా మన కళ్ళముందు సాక్షాత్కరించేది మునిమాణిక్యం వారి కాంతమే! ఆమె పదహారణాలా తెలుగుతనం మూర్తీభవించు కొన్న ఇల్లాలు. కాంతంవంటి ఇల్లాలు తెలుగుజాతి పండించు కొన్న పుణ్యాల పంట. సరసతలో, వాక్చతురిమలో, స్నేహ గరిమలో-భర్తకు అనురక్తురాలై, అతడిని వశవర్తునిగా చేసుకొన్న చతురురాలు. ఆవిడ ఈ కాలపు చదువులు చదవలేదు. కాని, ఆవిడ వేసే సవాళ్ళకు ఆవిడ భర్తేకాదు-ఏ లాయరూ జవాబు చెప్పలేడు. అంతటి విజ్ఞత గడించుకొని, ఇంటిని స్వర్గతుల్యం చేసుకొన్న మహిళా రత్నం ఆమె. తెలుగు జాతి ఉన్నన్నాళ్ళూ, కాంతం వంటి ఇల్లాళ్ళు ఉంటారు! భర్తలతో సరసాలు ఆడుతూనే ఉంటారు.

భార్యలతో సరాగాలాడటం మాత్రం మనకు క్రొత్త సంగతా! భక్తిరసం తేనె వాకలుగా చిలికి చిందించిన భాగవతంలో-పోతన్నగారు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడి సరసతనే-ఎంత మనోహరంగా వర్ణించాడో చూడండి!

అలవైకుంఠ పురంలో, నగరిలో, ఆ మూలసౌధంబు దాపల, మందార వనాంతర ప్రాంతంలో ఎక్కడో ఉన్నాడు శౌరి. పర్యంకం మీదనే పవ్వళించి ఉన్నాడు. సరే, రమతో ఏ సరాగాలో ఆడుతూనూ ఉన్నాడు.

అంతవరకు బాగానే ఉంది. గజేంద్రుడి మొర 'పాహి పాహి' అనే ప్రార్థన వినవచ్చింది. ఉన్నట్లుండి దిగ్గున లేచాడు. ఎదురుగా ఉన్న భార్యతోనూ, నేను ఫలాన చోటుకు వెళ్ళి వస్తానని అనడు! శంఖచక్రాలకూ, మరి ఇంకా ఏ ఇతర పరివారానికీ చెప్పడు. ఏదో అర్జంటు పని వచ్చి ఉంటుందని పాపం-వాళ్ళందరూ సరిపెట్టుకున్నారు.

కాని, వచ్చిన చిక్కల్లా పాపం-లక్ష్మీదేవికే. పరిహాసానికో, వినోదానికో-భార్య చేలాంచలం తన ఉత్తరీయపు చెరగుకు ముడివేసుకున్నాడట! అది మరిచిపోయి, అదేపనిగా పరుగెడుతూ ఉండే భర్తను. చిడి ముడి తడబడు అడుగులతో అనుసరించక తప్పలేదు సిరికి! ఈ దృశ్యం ఎంతో ఇంపుగా, సొంపుగా-పోతన్నగారి కలం మనకు చిత్రిస్తుంది.

ఇక్కడ ముఖ్యాంశం శ్రీమన్నారాయణుడి ఆపన్న ప్రసన్నత్వమే! కాని రసజ్ఞుల మనస్సులను గిలిగింతలు పెట్టేది మాత్రం వివాద ప్రోత్థిత శ్రీ కుచోపరిచేలాంచలమే! భార్యా భర్తృత్వ సంబంధంలో అడుగడుగునా ఈ వివాదం, ఈ వినోదం-చోటు చేసుకుని-వారి దాంపత్యజీవనానికి రస స్పందనను సంతరించి పెడుతూ ఉంటుంది.

సీతా రాముల కథ జగద్విఖ్యాత మైనది. రామయ్య తెలుగు వారి ఇలవేలుపు. సీతమ్మ తెలుగు వారింటి ఆడ పడుచు. వారి కథ ఇంటింటి కథ.

కొత్తగా కాపురానికి వచ్చిన కోడలు సీత. అత్త మామలకు, పిన్నత్తలకు-పరిచర్యలు చేసి, పని తెముల్చుకునే సరికి జాము ప్రొద్దుపోయింది. అప్పుడు శృంగారం చేసుకుని

కస్తూరి జవ్వాది ఘుమఘుమలు పులుముకుని పడకటింటికి చేరేటప్పటికి ఊరు మాటు మణిగింది! ఈ సంప్రదాయమే-పూర్వపు ఉమ్మడి కుటుంబాలలో ఇల్లాళ్ళు పాటిస్తూ ఉండేవారు.

కొత్తపెళ్ళికొడుకు మీనమేషాలు లెక్కిస్తూ అంత సేపు భార్యకోసం వేచి ఉండాల్సి వచ్చింది! రామయ్యకు ఓర్పు తగ్గింది. చిరుకోపం వచ్చింది. భార్య వస్తూ ఉన్నజాడ కనిపెట్టి, తలుపు గడియ పెట్టి నిద్రపోతున్నట్లు నటిస్తూ పవ్వళించాడు.

" నిలుచుండ పాదాలు చేతులూ నొచ్చె
దంతంపు తలుపులూ తీయవోయి నాథ!"

అంటూ భర్తగారిని వేడుకొంటుంది. లోపల నుంచి ఉలుకూ పలుకూ లేకపోయేటప్పటికి-

"నాలుగో జామాయె నా ప్రాణ నాథ
కరుణించి తీస్తివా కాళ్ళకడనైన
మరచి ఒక నిద్రైన శరణంది పోదు!"

అని బ్రతిమాలు కుంటుంది. రామయ్య బిర్ర బిగిసి అంటాడూ——

" నిద్ర లేకుంటె నాకేమి సీత
గంటవలె దీపమ్ము అది నాకు తోడు
నీవు నిల్చుంటేను నాకేమి సీత
పట్టె మంచము పరుపు అది నాకు తోడు!"

ఇది పెళ్ళాన్ని ఏడిపించటానికి ఆడే సరసం. ఇది తెలుగింట ప్రతి జంటకూ ఎప్పుడో ఒకప్పుడు అనుభవంలోకి వచ్చే మధుర శృంగారం. ఇది తెలుగువారు ఆదర్శ దంపతులుగా కొలుచుకునే సీతారాములకు ఆపాదించుకొని, తమకు తాము మధురానుభూతిని పొందే శృంగార రసభావం!

జాతి జీవన విధానానికి దర్పణం వంటిది జానపద సాహిత్యం. ఈ పల్లె పదాలలో మనకు అన్ని రసాలతో పాటు హాస్యము, శృంగారము సమ పాళ్లుగా కలిపిన దివ్య భావన గోచరిస్తుంది.

భార్యా భర్తల మధ్య, భార్యా భర్తల మధ్యనేకాక-నిత్య జీవితంలో ఎక్కడపడితే అక్కడ హాస్య రసాన్ని సృష్టించుకుని తాను నవ్వుకుని, ఎదుటివాడిని నవ్వించగల హాస్యశీలి తెలుగబ్బి!

సాహిత్యంలో హాసం: మన పురాణాల దగ్గర నుంచి-భానుమతి వ్రాసిన 'అత్తగారి కథలు' వరకూ మన సాహిత్యంలో హాస్యరసం అక్కడక్కడా చిప్పిలుతూనే ఉంటుంది.

కాని మన పురాణాలలో, ప్రబంధ కావ్యాలలో కనిపించే హాస్యం కొంతవరకు తక్కువనే చెప్పాలి. అది రేఖా మాత్రంగా-భారతంలో, భాగవతంలో మనకు కానవస్తుంది.

భారతం-ఆది సభా పర్వాలలో నన్నయ భట్టారకుడు ఆయా ఘట్టాలలో సునిశితమైన హాస్యం చొప్పించిన సందర్భాలు ఉన్నవి. విరాట పర్వంలో బృహన్నల వేష

ధారణపట్ల, భీముని వంటలవాని వేష వర్ణనపట్ల, కీచక వధ ఘట్టంలోనూ, ఉత్తర గోగ్రహణ వర్ణనలోనూ, తిక్కన కూడా చక్కని హాస్య ధోరణిని ప్రదర్శించి తన హాస్య ప్రియత్వాన్ని చాటుకొన్నాడు.

పోతన్నగారి బాలకృష్ణుడు చేసిన చిలిపిపనులన్నీ నవ్వు పుట్టించేవే!

"ఓయమ్మ నీ కుమారుడు
మా యిండ్లను పాలు పెరుగు మననీడమ్మా"

అని యశోదమ్మకు ఫిర్యాదు చేసుకుంటున్న గోపికల స్థితి ఊహించుకుంటేనే మనకు నవ్వు వస్తుంది.

"నాపట్టి పొట్ట నిండగ
పైపడి నీ పట్టి వెన్న బానెండిడి నా
డూపిరి వెడలదు వానిం
జూపెద నేమైన నీవ చుమ్ము లతాంగీ!"

ఈపని చేసినవాడు ఎవడో మరెవడో కాదు. తెలుగువారి బుడుతడు బాలకృష్ణుడు. అందుచేతనే వాడు చేసిన, ఈపనికి మనకు కోపంరాదు సరికదా-నవ్వు దొంతరలే దొర్లుతాయి.

శ్రీనాథుడు ఎంతటి కవి సార్వభౌముడో అంతటి రసజ్ఞుడు, సరసుడు, చమత్కారశీలి. సాహిత్యంలో హాస్య రసానికి తగిన ప్రాధాన్యం ఇచ్చి-తన హాస్య ప్రియత్వాన్ని చాటుకొన్నాడు. గ్రామ సంచారాలలోనూ, కవితా గోష్ఠుల

లోనూ-శ్రీనాథుడు చెప్పిన ఎన్నో చమత్కారమైన పద్యాలు ఇప్పటికీ చక్కని చాటువులుగా ప్రజలమధ్య నిలిచిపోయినవి. అనేక సందర్భాలలో అక్షర జ్ఞానం ఉన్న తెలుగువారు-ఈ చాటువులను సందర్భోచితంగా ఉపయోగించుకుని కడుపారా నవ్వుకోవటం పరిపాటి అయిపోయింది.

శృంగార నైషధంలో నల దమయంతుల వివాహం మహా అట్టహాసంగా, వైభవంగా జరిగిన ఘట్టం వర్ణించి నప్పుడు-ఆ సందర్భంలో జరిగిన బువ్వపు బంతులాటనూ, విందు భోజనాన్నీ కవి ఎంత చిత్రంగా వర్ణించాడో చిత్తగించండి!

"ఓమె యేమె యివేమేమె లేమ, యేమె
మేఘ పుష్పంబుదే! వంచు మేలమాడ
మేమె మేలు దలంచయ్యె మేలు మేలు
మేక మేకన సభవారు మిగుల నగిరి!"

విందు భోజనాలకు కూర్చున్నారు పెళ్ళికి వచ్చిన జనం. విందులో ఎన్ని కమ్మని వ్యంజనాలు వడ్డించారో కాని; తినేవారికి గొంతు పట్టేసిందట పాపం! మంచినీళ్లు కావలసి వచ్చాయి. వడ్డన చేస్తూ ఉన్న వయ్యారుల్ని చూస్తూ-" ఓమె! అమ్మాయి - ఏమె! లేమా! మేఘపుష్పం (మంచినీళ్ళు) కావాలి! "....అని భోక్తలు-ముద్దమింగుడు పడకుండా అవస్థ పడుతూ అడుగుతూ ఉంటే-ఆ అందగత్తె లకు నవ్వు ముంచుకు వచ్చింది, 'మెమె మేలు' ఎక్కు వైనాయి. 'బాగుబాగు! ఎక్కడో మేకల్లాగు ఉన్నారే!'

....అంటూ చమత్కరించగా-అక్కడి వారందరికి ఫెళ్ళున నవ్వు వచ్చి ఉంటుంది। తినేవాళ్ళకు ఆ నవ్వులో పొలమార కుండా ఉంటుందా!

సరస సంభాషణం, అందుతో పాటూ శబ్దవైచిత్రి! ఈ కూర్పు కవి సార్వభౌములకే చెల్లింది!

పల్నాటి సీమలో పర్యటిస్తూ - కవిసార్వభౌముడు అక్కడి ప్రజల అనాగరికత చూచి-సున్నితంగా-ఇలా నవ్వు వచ్చేట్లు వర్ణించాడు.

"రసికుల కేలా। పల్నా
డెసగెడు నా రంభ యైన నేకులె వడుకున్ ।
వసుధేశుడైన దున్నును
కుసుమాయుధుడైన జొన్నకూడే కుడుచున్ ।"

ఏకులు వడుకుతూ ఉన్న రంభనూ, జొన్నకూడు కుడుస్తూ ఉన్న కుసుమాయుధుణ్ణీ-ఊహించుకుంటే నవ్వు రానిదెవరికి!

అలాగే, భోజన ప్రియుడైన రామయ మంత్రిపై శ్రీనాథుడు పరిహాసంగా చెప్పిన పద్యపాదం-

"మా రామయ మంత్రి భోజన పరాక్రమ మేమని చెప్ప
వచ్చునా
స్వామి యెరుంగు దత్క బళ చాతురి తాళఫల ప్రమాణముల్!"

రామయ మంత్రినైతే వెక్కిరించాడు కాని, శ్రీనాథుడు కూడా భోజన ప్రియుడే! మహారాజుల సరసను

కూర్చుని అనేకసార్లు రాజభోజనం ఆరగించిన వాడు. జొన్నన్నం తినవలసి వస్తే గొంతు పట్టుకుంటుంది. అలాగే, చింతకాయ కలిపిన బచ్చలి కూర! సరసుడూ పైపెచ్చు మహాకవి కనుక-ఎక్కడో వ్రేపల్లె వాడలోనో, ద్వారకా నగరంలోనో-హాయిగా వేణుగాన లోలుడై కూర్చున్న ఫుల్ల సరోజ నేత్రుడిని సవాలు చేస్తాడు.

"ఫుల్ల సరోజనేత్ర! అల పూతన చన్నుల చేదు ద్రావి నా
నల్ల దవాగ్ని మ్రింగితి నటంచును నిక్కెదవేల! తింత్రిణీ
పల్లవ యుక్తమౌ నుడుకు బచ్చలి శాకము జొన్నకూటిలో
మెల్లన యొక్క ముద్ద దిగమ్రింగుము! నీపస కాన నయ్యెడిన్"

మరి ఆ ఫుల్ల సరోజనేత్రుడు దీనికి ఏమి సమాధానం చెప్పాడో! వెన్న ముద్దలు మ్రింగటమంత తేలిక కాదుగా ఇది!

పల్నాటి సీమలో సంచారం చేస్తూ-శ్రీనాధుడు నీటి చుక్కకు కూడా కరువు పడినాడేమో! పరమేశ్వరునిపైకి చమత్కారంతో కూడిన విసురు విసురుతాడు!

"సిరిగల వానికి చెల్లును
తరుణుల పదియారు వేల తగ పెండ్లాడన్
తిరిపెమున కిద్దరాండ్రా
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్"

పరమేశ్వరునితో పరిహాసం ఆడి, తనకు కావలసిన వరాన్ని సాధించుకో గల ధీశాలి ఆ మహాకవి!

హాస్యరస భూయిష్టమైన శ్రీనాధుల చాటూక్తులు-తెలుగు జాతి భద్రంగా పదిల పరుచుకొంటుంది. ఆయా సందర్భాలలో మననం చేసుకుని మనసారా నవ్వుకొంటుంది!

"ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు
భూసురేంద్ర !........"

అనే పద్యపాదం చదువుతూ ఉండగానే-వరూధిని చేత ఇంత సరసంగా మాట్లాడించిన పెద్దన్నగారి వాక్చమత్కృతికి మనకు ముసిముసిగా నవ్వు రాక మానదు.

కవికులంలో-హాస్యరసపు పోకడలను గురించి తలచినప్పుడు-ముందుగా మన మనస్సులోకి వచ్చేది-వికటకవి గా పేరుపొందిన తెనాలి రామకృష్ణుడు.

శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలో, కవి పండిత గోష్టులలో-ఆనాడు తెనాలి రామకృష్ణుడు వెదజల్లిన హాస్యం-ఈనాటికీ కథలుగా-గాథలుగా బహుళ ప్రచారంలోకి వచ్చి తెలుగు ప్రజానీకాన్ని రంజింప చేస్తున్నాయి. మన ముందు తరాలలో కూడా, చమత్కార ప్రియులైన తెలుగువారి ఇళ్ళల్లో-ఈ తెనాలి రామకృష్ణుని హాస్యపు కథలు నవ్వుల పువ్వుల్ని వెదజల్లుతూనే ఉంటాయి.

"మేక తోకకు మేక తోక మేకకు తోక
మేక తోకకు మేక తోకమేక ...."

అనే పద్యం చదవేటప్పటికి ఫక్కున పొంగి వచ్చే నవ్వును ఆపుకోవటం ఎవరితరం!

నిన్న మొన్నటి సంగతికి వస్తే-హాస్యరసానికి తెలుగు సాహిత్యంలో తగిన స్థానం ఆపాదించి పెట్టినవారు కందుకూరి వీరేశలింగం పంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, గురజాడ అప్పారావుగారు అని చెప్పవచ్చు.

ఆనాటి సాంఘిక దురాచారాలను మూలంగా తీసుకుని-వారు రచించిన అనేక నాటికలలో, గల్పికలలో, ప్రహసనాలలో చమత్కారం ఉట్టిపడుతుంది. హాస్యరసం చిందులాడుతుంది.

గురజాడవారి కన్యాశుల్కంలో-మొదటి నుంచి చివరి వరకూ, చిక్కని హాస్యం తొంగిచూస్తూ, పన్నీటి తుంపురులను మనపై వెదజల్లినట్లు ఆహ్లాదాన్ని కలగజేస్తుంది. కన్యాశుల్కంలో ఎదురయ్యే పాత్రలన్నీ-మనం ఎక్కడో ఒకచోట చూచినవే! ఎప్పుడో ఒకప్పుడు ఎరిగినవే! అందులోని ప్రతిపాత్రా-అప్పుడప్పుడూ మనను డొక్కలు చేతితో పుచ్చుకుని నవ్వేట్లు చేస్తుంది.

"ఖగ పతి యమృతము తేగా
భుగ భుగ మని పొంగి చుక్క భూమిని వ్రాలెన్
పొగ చుట్టయి జన్మించెను
పొగ త్రాగనివాడు దున్నపోతై పుట్టున్ !"

అంటూ, శిష్యుడికి జ్ఞానబోధ చేసే గిరీశంపైన ఎందుకో మనకు కోపం రాదు! పైగా అతగాడి కవిత్వానికి నవ్వు వస్తుంది.

"ఫుల్లు మూను లైటటా
జాసమిన్ను లైటటా
మూనుకన్న మొల్లకన్న
నీదు మోము బ్రైటటా !"

ఇంగ్లీషునీ, తెలుగునీ-ఇంత సొంపుగా మిళితం చేసి, చక్కని హాస్య సృష్టి చేసిన గురజాడ మన తెలుగువాడు !

పానుగంటివారి 'సాక్షి' నిండా ఎన్నో వాక్చమత్కారాలు కనిపిస్తాయి. వారి 'కంఠాభరణం' హాస్యపు పుట్ట ! చిలకమర్తివారి 'గణపతీ' మునిమాణిక్యంవారి 'కాంతం కథలూ' అటువంటివే !

గిరీశంతోపాటు మనమధ్య ఒక మనిషిగా మెసులుతూ ఇప్పటికీ, ఎప్పటికీ మనను నవ్విస్తూ ఉండే బారిష్టరు పార్వతీశం మన తెలుగువాడే ! నర్సాపురం తాలూకా మొగలితుర్రు గ్రామంలో పుట్టి, తాటాకూ, కచ్చికా ట్రంకుపెట్టెలో సర్దుకొని-లండన్ మహానగరంలో బారిస్టరీ చదవబోయిన మన కుర్రనాగన్న - మొక్కపాటి నరసింహ శాస్త్రిగారి అపూర్వ సృష్టి. ఎప్పటికీ-తెలుగునాట ఎక్కడో ఒక మూల ప్రత్యక్షం అయి-అందరినీ పకపక నవ్వేట్లు చేస్తూనే ఉంటాడు బారిష్టరు పార్వతీశం !

తెలుగునాట మాటాడ నేర్చిన బుడుతడికి-ముందుగా నోటికి వచ్చేది వేమన్న శతకమే ! తేట తెలుగు మాటలతో-జీవిత సత్యాన్ని ముక్కుకు సూటిగా చెప్పటం వేమన్న

ప్రత్యేకత. ఆ పద్యాలలో వాడితనంతో పాటు-హాస్యరసం-తొంగి చూస్తూ ఉంటుంది.

"పాల సాగరమున బవ్వళించిన స్వామి
గొల్ల యిండ్ల పాలు కోరనేల!
ఎదుటివారి సొమ్ము ఎల్లవారికి తీపి
విశ్వదాభిరామ వినురవేమ!"

అన్నప్పుడూ—

"చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలి ముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత కాదయా!"

అన్నప్పుడూ—

"వేష భాష లెరిగి కాషాయ వస్త్రాలు
కట్టగానే ముక్తి కలగబోదు
తలలు బోడులైన తలపులు బోడులా!"

అంటేనూ - పరమ సత్యాన్ని ఎంత సున్నితమైన హాస్యంతో వ్యంగ్యంతో జత చేసి చెప్పాడు! .... అని మందహాసం చేయకుండా ఉండలేము.

శంభో శతకంలో కవి (మల్లాది శివరాంగారు) అప్రియమైన దురాచారాన్ని-ఇప్పటికీ సంఘంలో కంటకప్రాయంగా ఉన్న వరకట్నాన్ని ఎంత సరసంగా దుయ్యపడుతున్నాడో చిత్తగించండి!

"గణపతికి పెండ్లి చేయవు
'మని' లేదా! మాకు పంపు మగవాడు కదా
కను ముక్కు తీరు లేకున్నను, భువి కట్నంబు
లెదురు నడచును శంభో!"

"పరమేశా! ముద్దుల కుమారుడు కదా! గణపతి బాబుకు పెళ్ళిచేయవేమి? కను ముక్కుతీరు సరిగా లేక పోయినా పరవాలేదయ్యా! మా లోకంలో మగపుట్టుక పుట్టిన వాడయితే చాలు-కట్నాలు వెతుక్కుంటూ వస్తాయి. గణపతిని మా వద్దకు పంపించేయి! వరకట్నం ఇచ్చి పిల్లనివ్వటానికి క్యూలో నుంచుంటారు ఆడపిల్లల తండ్రులు!" ....అంటూ మెత్తమెత్తగా చురక అంటిస్తూ మనసాంఘిక దురాచారాన్ని శంకరుడి ముందు పరిచి పెడతాడు కవి.

ఎంతటి క్లిష్ట సమస్యను ఎదుర్కోవలసి వచ్చినా, ఎంతటి దయనీయమైన దీనస్థితిలో ఉన్నా, తెలుగువాడు, వీడని చిరునవ్వుతోనే-ఆ సమస్యను ఎదుర్కొంటాడు.

మధ్య తరగతి గృహస్థు. దినదిన గండంగా కాలం గడుపుకొస్తున్న అతగాడికి ఎంత కోరిక ఉంటే మాత్రం హంస తూలికా తల్పం ఎక్కడి నుంచి వస్తుంది? ఉన్నది చాలీ చాలని కొంప. కొంపనిండా గంపెడు పిల్లలు. బక్క చిక్కిన ఇల్లాలు - జోలెగా అయిపోయిన కుక్కిమంచం. మాసిన దుప్పటి, పడుకుంటే నిద్రపట్టదు. పగలంతా పని చేసి వచ్చిన శరీరమైనా విశ్రాంతిగా పడుకోవటానికి వీలు కాదు. నిద్ర ఎట్లా పడుతుందీ! మంచం నిండా, ప్రక్కనిండా

నల్లులు-ఉన్న బాధలు చాలవన్నట్లు జలగల్లా పీక్కు-ని తింటున్నాయి!

ఆ స్థితిలో-ఎవరికైనా హాస్యం జోలికి పోతుందా మనస్సు-ఒక్క తెలుగు వాడికి తప్ప!

"శివుడద్రిని శయనించుట
రవి చంద్రులు మింట నుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపై
పవళించుట నల్లి బాధ పడలేక సుమీ!"

అంటూ, అప్పుడే ఏదో పరమ సత్యం బోధపడినట్లు తల పంకించి నవ్వుకుంటాడు!

మధ్యతరగతి వాడి అవస్థలు ఇన్నీ అన్నీ కావు! అతడి బాధ అతడికే తెలుస్తుంది। చాకలి వాడికి ఒక్క జత బట్టలు వేస్తే మిగిలింది మరొక్కటే। అదీ చిరుగుల బొంత అయిపోయింది. అన్నీ అతుకులూ మాసికలూ. ఎన్నాళ్ళున్నా ఆ రజక చక్రవర్తి ఆ మాసిన బట్టల్ని శుభ్రం చేసుకురాడు। ఎన్నాళ్ళో-లెక్క తెలియ నన్ని నాళ్ళు గడిపిన తర్వాత-ఆ చాకలి వాడు బట్టలు తెచ్చి ఇచ్చాడు దయ తలచినట్లు। ఆ జత బట్టలను విప్పి చూస్తే-వాటి రూపమే గుర్తుపట్టలేనంతగా మారి పోయింది। అన్నీ చిరుగులు, జీర్ణవస్త్రమై పోయింది।

అంతటి దయనీయమైన స్థితిలో ఉన్నా, వేదాంత దృష్టినీ, అందులో మిళాయించిన హాస్య ప్రియత్వాన్ని మరువడు మనవాడు!

"చాకలి వానితో, జగడాలు పడలేక
సిరిగలాడు పట్టుచీర గట్టె
శివుడు తోలు గప్పె సీ యని మదరోసి
భైరవుండు చీర పారవైచె!"

అనుకుని నవ్వుకుంటాడు-అటు పట్టుచీరలూ కట్టలేని-ఇటు 'సీ' యని చీర పారవేయలేని తెలుగన్న!

'నిద్ర సుఖమెరుగదు-ఆకలి రుచి యెరుగదు-' అంటారు కాని-చీమ చిటుక్కు మంటే నిద్ర లేచిపోయే వాడికి నిద్రాసుఖం మాత్రం ఏమి దొరుకుతుంది! ఒక వైపున పిల్లల ఏడుపులు, ఇంకొక వైపున రోడ్డు మీద రొదలు మనసునిండా అల్లుకు పోయిన అలజడి చేసే వేయిన్నొక్క సమస్యలు! అలా నిద్రపట్టక తన్నుకుంటుండే సమయంలో కూడా తెలుగు వాడు హాస్య ప్రియత్వాన్ని విడువలేదు. హరినీ మరువలేదు!

"కలశపయోధి మీద దరగల్ మరి హోయని మ్రోయ
వేయు భం
గుల తలపాన్పు పాము బుసకొట్టగ నే గతి నిద్ర చెందెదో
యగల పత దండ్రి! చీమ చిటుకన్నను నిద్దుర రాదు
మాకు నో
జలజదరీ! కుహర భాస్వదరీ యదరీ దరీ హరీ!"

—కందుకూరి రుద్రకవి

అనుకుంటూ, హరిని సానుభూతిగా పలకరించు కుంటాడు నిద్రపట్టని ఆ నిశీధిని!

సామాన్యుడి జీవితంలో ఇటువంటి సంఘటనలు అనేకం. ఎదురువచ్చే చికాకులను విడని చిరునవ్వుతో ఎదుర్కొంటూ పోతూ, తనకు తానే సర్ది చెప్పుకుంటాడు. ఆ చెప్పుకున్నవి జాతి జీవనంలో సామెతలుగా నిలిచి పోయినవి.

ఎన్ని ఈతి బాధలున్నా, వేళకు ఇంత కబళం కడుపులో పడాలి! లేకపోతే బండి నడవదు। అందుకే—

"ఏ పాటు తప్పినా సాపాటు తప్పదు!".... అనుకుంటూ జీవితంతో రాజీ పడతాడు. ఏదో విధంగా పొట్ట నింపుకునే ప్రయత్నం చేస్తాడు.

ఇంట్లో ఎన్ని చింతలున్నా, రోగాలున్నా, వేళకు ఇంత తిండి తినే కార్యక్రమం మాత్రం తప్పదు!

"అందరకూ అన్ని రోగాలు-అడ్డ తప్పేలాకు ఏ రోగమూ లేదు" అనుకుంటూ నవ్వుకోవటం తెలుసు తెలుగు వాడికి.

"అగ్రహారం పోతే పోయింది కాని ఆకట్టు బాగా తెలిసింది!" అన్నాడట-అన్నీ పోగొట్టుకున్నా, హాస్యం వదల్లేని కోర్టుపక్షి! మరొక విధంగా-తనకు జరిగిన మేలు-ఆకట్టు తెలుసుకోవటం జరిగిందని సంతోషిస్తాడు పాపం! ఎంత సరస వాదం!

ఇట్లా ఉదహరించుకుంటూ పోతే-ఈ నిడివి చాలదు. మన సామెతల్లో అనుభవం రంగరించి పోసిన సత్యాలతో పాటూ-హాస్యరసం అంతర్గతంగా దర్శన మిస్తూనే ఉంటుంది!

జీవితంలో ఏ సమస్యను ఎదుర్కోవలసి వచ్చినా, సణక్కుండా గొణక్కుండా, విరసాన్ని కూడా సరసంగా మార్చుకుని-తాను మందహాసం వీడకుండానే-ఎదుటి వాడిని ముసి ముసి నవ్వులు నవ్వించడం తెలుసు తెలుగువాడికి.

మన వీధి నాటకాలలో, పగటి వేషగాళ్ళ వేషాల్లో, తోలుబొమ్మలాటలలో, హరికథా కాలక్షేపాల్లో, బుర్ర కథల్లో-ఎక్కడ చూదినా హాస్యం చిందు లాడుతూనే ఉంటుంది.

హరికథలో పిట్టకథలు-ఎంత హాస్య స్ఫోరకంగా ఉంటే శ్రోతలు అంత ఆసక్తిగా వింటారు. అల్లాగే-తెలుగువారికి నవ్వు తెరల్ని తెప్పించే 'కేతిగాడు'-'బంగారక్క'-తోలుబొమ్మలాటలలో తైతక్కలాడే, హాస్య పాత్రలు.

"తమల పాకుతో తా నిట్లంటే
తలుపు చెక్కతో నే నిట్లంటిని !"

ఇది ఎప్పుడో ఒకసారి భాగవతులు వీధి నాటకంలో వినిపించే సరసమేనా? కాదు !

ఇప్పటికీ....ఎప్పటికీ....

కాఫీకప్పు బల్లమీద పెట్టి, జడ తిప్పుకుంటూ వెనక్కు తిరిగే పెళ్లాన్ని దొరకపుచ్చుకుని, ఏదో వంకతో తెలుగు వాడు నిత్యమూ ఆడుకునే సరసమే ఇది:— * * *

# ఆహార విహారాలు

" అమ్మనన్న ముద్దును ఏమన్నారు
అచ్చనావుల పాలన్నారు
అప్పుడు కాచిన నెయ్యన్నారు
దోరగ వేగిన గారన్నారు
పాకము వచ్చిన అరిశన్నారు
పటిక పంచదార పొడన్నారు !"

అన్నీ మధురమైన పదార్థాలే! అచ్చమైన తెలుగు రుచులే! చంకలో ఎగిరెగిరి పడుతూ, అన్నం తినకుండా పేచీలు పెట్టే పాపాయి ముద్దులూ అంత తియ్యనివే! మెత్తగా వండి, పప్పూ, నెయ్యీ వేసి కలిపిన గోరుముద్దలు తినిపిస్తూ-పాపాయి తల్లి వాకిట్లోకి రాగానే, ముందుగా నింగిలో అల్లీ బిల్లీ తిరిగే చందమామ ఎదురౌతాడు. పాపాయిని చూచినా చందమామను చూచినా ఆమెకు ఒకే పొంగు! పైడి గిన్నెలో పాలూ, వెండి గిన్నెలో పెరుగూ జాబిల్లి చేత తెప్పించి బిడ్డకు పెట్టుకోగల నేర్పు తెలుగు తల్లికే చెల్లింది. పాడి పంటలకు కాణాచి అయిన తెలుగు దేశంలో-అలా పాలతో పెరుగుతో-పెరిగిన ఆ పిల్ల తప్పట

డుగులు నేర్చిన దగ్గర నుంచీ గుజ్జెన గూళ్ళు వండ నేర్చి ఉంటుంది. చిన్న చిన్న లక్క పిడతల్లో బియ్యం, పప్పూ, చింతపండు, బెల్లం ముక్కలు-అమ్మనడిగి తీసుకు వచ్చి-అన్నమూ కూరలూ ఆరిందాలా వండి అందరికీ వడ్డిస్తుంది.

పసిపిల్లలకు ఆరునెలలు వచ్చిన దగ్గర నుంచీ మన వాళ్ళు అన్నం ముట్టించటం-లేక అన్న ప్రాశన-అనే పేరుతో వేడుక చేస్తారు. అప్పటి నుండీ బ్రతికి నన్నాళ్ళూ ఆ బిడ్డకు అన్నంతో సంబంధం ఏర్పడి ఉంటుంది.

వర్షం కురిస్తే పసివాడికి కూడా తెలుసు-అది తమ జీవనాధారమైన అమృతధార అని. మనది వ్యవసాయ ప్రధానమైన దేశం కనుక-వరిచేను పండటానికి ప్రధానంగా కావలసింది వర్షమేనని తెలియని తెలుగు బిడ్డ ఉండడు. అందుకే-ఆనందంగా వానలో తడుస్తూ-చప్పట్లు కొడుతూ-

"వానలు కురవాలి-వరిచేలు పండాలి
బుడుగో బుడుగో !
మా గాదె నిండాలి మా దాసి దంచాలి
మా అమ్మ వండాలి మా బొజ్జ నిండాలి
బుడుగో—బుడుగో !"

అంటూ పాటలు పాడుకుంటారు పిల్లలు. బొజ్జ నిండాలంటే అమ్మ వండి పెట్టాలి. వండటానికి ధాన్యం దాసీది దంచాలి. దంచటానికి ధాన్యం గాదె నిండా ఉండాలి. గాదె నిండాలంటే వరిచేలు పండాలి. వరి పండాలంటే వానలు

కురవాలి. ఈ సూత్రం మాటలు వచ్చిన దగ్గర నుండీ నేర్చి ఉంటాడు తెలుగు బుడుతడు.

వానలు సకాలంలో కురవక పోయినా, నీటిపారుదల వనరులు ఉన్న మాగాణి భూముల్లో వరి పండుతుంది. ఆ సౌకర్యం లేని చోట్ల జొన్న, సజ్జ, రాగి వంటి మెట్ట పైర్లు వేస్తారు.

సన్నని మల్లెమొగ్గల వంటి వరి అన్నాన్ని తిని-ఆ తర్వాత గొంతు దిగని జొన్న సంకటి ముద్దలనూ చవి చూచిన శ్రీనాధుడు ఈ రెండు ప్రాంతాలనూ పర్యటించిన వాడే! రాజాస్థానాలలో రాజభోగాలు అనుభవించి-హేమ పాత్రల్లో భుజించ గలిగిన కవిసార్వభౌముడు-పలనాటిసీమలో రేనాటిలో, కన్నడ దేశంలో-పర్యటన చేసినప్పుడు ఆ జొన్న కూటిని తినలేక ఆశువుగా చెప్పిన కొన్ని పద్యాలు మనకు ఆనాటి ప్రజల ఆహారపు టలవాట్లను చాల వరకు తెలియ చెపుతాయి. పురోహితుల ఇళ్ళలోని పాచిన వంటకాల నుంచీ దివ్యహార్మ్యాలలో మంత్రుల పంక్తిని ఉపలభ్యమయ్యే పాయసాన్నాల వరకూ శ్రీనాధుడు చవి చూడని భక్ష్య పదార్థాలు లేవు. వర్ణించని శాక పాకాలు లేవు.

ద్రాక్షా పానకాలు, ఖండ శర్కరలు, రంభాఫలశ్రేణులు, గోక్షీరాలు, పప్పులు, చిత్రాన్నాలు-ఆరగించే వారట ఆ నాటి రాజులు. కమ్మగా కాచిన కరియాల నేయి, కమనీయ పంచభక్ష్యాలు, పక్వమైన పెసరపప్పు, అమృత ఖండ పాండురమైన దధి, పండుదానిమ్మ తియ్యరసము-కొండపీటిలో

తింగన మంత్రి పంక్తిన భుజించే వాడినని చెప్పుకొన్నాడు కవిసార్వభౌముడు.

లడ్లు, ఇడ్డెనలు, కుడుములు, దోసెలు, వడలు, అరిసెలు, అప్పడములు, జిల్లేడు కాయలు, చక్కిలములు, మడుగు పూవులు, పిండ ఖర్జూర ద్రాక్షా నారికేళ కదళీ పనస జంబూ ఫలములు, పాయసములు, కంద, చారులు, తియ్యగూరలు, పచ్చడులు, ఊర్రాళ్ళు, చలిమిడి-ఇవన్నీ ఆ నాటి శ్రీమంతులు ఎక్కువగా చేసుకుని తినే భక్ష్యభోజ్యాలని శ్రీనాథుడు కాశీఖండంలో వర్ణిస్తాడు.

ఓరుగల్లు, కొండవీడు రాజమహేంద్రవరం, విద్యానగరం-వంటి పట్టణాలలో కాలిడి-అక్కడి జొన్న కూడు తినలేక ఆక్రోశించి అలమటించి పోయాడు. ఆనాడు పలనాటిలో సజ్జ జొన్న కూళ్ళూ తప్ప వరి అన్నము లేదు. అక్కడి ఉడుకు బచ్చలి శాకముతో కూడిన జొన్నముద్ద మింగటానికి ఎంత బాధ కలిగిందో కాని-ఎక్కడో వైకుంఠంలో ఆమూల సౌధంలో కూర్చున్న ఫుల్లసరోజ నేత్రుణ్ణి కూడా సవాలు చేస్తాడు!

అదే విధంగా - మహారాజు అయినా – శ్రీకృష్ణదేవరాయలు సామాన్య ప్రజానీకపు జీవన సరళిని ఎంత సునిశిత దృష్టితో పరిశీలించి అవగాహన చేసుకున్నాడో కాని, ఆయా ఘట్టాలలో అతడు ఆముక్తమాల్యదలో వర్ణించిన విశేషాలు చదువుతుంటే పరమాశ్చర్యం కలుగుతుంది. ఆయా ఋతువులను బట్టి, కాలానుగుణంగా, కులానుసారంగా, ఆ నాటి ప్రజలు భుజించే భోజనాన్ని అనేక చోట్ల వర్ణిస్తాడు.

అరటి పండ్లు పనస తొనలు, దోసబద్దలు, మామిడి పండ్లు, ద్రాక్షపండ్లు, తియ్యదానిమ్మలు వంటి ఫల విశేషాలే కాక, తియ్యని చారులు, చెరకురసాలు, చల్లని నీరు, తేట మజ్జిగ-వేసవి కాలంలో విప్రులు భుజించే వారట!

భోగులూ, మాంసాహారులూ అయిన వారు వేసవి కాలంలో చేప తునకలలో మామిడి కాయ ముక్కలు వేసి తాళింపు వేసిన పాకం మధ్యాహ్న కాలంలో భుజించే వారట. సాయంకాలం తడిసిన ఇసుకలో పూడ్చిపెట్టిన లేంకాయ నీరు త్రాగి చేపల కసరును పోగొట్టు కుంటూ ఉండేవారట! ఇది బహుశా మహారాజు స్వానుభవమేనేమో!

శ్రావణ మాసంలో ఆకు కూరలు సమృద్ధి కదా! గురుగు, చెంచలి, తుమ్మి, లేదగిరిసాకు, చింత చిగురు, కలిపి-నూనెతో పొరటిన కూరలు కడుపారతిని-"కేప్రిపుల్ మెయిన్నాక, మేకెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వే కాప్తి రెడ్డజడిన్"....అని రాయుల వారు సరసోక్తులతో చిత్రిస్తారు.

రెడ్ల భోజన శయనాది విశేషాలను ఈ విధంగా చెప్పిన సాహితీ సమరాంగణ సార్వభౌముడు - క్షత్రియ రాజకుమారుల ఆహారపు టలవాట్లను, దైవందిన కార్యక్రమావళిని—ఎంత మనోహరంగా వర్ణిస్తాడో చూడండి!

"మణి యష్టి నెలి బర్హిణ షడ్జ సుధ వీను
లోలాడ బ్రొద్దెక్కి మేలుకాంచి

ఘుమ ఘుమ వత్యుతు గంధరాజాంగ
మర్దనపై జిరోష్ణ మజ్జనము లాడి
మిసిమి దువ్వలువ బన్న సరంబు మొగలి రే
కుల దాల్చి జామెక్కి కోలు వాసంగి
జాంగలా మిషముతో శాల్యన్న మధిక హ
య్యంగ వీనంబుగా నారగించి
మృగ మదము మించు తమలంపు టిరుల మోవి
దలముగా సాగరు హాసంతి వెలుగ సౌధ
శిఖర వాతాయనా గతా చిరరు గంశు
నత దృగవ రోధముల తోడ నగిరి నృపులు !"

ప్రొద్దెక్కి నిద్రలేచి, సుగంధ ద్రవ్యాలు కలిపిన వేడినీటితో మజ్జనము లాడి, మిసిమి దువ్వలువలు ధరించి, హారములు, మొగలి పువ్వులు-ధరించి, మాంసముతో కూడిన శాల్యన్నము వెన్న గాచిన నేతితో భుజించే వారట ఆ నాటి రాజులు. ఆ పైని కస్తూరి ఘుమ ఘుమలతో పరిమళించే తమలపు విడెములు నవులుతూ ఉండే వారట వారు.

రాజులూ, భోగులయిన వారు శాల్యన్నములు భుజించినా మనపూర్వులు ప్రధానంగా జొన్న, సజ్జ, రాగి పంటలు పండించుకుని తినేవారు. కృష్ణా, గోదావరులపైన బ్రిటిష్ వారు ఆనకట్టలు కట్టిన దగ్గర నుంచి తెలుగు దేశం ఒక విధంగా సస్యశ్యామల మైనదని చెప్పవచ్చు. అప్పటి నుంచీ మనవాళ్ళు ఎక్కువగా వరి అన్నమే తింటున్నారు.

వెనుకటి మన ఆడవాళ్ళు వడ్లు దంచి, బియ్యం బాగు చేసి వంటలు వండే వాళ్ళు. శ్రమ తెలియకుండా ఆనాటి ఆడవాళ్లు ఆశువుగా పాడుకొనే పాటలు దంపుళ్ళ పాటలుగా ప్రసిద్ధి కెక్కాయి.

"అత్త దంచిన బియ్య మధిక సన్నాలు
కోడలు దంచిన బియ్యం కొత్త సూదూలూ"

అని మేల మాడు కుంటూ అలవోకగా ధాన్యపు రాసిని బియ్యపు రాసిగా చేసిపెట్టేవాళ్లు.

దంపుడు బియ్యపు చేవ అది. ఆతరం వెళ్ళి యాంత్రిక యుగం వచ్చింది. ఇప్పుడు మనం తినే అన్నం మరలో పోసి సన్నజాజి మొగ్గలుగా సానపట్టిన జిగితప్పిన వరి బియ్యపు అన్నం.

తినేది ఏ బియ్యపు అన్నమైనా, అది పెరుగు కలిపి నిలవ ఉంచిన చలిది అన్నం అయితే ఆంధ్రులకు మక్కువ ఎక్కువ. అందుకే పెద్దల మాట చద్ది మూట!.... అనే గొప్ప అభిప్రాయాన్ని నానుడితో ముడి పెట్టుకున్నారు.

నిజానికి ఈ చలిది అన్నం తినే ఆచారం మనకు అనాదిగా ఉంది. బాలకృష్ణుడు సంగడీల నడుమ కూర్చుని బృందాటవీ ప్రాంతంలో చల్దులారగించిన ఘట్టం పోతన్న గారు మనోహరంగా వర్ణిస్తారు. ఊరుగాయ నంజుకొంటూ చల్దిముద్దలు తినే బాలకృష్ణుడు పదహారణాలా తెలుగు బుడుతడే!

ఈ చలిది అన్నం పొద్దుటే తిని పొలానికి వెళ్ళి సూర్యుడు నడినెత్తికి వచ్చేదాకా ఆ నాటి రైతులు భీమ బలంతో ఎంత పని అయినా చేసుకో గలిగి ఉండేవాళ్లు. ఎండాకాలంలో ఈ చలిది అన్నం ఏ కూల్ డ్రింకులూ చేయ లేనంత మేలు చేస్తుండేది, కాని ఈనాటి పల్లెటి సీమల్లో పొలానికి వెళ్ళే రైతులైనా, కూలివారైనా, కాఫీ నీళ్ళతో ఆకలిని చంపుకోవటం అలవాటు చేసుకున్నారు. ఒక విధంగా తెలుగు మారిపోయారు !

కరియాల నేయి ఆనాటి భోజనంలో ముఖ్యమైన పదార్థం. మజ్జిగ చిలికి వెన్నతీసి, అప్పటికప్పుడు మట్టి పిడతలో కాచిన ఘుమ ఘుమలాడే కమ్మని నేయి-చేతికి జిడ్డు అంటేటంతగా వేసుకు తినేవాళ్ళు మనవాళ్ళు.

మరీ లేతగా కాకుండా-మరీ ముదురు పానీయకుండా-సమమైన పాళ్ళలో నెయ్యి కాచటం అనేది అందరికీ చేత నయ్యే పనికాదు. అది పాక కళలో ముఖ్యభాగం! ఆ రోజుల్లో ప్రతి ఆడపిల్లా నేర్చి ఉండవలసిన విద్య!

అందుకే-ఆడపిల్లను అత్తవారింటికి పంపే సమయంలో అప్పగింతలు పెడుతూ-ఆపిల్లతల్లి వియ్యాపు రాలికి తనబిడ్డ ముగ్ధత్వాన్ని గురించి ఇలా రెండు మాటల్లో చెపుతుంది.

" నెయ్యి కాచ నేరదూ నెలత సుమి వదినా
పాలు గాచ నేరదూ పడతి సుమి వదినా!"

కాని, ఇప్పటి ఆడపిల్లలకు నెయ్యి కాచటం నేర్వ వలసిన బాధ లేదు! నేయి కాచడం రాకపోయినా, కాఫీ

కాయడం వస్తే ఈ నాడు కాలం గడిచిపోతుంది. అప్పుడు కాచిన నేతులు కరువైనట్లే-అన్నంలో నేయి వేసుకోవడం ఇప్పుడు తగ్గిపోయింది. ఇప్పుడు వేసుకోవాలని అనుకున్నా, మనకు లభ్యమయేది వనస్పతి కలిసిన కలితీ నేతులే! ఏ నేయి అయినా, ధరలు ఆకాశాన్ని అంటటం వల్ల కాని-వైద్యశాస్త్రరీత్యా అది శరీరానికి హాని కలిగించే క్రొవ్వు పదార్థమని నిర్ధారణ చేయటం వలన కాని-నేతి వాడకం ఇప్పుడు చాల వరకు తగ్గిందని చెప్పాలి.

పెళ్ళివచ్చినా, పేరంటం వచ్చినా, విందుభోజనాన్ని 'పప్పన్నం' అని మారుపేరుతో వ్యవహరించటం చూస్తే మనభోజనాలలో పప్పుకు ఉండే ప్రాముఖ్యం తెలియవస్తుంది.

పప్పులో కలగూరలుగా, పప్పుదప్పళాలుగా, పప్పు చారులుగా-ఎన్నో రకాలుగా పప్పు తెలుగు వంటకాలలో చోటు చేసుకున్నది. చిక్కని పప్పుచారు రుచి తెలిసిన తెలుగువారు- "పప్పుచారు అడుగడుగుది - పరమాన్నం పై పైది రుచి"- అనే సామెతను వాడుకలో వ్యవహరించు కుంటుంటారు.

అన్నంలోకి వండుకునే శాకపాకాలు అనేక రకాలు. గుత్తివంకాయ రుచి, వర్చి కూర్చిన వలపు కమ్మదనంతో అందించే కన్నెపిల్లకే తెలుసు. అందుకునే ఆ వలపుకానికే తెలుసు!

వెనుకటి రోజుల్లో ప్రధానంగా బీర, పొట్ల, సొర, దోస, అరటి, గుమ్మడి, బెండ-వంటి కూరగాయలతో తెలుగు వంటకాలు నిండి ఉండేవి. బంగాళదుంప, టొమాటో, కాబేజి,

కాలి ఫ్లవరు, బీట్ రూట్, నూల్ కోల్, బెంగుళూరు వంకాయ వంటి విదేశపు కూరగాయలు ఎన్నో మన దేశానికి తరలి వచ్చినవి. ఇప్పుడీ కొత్తరకపు కూరగాయలతో చిత్ర విచిత్రమైన శాక పాకాలు వండ నేర్చింది తెలుగు గృహిణి. ఈ కొత్త వంటకాలలో - రుచులలో - మన ఇరుగు పొరుగు ప్రాంతాల ప్రభావమే కాక, ఉత్తర దేశపు పాకశాస్త్ర విధానాలు కూడ కొంతవరకు చోటుచేసుకున్నవని చెప్పక తప్పదు.

ఏకూరలు చేసినా, ఏచారులు కాచినా 'చుయ్' మనే శబ్దంతో - కమ్మని తిరగబోత పరిమళం వెదజల్లని తెలుగిల్లు ఉండదు. కరివేప చివురాకుతో ఘుమ ఘుమ లాడే తాలింపు వంటకానికి ఇంపూ సొంపూ కలిగిస్తుంది.

ఎన్ని వంటకాలు ఉన్నా 'జిహ్వాతుష్టి' దులిపే కారపు పచ్చళ్ళు లేకపోతే తెలుగువారికి భోజనం సహించదు. అప్పటి కప్పుడు మిరపకాయలు వేయించి నూరుకునే పచ్చళ్ళే కాక, ఏటికేడాది నిలవ ఉంచుకునే ఊరగాయలు తెలుగు వారి ఎంతో శ్రద్ధగా చేసి ఉంచుతుంది. తెలుగువారి గోంగూర చవి, ఆవకాయ రుచి - దేశ దేశాలకూ ప్రాకిందనటంలో అతిశయోక్తి లేదు. నాలిక కారం ఘాటుకు మంటలు రేగుతున్నా, కళ్ళవెంట ధారాపాతంగా నీరు కారుతున్నా - ఎర్రగా కలిపిన పచ్చడి ముద్ద వదలని ధీరత్వం తెలుగన్నది.

గరిక పచ్చడి చేసి - అతిథిగా వచ్చిన జమీందారుగారిని మెప్పించి 'గరికపాడు' మాన్యం బహుమతిగా పొందిన ముసలవ్వ కథ ఇప్పటికీ తెలుగు దేశంలో కథగా చెప్పుకుంటారు.

సంబారు కారం మొదలు కొబ్బరి, వెల్లుల్లి కారాల వరకూ అనేక రకాల కారపు రుచులు తెలుగు జిహ్వాయే ఎరుగును!

శ్రీకృష్ణదేవరాయలు ఆముక్త మాల్యదలో ఉదహరించిన గురుగు, చెంచలి, చింత చిగురు వంటి ఆకు కూరలే కాక, తోటకూర, బచ్చలి, దొగ్గలి, పొన్నగంటి, గంగ బాయిలి, చామ, మెంతి-వంటి అనేక రకాల ఆకు కూరలు రకాలు ఇప్పటికీ మనవాళ్ళు అన్నంలోకి ఆదరువులుగా వండి వాడుకుంటారు.

అప్పడాలు వత్తుకోవడం, వడియాలు పెట్టుకోవటం - ప్రతి ఇంటా చేసుకునే గృహ పరిశ్రమలే! మన పెళ్ళిళ్ళలో విందు భోజనాలలో-ఎన్ని వంటకాలున్నా అప్పడం, వడియం లేనిదే దానికి నిండుదనం రాదు.

పండుగ పబ్బాల్లోనూ, శుభకార్యాలపట్లా, ప్రథమంగా పాలు పొంగించి, పాయసం వండి, దైవ ప్రీత్యర్థం ముందుగా నివేదన చేసి, ఆపైన ఆరగించటం మన ఆచారం. అన్నప్రాశన చేసినప్పుడు ప్రథమంగా పసిబిడ్డ జిహ్వాకు రుచి చూపించేది ఈ పాయసమే! సన్నని పచ్చ కర్పూరపు వాసనతో, ఏలకు పొడి పరిమళంతో, పాలతో, పంచదారతో మాగి కాగిన పాయసం - తెలుగువారి ప్రత్యేక వంటకం. అత్యంత ప్రీతిపాత్రమైనది కూడా! అందుకు నిదర్శనం జానపదులు పాడుకునే ఈ చిన్న పదం -

పరమాన్నం —
పీట కింద పెడితే పిల్లెత్తుకు పోయింది!
ఉట్టిమీద పెడితే ఉడతెత్తుకు పోయింది!
మంచం మీద పెడితే మామ ఎత్తుకు పోయాడు
అటక మీద పెడితే అల్లుడెత్తుకు పోయాడు!
నీకు లేదు!"

వెనుకటి నుంచీ మనవాళ్ళు చేసుకునే పిండి వంటలలో 'గారె గారె'కు ఒక ప్రాధాన్యం ఉండి ఉంటుంది. బహుళార్థ సాధకమైన భారతంతో సామ్యం ఏర్పరచుకోగలిగిన గారెల రుచి బహుజన ప్రీతికరం అయిఉంటుంది!

పులిహోర, దధ్యోజనం, చక్రపొంగలి, అరిశెలు, బూరెలు, పూర్ణాలు, మినపసున్ని ఉండలు, బొబ్బట్లు, కజ్జికాయలు, చక్కిలాలు, చేగోడీలు, పులి బొంగరాలు, అట్లు, చిమ్మిలి, చలిమిడి, లడ్డూలు, కుడుములు - వంటివి అచ్చమైన తెలుగు పిండివంటలు-అని చెప్పవచ్చు. కాని ఇందులో చాలా భాగం ఇప్పుడు మన తెలుగు దేశపు హోటళ్ళు మనకు అందించవు. అరవ కన్నడ దేశాల ప్రభావం మన హోటళ్ళ వంటకాలలో పూర్తి స్థానం ఆక్రమించుకుని-పేరులో, రుచిలో, పరిమాణంలో, ఆకారంలో - ఎన్నో మార్పులు తెచ్చింది.

వెనుకటి కాలంలో పూట కూళ్ళమ్మలు పొరుగూరి నుండి వచ్చిన బాట సారులకు, చదువుకునే విద్యార్థులకు, మూడుపూటలా అన్నం పెట్టి - అన్నసత్రవుల నడుపేవాళ్ళు.

ఊళ్ళో వింతలూ విశేషాలూ బాటసారులకు చెప్పటం, కష్టం సుఖం అడిగి తెలుసుకోవటంతో-ఆగంతకులకూ, పూట కూళ్ళమ్మలకూ సానుభూతితో కూడిన సంబంధ బాంధవ్యాలు ఏర్పడి ఉండేవి. ఒక్క రూపాయికే కమ్మని గోధుమ పిండి వంటతో, క్రొత్తగా కాచిన ఆలనేతితో, పప్పుతో, వంజుళ్ళతో, అరటి పండ్లతో, క్రొం బెరుగుతో-కవిసార్వభౌమునికి వండి వడ్డించిన లక్ష్మణ వజ్ఝల మన తెలుగుపూట కూళ్ళమ్మ.

కాలానుగుణంగా వచ్చిన మార్పులలో తెలుగునాట ప్రతిఊరిలోనూ, ప్రతి పల్లెలోనూ వచ్చి వెలిసిన కాఫీ హోటళ్ళు భోజన హోటళ్ళు ముఖ్యమైనవి. రకరకాల ఇతర ప్రాంతాల వంటలను-తెలుగు జిహ్వకు పరిచయం చేసి-తమ వ్యాపారాన్ని సుస్థిరం చేసుకున్నారు-ఈ హోటళ్ళు నడిపే వ్యాపారస్థులు.

జిలేబి, గులాబ్ జాం, కలాకంద్, బర్ఫీ, దూద్ పేడా, బాదుషా, బాదంఖీర్, వెజిటబుల్ కట్లెట్, టొమాటో బాత్, వంటి ఉత్తర దేశపు పేర్లు తెలుగు వారి జీవితంలో చోటు చేసుకుని నోటికి ఇంపైన పదార్థాలయినవి. ఏ హోటల్‌కు వెళ్ళినా, కిట కిట లాడుతూ బల్లల ముందు కూర్చుని ఫలహారాలు చేసే జనాన్ని చూచినప్పుడు-హోటళ్ళు తెలుగు సామాజిక జీవనంలో ఎంత ప్రాధాన్యత వహించాయో మనం ఊహించుకోవచ్చు.

బహుశా ఈ హోటళ్ళ ద్వారా సంక్రమించిన పారిభాషిక ప్రభావమే అయి ఉంటుంది-కాని-భోజన పదార్థాలలో మార్పు వచ్చినట్లే-వాటి పేర్లలో తెలుగుదనం పోయి, అసలు పేర్లస్థానంలో ఆంగ్ల పదాలు, ఇతర భాషాపదాలు-వాడటం సర్వసామాన్యమైపోయింది. అసలు హోటల్ అనేది తెలుగు పదం కాకపోయినా-మనవాడుకలో ఒక ముఖ్యమైన పదంగా కలిసి పోయింది. అలాగే-అన్నానికి రైస్, భోజనానికిమీల్స్ పళ్ళేనికి ప్లేట్, కూరకు కరీ, చారుకు రసం, అట్టుకు దోసె, గారెకు వడ, ఉప్పుకు సాల్ట్, ఫలహారానికి టిఫిన్-పచ్చడికి చట్నీ, పెరుగుకు కర్డ్, అప్పడాలకు పాపడ్ - వంటి అనేక పదాలను మన నిత్యజీవితంలో ప్రయోగించటం అలవాటు చేసుకున్నాము. ఆఖరుకు మంచినీళ్ళను కూడా వాటర్ అననిదే చెలామణి అవని రోజులు వచ్చాయేమోనని పిస్తుంది.

హోటళ్ళలో దొరకని కొన్ని అచ్చమైన తెలుగు వంటకాలు, పిండివంటలు-ఇప్పటికీ మనవాళ్లు ఇళ్ళల్లో చేసుకోవటం మరువలేదు. కాని 'పొరుగింటి పుల్లకూర రుచి' సామెతగా తెలుగు వాడికి ఇంట్లో చేసుకునే వంటకాలకన్నా హోటళ్ళలో అధిక ధరలకు దొరికే నాజూకైన వంటకాల పైనే మోజు పెరిగిందని చెప్పక తప్పదు!

తెలుగు ఇల్లాలు తన భర్తకూ, బిడ్డలకూ, ఇతర కుటుంబ సభ్యులకూ వండిపెట్టుకోవటంలోనే కాక, అతిథి అభ్యాగతులను ఆదరించి సత్కారాలు చేయుటంలో కూడ పేరెన్నిక గన్నది. అతిథి ఇంటికివచ్చినప్పుడు ముందుగా కాళ్ళు కడుగుకోవటానికి చెంబుతో నీళ్ళు అందివ్వటం మన

ఆచారం. 'అతిథి దేవోభవ' అన్న విశ్వాసంతో, అతిథులను, వేళతప్పి ఆగంతుకంగా వచ్చిన వారిని, బంధు మిత్రులను,- సమాదరణగా ఆహ్వానించి శక్తి కొలది ఆతిథ్యం ఇచ్చే సంప్రదాయం మనది.

వాకిట్లోకి వచ్చిన మాదాకవళం వానికి ఒక్క ముద్ద వేయకుండా అన్నం ముట్టుకోని అన్నపూర్ణలకు తెలుగు దేశంలో కొరత లేదు.

ఆ నాటి అతిథి మర్యాదల సరళిని శ్రీకృష్ణదేవ రాయలు ఎంత విపులంగా కళ్ళకు కట్టినట్లు వర్ణించాడో చూడండి!

"ఎదురేగి సాష్టాంగ మెరగి పాద్యం బిచ్చి
నారికేళ కటాసనముల నునిచి
నునుబోక పాత్రి కుట్టిన దొప్ప గమి తోడ
రంభా విశాల పర్ణములు పరిచి
శాల్యన్న మా పాజ్య కుల్యా బహు వ్యంజన
క్షీర దధు లర్పణంబు జేసి
వార్చిన పిదప సంవాహన మిాంఘ్రుల కొనరించి
తాంబూల మొసగి, కుశల
మడిగి పోయెదనన్న దవ్వనిచి సిరికి
దగిన సత్కృతి చేసి ఖేదమున మగిడి
యర్చగావింతు రెపుడు నిట్లతిథులైన
భాగవతులకు నప్పురి భాగవతులు!"

ఎంత వినయ వినమిత సత్కారం! అర్ధరాత్రివేళ అలించినా, విష్ణుచిత్తుని ఇంట అతిథి సత్కార సంరంభాలు వినవస్తూ ఉండేవట!

"ఆ నిష్టానిధి గేహసీమ నడురేయాలించి నన్నోయి కెం
తే నాగేంద్రశయాన పుణ్యకథలుం-దివ్యప్రబంధాను సం
ధాన ధ్యానము నాస్తికా శాక బహుతా నాస్త్యుష్ణతా
నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్టవంచ కృపయా భోక్తవ్యమన్మాటలున్!"

"ఎక్కువ కూరలు లేవు-పదార్థములు వేడిలేవు. పిండి వంటలు లేవు. వంటావార్పు చక్కగా కుదరలేదు....." అని క్షమార్పణలు కోరుకుంటూ- 'దయతో భోజనం చేయుడ'ని అపరాత్రి వేళ కూడా ప్రార్థిస్తూ ఉండే వాడట!

నాటికీ నాడు పరిస్థితులలో ఎంత మార్పు! నేటిమధ్య తరగతి కుటుంబాలలో చుట్టపక్కాలు వస్తారంటేనే భయం. ఎవరైనా వచ్చి నాలుగు రోజు లుంటే-ఈ పీడ ఎప్పుడు వదులు తుందా అని ఎదురు చూడటం! ఆ కాలపు బంధు ప్రేమలు, ఆప్యాయతలు తగ్గటానికి కారణం మానవ స్వభావంలో వచ్చిన మార్పులూ, ఆర్థికమైన ఇబ్బందులు! ఈనాటి గృహిణికి అంతగా అతిథి సత్కారం చేసే తీరిక ఏదీ! కాని ఆ కాలంలో పరివరాఖ్యుడి ఇల్లాలు ఎంత ఓర్పు కలదో! మనుచరిత్రలో పెద్దన్నగారు చక్కగా చిత్రించారు.

"పండ నలయుదు వేవురు వచ్చిరేని
యన్నపూర్ణకు నుద్దియా నతని గృహిణి
యతిథులే తేర నడికి రేయైన బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాగ !"

ఇంతటి దివ్యమైన సంప్రదాయం మనది. కాని మారుతున్న పరిస్థితుల ప్రభావంతో ఇంటి ఇల్లాలికి అన్నపూర్ణ హృదయం ఉన్నా-అతిథులను ఆదరించవలసి వచ్చినప్పుడు వెనుకా ముందూ చూచుకోవలసిన అవసరం వచ్చింది. సంపాదనతో పాటు వస్తు సంబారాల ధరలుకూడా పెరుగుతుండడం చేత-ప్రస్తుత కాలంలో అతిథి అభ్యాగతుల ఆగమనం ఇంటి ఇల్లాలికీ, యజమానికీ కూడా ప్రాణాంతకంగా పరిణమించిందని చెప్పక తప్పదు.

అసలే అరణ్యవాస క్లేశంతో కృంగిపోతున్న పాండవుల అతిథి మర్యాదలను, సహనాన్ని-పరీక్షించడానికై పనిగట్టుకు వచ్చిన దుర్వాసమహర్షినీ, అతని వేయిమంది శిష్యగణాలనూ కృష్ణమూర్తి కరుణా కటాక్షంతో ద్రౌపది ఏవిధంగా సత్కరించ గలిగిందో-భారతం చదివిన వారందరికీ తెలిసిన కథే! ఆ కాలం వేరు! ఆ యుగధర్మం వేరు! ఆ అక్షయ పాత్రలు లేవు ఇప్పుడు! పిలిస్తే పరుగెత్తుకు వచ్చే కృష్ణమూర్తి కలియుగంలో మనకు కానరాడు.

ఇదంతా మధ్య తరగతి సంసారుల బాధ. రెక్కాడితేనేకాని డొక్కాడని పేదవాడి ఆహార సమస్య ఆనాటికీ ఈనాటికీ ఒకటే!

కలిగినవాడు కనక పాత్రిలో తిన్నా, లేనివాడు మట్టి మూకుటిలో తిన్నా - తెలుగువాడు తినేది అన్నమే।

కాకపోతే జిహ్వా చపలమైనది కావడంవల్ల, దానికి రుచుల వైవిధ్యం కావలసిరావటంవల్ల - ఉన్నంతలో అభిరుచులకు, స్థితిగతులకు - అనుగుణంగా చవులను తీర్చి దిద్దుకున్నాడు.

షడ్రుచుల మేళవింపు అనాదిగా మనకు తెలిసిన విషయమే। వసంతకాలంలో ప్రకృతి ప్రసాదించే కొత్త బెల్లం, చింతపండు, మామిడి పిందెల ముక్కలు, ఉప్పు, వేప పూవు, పచ్చిమిర్చి ముక్కలు కలిపి చేసిన ఉగాది పచ్చడి రుచి తెలుగు జాతికి ఇష్టమైన రుచి.

కొత్త చింతపండు నీటిలో కలిపి, బెల్లమో లేక చెరకు రసమో పోసి, సన్నని పచ్చిమిరపకాయ ముక్కలు, కొద్దిగా ఉప్పు చిన్న చిన్న మామిడిపిందెల ముక్కలు, వేప పూత-కలిపి-కొద్దిగా నెయ్యివేసి చేసిన ఉగాది పచ్చడి రుచి షడ్రుచుల సమ్మేళనంగా ఉంటుంది.

జీవితంలో తియ్యదనాన్ని, సంతోషాన్ని - అనుభవించినంత సరసతతో, సంసిద్ధతతో, మరొకవైపున తప్పనిసరిగా ఎదురువచ్చే చేదునూ కష్టాన్నీ కూడా ఎదుర్కోవాలనే వేదాంత దృష్టికి ప్రతీక మనం చేసుకునే ఈ ఉగాది పచ్చడి.

ఇంతటి ఆధ్యాత్మిక భావనను సంయమన సిద్ధాంతాన్నీ జిహ్వాగ్రాన అనుభవంలోకి తెచ్చుకోగలిగిన తెలుగుజాతి కథ మననం చేసుకోవటానికి మధురంగా ఉండే కథ — * * *

# గ్రామ సీమలు

పల్లెటూరు-అనగానే-ప్రశాంత వాతావరణం, పంట పొలాలు, ఏటిఒడ్డు, కొండగాలి, బంతిపూలు-జ్ఞాపకం వస్తాయి మనకు. నిసర్గ మనోహరమైన ప్రకృతి శోభతో పాటు - తెలుగుతనపు ముద్ర కానవచ్చేది మన పల్లెసీమల్లోనే।

పంట పొలాల పచ్చదనం, ఏటినీటి గలగల, ఆత్మీయత నిండిన పలకరింపు, గజిబిజీ గందరగోళం లేని ప్రశాంతజీవితం-ఇవన్నీ కలిస్తే- తెలుగుగ్రామం.

"ఎక్కడ జూచినన్నరసి, యెక్కడజూచిన దేవ మందిరం
బెక్కడ జూచినందటిని, యెక్కడజూచిన బుష్పవాటికం
బెక్కడ జూచినన్నది, మహీ వలయంబున భీమ మండలం
బెక్కడ? అన్యమండలము లెక్కడ? భావనచేసి చూచినన్ !"

ఇదీ ఆనాడు శ్రీనాథమహాకవి దర్శించిన గ్రామ సౌభాగ్యం!

ఈనాడు ఆంధ్రదేశంలోని పల్లెలన్నీ ఇంత సౌభాగ్య వంతంగానూ, రమణీయ వాటికలుగానూ ఉన్నాయని చెప్ప లేము. కక్షలు, కావేషాలు, పార్టీ రాజకీయాలతో నిండి పోయిన ఈనాటి గ్రామీణ వాతావరణానికీ-ఆత్మీయత, ఆదర

ణాలతో కూడిన వెనుకటి నిర్మల వాతావరణానికి ఎంతో తేడా కనిపిస్తుంది. అతివృష్టి, అనావృష్టులతో కృంగి పోతున్న రైతులు, మంచినీటి సౌకర్యాలు కరువైన ప్రాంతాలు, వైద్య సదుపాయం లేని ఊళ్ళు, - ఇవన్నీ చూస్తుంటే, వెనుక పరమ సౌభాగ్య సీమలుగా పరిగణించ బడిన గ్రామసీమలు ఇవేనా అనే సందేహం కలుగుతుంది. గ్రామ ప్రజలు కూడా చాలామంది అక్కడి జీవితంతో విసిగి పోయి-'దూరపు కొండలు నునుపు' అన్న సామెతగా జీవన ప్రమాణం పెంచుకోవాలనే ఆశతో పట్టణాలకు వలస పోతున్నారు.

కాని, అనాది నుంచి సుస్థిరంగా మనదేశంలో పాతుకు పోయిన గ్రామ వ్యవస్థ విశిష్టమైనది. ఈ నాటి పరిస్థితులు ఎలా ఉన్నా- ప్రాచీనమైన గ్రామీణ శోభ, ఆ నాటి వ్యక్తులు, వాతావరణం-మనం స్మరించుకో దగినవి. అన్నీ కాక పోయినా-గ్రామీణ జీవితంలోని కొన్ని సొగసులు, మంచితనాలు- ఈ నాడు కూడా మనం దర్శించుకోవచ్చును. ఏ వ్యవస్థలోనైనా-అంతా మంచి కానీ, అంతా చెడు కానీ ఉండటం అసంభవం. మన ప్రాచీన వైభవాన్ని స్మరించి నప్పుడు అందులోని మంచి మాత్రమే ఎక్కువగా స్ఫురణకు రావటం సహజం.

మొదట్లో కొంత కొంత భాగం చెట్లూ చేమలూ కొట్టి, నేల చదును చేసుకుని జనావాసాలుగా ఏర్పాటు చేసుకునే వారు. నీటివసరూ భూసారం చూచుకుని నివాసానికి

ఏర్పాటు చేసుకున్న ఈ సాముదాయక స్థలాలు గ్రామాలుగా రూపొందినవి.

వ్యవసాయం ప్రధాన వృత్తిగా గల ఆంధ్ర ప్రాంతం అన్నపూర్ణగా గణన కెక్కింది. ఏరువాక మొదలు, పంట నూర్పిళ్ళ వరకు- ఏడాది పొడుగునా రైతులు ఏదో ఒక రకమైన వ్యవసాయపు పనులతో తీరిక లేకుండా ఉంటారు. ఎద్దులకు కట్టిన చిరుగంటలు గణగణ మ్రోగుతుండగా- బళ్ళను తోలుకుంటూ, పొద్దు పొడవక ముందే పొలానికి వెళ్ళే వ్యవసాయదారులు మనకు ఏ గ్రామంలోనైనా కనిపిస్తారు.

"గొడ్డు గోదల సీరు పెట్టుకొనుటో
కొట్టాల రొచ్చూడ్చుటో
దొడ్డింద్రొక్కిన యాల పల్పు లిడుటో
దూడన్ మరుల్ కొల్పుటో"

ఇలా దినమంతా ఏదో ఒక పనిలో నిమగ్నులై ఉంటారు. వీరికృషినీ, కాయకష్టాన్నీ గమనిస్తే-"కృషితో నాస్తి దుర్భిక్షమ్," అనే సూక్తిస్ఫురణకు వస్తుంది.

ఋతుసంబంధమైన ప్రకృతి మార్పులను ఏ శాస్త్రవిజ్ఞానమూ లేకుండానే అంచనా వేయగలుగుతాడు రైతు. వ్యవసాయదారునికి వాన రాకడ, పోకడ-ఎంతో ముఖ్యమైనది. ఏ కార్తెలో మబ్బు పడుతుందో, ఏ కార్తెలో వానకురుస్తుందో

ఎప్పుడు వాన వస్తే పంటకు మంచిదో, ఎప్పుడు కాదో-ఇవన్నీ తెలిసి ఉండాలి. కార్తెల పరిజ్ఞానాన్ని గురించి, వ్యవసాయానికి ఉపయోగించేవి - ఎన్నో సామెతలు వ్యవసాయదారుని నాలుకపైన ఆడుతూ ఉంటాయి.

"దాపున గుడి కడితే దూరాన వర్షం"

'చంద్రుని చుట్టూ గుడి కట్టుట మన్నమాట !

'ఉత్తర ఉరిమినా, త్రాచు తరిమినా-కురవక-
కరవక మానవు'

'విశాఖతో మబ్బులు, మజ్జిగతో భోజనము సరి'

ఇటువంటి సామెతలతో వాతావరణ సూచన తమకు తామే చేసుకుంటారు రైతులు.

పుడమి తల్లినే నమ్ముకున్న ఈ పల్లెజనం కేవలం ప్రకృతి కరుణా కటాక్షాల మీద ఆధారపడి ఉంటారని చెప్ప వచ్చు. అదునుకు వాన కురవక పోయినా, అక్కర లేనప్పుడు కుండ పోతగా వర్షం కురిసినా-ధైర్యంతో తన కృషిని పణంగా పెట్టి సాగిపోతాడు కృషీవలుడు.

వ్యవసాయదారునికి పశుగణాలు ఆస్తి పాస్తులు. ఎడ్ల జతో, దున్నపోతుల జతో లేనిది కాడి సాగదు. పాడి పశువులు లేకపోయినా ఇల్లు జరగదు. పాలకూ, పెరుగుకూ, మజ్జిగకూ, నేతికీ-ఇంటిపాడి ఉంటే తడుముకోవలసిన పని ఉండదు.

"కంట్రీలైఫులో చాలా చమత్కారం ఉంది. బెస్టు టుబాకో, బెస్టు గెదె పెరుగు, మంచి ఘీ-అందుచేతే నోయ్ పోయట్స్ 'కంట్రీలైఫ్ కంట్రీలైఫ్' అని దేవులాడుతారు!....' అంటాడు మన గిరీశం.

ఈ పశువుల్ని కట్టివేయటానికి ప్రత్యేకంగా కొట్టాలు, పూరిపాకలు ఉంటాయి. గొడ్ల చావిళ్ళ పక్కగా గడ్డి వాములుంటాయి. కాని కొన్ని ప్రాంతాలలో పశువుల్ని ఇళ్ళలోనే కట్టివేసుకునే ఆచారం ఉంది. ఇంటి చావిళ్ళలోనే మనుషులతో పాటు పశువులూ కాపురం ఉంటాయి. ఇప్పుడా పద్ధతి అంతగా లేదు కాని-పలనాటి సీమను శ్రీనాథకవి దర్శించినప్పుడు అక్కడి పల్లెటూళ్ళను గురించి చెప్పిన పద్యం-ఆ నాటి పల్లెటూళ్లలో ఇళ్ళను మన కళ్ళముందు కట్టినట్లు చెపుతుంది. అశుచీ, అపరిశుభ్రతా ఆ కాలపు పల్లెప్రజలలో అలవాటు పడిన పద్ధతులూ ఇలా ఉన్నాయట-

"దోసెడు కొంపలో పసుల త్రొక్కిడి దూడ రేణమున్
పాసిన వంటకంబు పసి బాలుర శౌచము విస్తరాకులున్
మాసిన గుడ్డలున్ తలకు మాసిన ముండలు వంటకుండలున్
రాసెడు కట్టెలున్ దలపరాదు పురోహితు నింటి కృత్యముల్!"

పశువులు ఉండగానే సరా! వాటికి తిండీ తిప్పలూ, ఆలనా పాలనా చూడాలి. అవన్నీ చూడటానికి గొడ్లకాడ బుడ్డాళ్ళుండాలి!

ఊరి పొలిమేరల్లోనో, చెట్టుకొమ్మమీదో, ఎదురయ్యే ఈ గొడ్లకాడ బుడ్డాడి స్వేచ్ఛా జీవనం ఎంత హాయిగా ఉంటుందో! మొలకు చిన్న గోచీ గుడ్డ, తలకు పాగా, చేతిలో ములు గర్రతో-పశువుల్ని అదిలిస్తూ ఊరిబయట చెట్టు పుట్టా ఉన్న చోట తిరుగుతూ ఉంటారు. వాటిదారిన అవి గొడ్లు మేతమేస్తుంటే-వీళ్ళు బిళ్ళంగోడు ఆడుకోవటమో, కోతి కొమ్మచ్చి ఆడటమో, కాలవలో ఈతలు కొట్టడమో, పిల్లన గ్రోవి ఊదటమో, చెట్లెక్కి చింతకాయలు కోయ టమో చేస్తూ ఉంటారు. ఆలమందలను కాచిన గోపాల బాలుని వంగడం లోని ఈ బుడ్డాళ్లు మధ్యాహ్నం పూట చెట్లక్రింద కూర్చుని కారపు మెతుకులు తింటారు. ఏటి నీళ్ళను దోసిళ్ళతో పట్టి తాగుతారు. సాయంత్రం అయే టప్పటికి గొడ్లను మళ్ళేసుకుని, వాటిమీదే ఎక్కి స్వారీ చేసుకుంటూ ఇళ్ళకు తిరిగి వస్తారు.

కాని ఇప్పుడు గొడ్లకాడ బుడ్డాళ్ళు కూడా పిల్లన గ్రోవి ఊదటం లేదు! సినిమా పాటలు పాడుతున్నారు.

తెలుగు దేశంలో పల్లెటూరు-ఒక ఉమ్మడి కుటుంబ వ్యవస్థగా సాగిపోతుంది. భూమిని సాగుచేసుకునే రైతాంగం కాక, ఇతర కులాలకు, వృత్తులకు చెందిన వారు కూడా ఒకరిపై ఒకరు ఆధారపడి, పరస్పర సహకారంతో జీవిస్తారు. కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, చాకలి, మంగలి, మేదరి-వీరంతా ఎవరి వృత్తులు వారు కొనసాగించు కుంటూ, గ్రామస్థుల అవసరాలు తీర్చుతుంటారు. అందుకు గాను గ్రామంలోని

ప్రతి గృహస్థూ వారి జీవనోపాధికి సరిపోయేటట్లు ఏడాదికి ఒక సారి ధాన్యం కొలుస్తారు.

అదే విధంగా, గ్రామ పురోహితుడు, వైద్యుడు-కూడా గ్రామస్థుల అవసరాలకు ఆదుకుంటూరు. గుడిలో పూజారి గుడికి మాత్రమే పరిమిత మైన వాడు కాదు. ఊళ్ళో ఎవరింట్లో ఏ శుభ కార్యం వచ్చినా, పెళ్ళి పేరంటాళ్ళు జరిగినా-అతడు పౌరోహిత్యం వహించి ఆ పని నిర్విఘ్నంగా జరిపిస్తాడు. మంచిరోజు చూచి ముహూర్తాలు పెట్టటం దగ్గర నుంచి, కాలం తీరిన వారిని శాస్త్రోక్తములైన పైతృక కర్మలతో కాటికి పంపించే వరకు-అన్ని పనులూ ఊరి పురోహితుల వారి చేతుల మీదుగా జరుగవలసిందే! ఊళ్ళోవారి యోగక్షేమాలన్నీ అతడికి తెలుస్తూ ఉంటవి. గ్రామస్థులు కూడా-ఆచారిగారనో, అయ్యవారనో-గౌరవించి పిలుస్తూ-అతడిని తమలో ఒకరుగా భావించుకుని ఆదరిస్తారు. కమ్మటి పెరుగుగడ్డో, పండిన కూరగాయలో, ధాన్యమో-ఏదోఒకటి అతడికి అందిస్తూ ఉంటూరు. ఒకొక్కప్పుడు ఆ పురోహితుడే ఊరి వైద్యుడు కూడా అయి ఉంటాడు. పల్లెటూళ్ళలో ప్రధానంగా ఆయుర్వేద వైద్యంచేసే వారు వంశపారంపర్యంగా ఈ విద్యను నేర్చుకుని గ్రామస్థులకు వచ్చే చిన్న చిన్న రోగాలను నయం చేస్తుంటూరు. జలుబూరొంపా దగ్గర నుంచీ లంఖణాల జ్వరం వరకూ-ఏ జబ్బు వచ్చినా ఊరి ప్రజ ముందుగా ఆచారిగారి దగ్గరకే పరుగెత్తుతారు. అతని వైద్యంతో నయం కాని పరిస్థితులు వచ్చినప్పుడు-ఒకొక్క

సారి వ్యాధి ముదిరి నప్పుడు-మాత్రమే వారు అల్లోపతీ వైద్యుల వద్దకు వెళతారు.

అలాగే, పల్లె ప్రజల సాంఘిక జీవనంలో సమ భాగంగా కలిసి పోయిన వారు గాజుల సెట్టి, భూతప్రేత పిశాచాలను పారదోలటానికి కంకణం కట్టుకున్న భూత వైద్యుడు, సోదిచెప్పే ఎరుకతా-వంటి వారు.

గాజుల మలారం వీపున వేసుకుని ఇల్లిల్లూ తిరుగుతూ, కన్నెపిల్లలూ ముత్తయిదువలూ మోజుపడే రంగు రంగుల గాజులు తెస్తాడు గాజుల సెట్టి. బస్తీనుండి కొత్తగా తెచ్చా నంటూ ఎప్పటికప్పుడు ఆడవాళ్ళను మోజుపడేట్లు చేస్తూ వారిచేతుల నిండుగా గాజులు తొడిగి మరీ వెళతాడు. పెళ్ళిళ్ళు వస్తేనూ, పెళ్ళయిన పడుచు పుట్టింటికి శ్రీమంతపు వేడుకకు వస్తేనూ అతడికి చేతినిండా పని. ఇంటి వాళ్ళే కాకుండా పేరంటానికి వచ్చిన ఆడవాళ్ళందరకూ గాజులు తొడిగిస్తారు. ఆ సందర్భంలో మొత్తంపద్దు ఇంటి వాళ్ళదగ్గర వసూలు చేసుకుని వాళ్లు ఆ పూట పెట్టిన పప్పన్నం తిని త్రేవ్మని తేర్చి, ఒక చిన్న కునుకు తీసి- మళ్ళీ బేరంకోసం ఊరి వెంట బయలు దేరుతాడు గాజుల సెట్టి. అలా దగ్గర దగ్గర ఊళ్ళు నెలకొక సారిగా తిరుగుతూ పొట్టబోసుకునే గాజుల సెట్టి ఊరి వారందరికీ కావలసిన వాడే. చేతుల నిండా గాజులు వేయించుకుని అతనికీ, అతని గాజుల మలారానికీ నమస్కారం చేస్తారు ముత్తయిదువలు. వారు సౌభాగ్య వంతులుగా పదికాలాల పాటు ఉండాలని దీవిస్తాడు అతను. కాని, మారు మూల పల్లెలలో తప్ప గాజుల సెట్టి

ఇప్పుడు అంతగా కానరావటం లేదు! దీనికి కారణం ఆడవాళ్ళకు గాజులపై మోజు తగ్గటం కాదు! ఎవరికి వారే దగ్గరగా ఉన్న బస్తీలకు వెళ్ళి గాజుల షాపులలో తమకు కావలసినవి ఏరి తెచ్చుకోవటానికి మనవాళ్ళు అలవాటుపడి పోయారు!

అలాగే ఇల్లిల్లూ తిరిగి ఇల్లాళ్ళచేత చేట నిండా బియ్యమూ, పాతచీరలూ, పావలా డబ్బులూ అడిగి ఇప్పించుకుని-వారికి వచ్చిన కష్టమేమిటో చెప్పి, దానికి పరిహారమేమిటో కూడా చెప్పగల సోది చెప్పే ఎరుకతలు, వారికి అందరు దేవతలూ అందుబాటులో ఉంటారనీ, పిలిస్తే పలుకుతారనీ, వారి వాక్కులో ఎంతో నిజం ఉందనీ పల్లె ప్రజలలో ఒక నమ్మిక ఉంటుంది. వారు భూత భవిష్యద్వర్తమానాలు చెప్పటమేకాక, ఏనాడో పరలోకగతులైన వారి ఇష్టాయిష్టాలూ, కోరికలూ, ఆజ్ఞలూ-అన్నీ వారిబంధువులకు వివరించ గల సమర్థులు. గతించిన వారి ప్రేతాత్మలు అలా గాలిలో తేలివచ్చి సోది చెప్పే ఎరుకత నాలుకపై నాట్యమాడి తమ సందేశాలు వినిపిస్తారు!

గ్రామాలలో ఉండే భూతవైద్యులు కూడా గ్రామస్థులకు వచ్చే రుగ్మతలమీద ఆధారపడి జీవించేవాళ్ళే. మూఢమైన నమ్మకాలతో ఉండేప్రజలకు శారీరక, మానసిక బాధలు ఏమి వచ్చినా మంత్ర తంత్రాలతో వాటిని నయం చేయించుకో వచ్చుననే విశ్వాసంతో భూతవైద్యుల వద్దకు పరిగెత్తటం పరిపాటే!

ఇలా, వివిధ వ్యావృత్తులలో ఉండేవారు-గ్రామస్థులతో కలిసి మెలిసి జీవిస్తారు. వీరందరికీ ఒక కట్టుబాటు ఉంటుంది. ప్రతి ఒక్కడికీ మరొకడితో అవసరం ఉంటుంది. జాతి, మత, కుల, వర్గ భేదాలున్నా-అందరి కందరూ బంధువులే! ఒకరి నొకరు వరుసలు పెట్టి పిలుచుకోవలసిందే!

గ్రామ కరణం, మునసబుల ఆధిపత్యంలో గ్రామ పరిపాలన సాగుతూ ఉంటుంది. రైతుల నుండి శిస్తు వసూలు చేయటం, గ్రామం బాగోగులు చూడటం, చిన్న చిన్న తగవులు పరిష్కారం చేయటం వంటి బాధ్యతాయుతమైన పనులన్నీ వారే చూచుకుంటారు. వారు ఆ బాధ్యతను వెనుకటి కాలంలో ధర్మసమ్మతంగా నిర్వహించేవారేమోకాని రాను రాను-పదవీగర్వం వారిచేత చేయరాని అన్యాయాలను చేయిస్తున్నట్లు కనపడుతుంది.

"కరణము సాధై యున్నను
కరి మద ముడిగినను బాము కరవక యున్నన్
ధర తేలు మీటకున్నను
గర మరుదుగ లెక్కగొనరు గదా సుమతీ!"

అన్నట్లు-కరణం సాధువుగా ఉంటే జనం లెక్క చేయరని భయం చేతనో ఏమో-వారు సాధారణంగా పరపీడన పరాయణులుగానే ఉండేవారు. జనం వారి దయాదాక్షిణ్యాల కోసం అరులు చాచవలసి వచ్చేది. సుమతీ శతకకారుడు ఈవిషయం గురించి కూడా చక్కగా చెప్పాడు.

"కరణముల ననుసరించక
విరసంబున దిన్న తిండి వికటించు సుమీ
యిరుసున గందెన బెట్టక
పరమేశ్వరు బండియైన బారదు సుమతీ!"

అందుకే—

"కరణంతో కంటు పడితే, కాడి కదలదు!"

"కరణాన్ని కంసాలిని కాటికి పోయినా నమ్మరాదు!"

ఇటువంటి సామెతలు మనకు పుట్టాయి. అందరు కరణాలూ మునసబులూ ఇంత గండ్రితనం చేస్తారని కాదు కాని మొత్తం మీాద గ్రామాధికారులు పదవీ దుర్వినియోగం చేయటం సామాన్య విషయం.

వీరు కాక, ఊరి పెద్దలు, పెత్తందార్లు - కొంత మంది ఉంటారు. మంచితనంతో, మాటకారి తనంతో మేధా సంపదతో-ఊరి పెద్దలుగా అర్హతను సంపాదించు కున్న వీరు-ఊరికి సంబంధించిన ఏవిషయమైనా నెత్తిన వేసుకు చేస్తారు. ఊరందరికీ వీరి మాటపైన గురి ఉంటుంది. ఊరి మధ్యగా ఉండే ఏ మర్రిచెట్టు నీడో ఈ పెత్తందార్ల కచేరి. అదే, ఆ ఊరి రాజకీయాలు రవళించే రచ్చబండ. ఊళ్ళోకి ఏ కొత్తవ్యక్తి వచ్చినా, వీరిని తప్పించుకుని వెళ్ళటం జరగదు. ఊళ్లోవాళ్ళ స్వవిషయాలు, కష్టసుఖాలు-అన్నీ వీరికి అప్పటి కప్పుడే తెలిసిపోతుంటాయి. పండుగ పబ్బాల సమయంలోనూ,

దేవుడి గుడిలో ఉత్సవాలు, ఊరేగింపుల సమయంలోనూ - వీరు చేసే హడావిడి ఇంతా అంతా కాదు !

ప్రతి ఇంటికీ దేవుడి గూడు ఉన్నట్లే, ప్రతి ఊరికీ చిన్నదో పెద్దదో దేవాలయం ఉండి తీరుతుంది. ఏదో ఒక దైవం ప్రతి ఊరికీ ఆరాధ్య దైవంగా ఉండి ఉంటాడు. ఒక్కొక్క పేరున్న స్వామికి ఒక్కొక్క ప్రత్యేకమైన ఉత్సవం జరుగుతుంది. కొంతమంది దేవతలకు ఉత్సవ సమయాల్లో జాతరలు, తిరునాళ్ళు జరుపుతారు. ఈతిరునాళ్ళు వచ్చినప్పుడు గ్రామ ప్రజలో నవోత్సాహం వెల్లివిరుస్తుంది. దైనందిన కార్యక్రమాలతో, పనులతో విసిగిపోయిన జనానికి ఆ సమయాలు ఆటవిడుపుగా ఉంటుంది. చిన్నా పెద్దా, పడుచు వారూ, ముసలి వారూ - అంతా ఎంతో ఉత్సాహంతో ఆ వేడుకలలో పాల్గొంటారు. ఉన్నంతలో మంచి బట్టలు కట్టుకుని వినోద కాలక్షేపాలు చేస్తారు. ఈ ఉత్సవాల రోజులలో-వీధినాటకాలు ఆడేవాళ్ళు, దొమ్మరి వాళ్ళు తోలుబొమ్మలాటలు ఆడించే వారు-వచ్చి వినోద కాలక్షేపాలు చేసేవారు. వీరందరికి సంవత్సరానికింత గ్రామస్థులందరూ కలిపి ఇచ్చే ధాన్యమో రొక్కమో మామూలుగా ఉండేది. ఇదికాక అప్పటికప్పుడు ఎవరికి తోచినది వారు వారి వారి సంతోషం కొద్దీ ఆ కళాకారులకు బహూక రించేవారు. ఈ కళాకారులు కొన్ని కొన్ని గ్రామములు కొంత మంది-అని ఏర్పాటు చేసుకుని ఏటా వస్తుండడము చేత-గ్రామ ప్రజలకూ వారికీ-సన్నిహిత సంబంధం నెలకొని ఉండేది. ఒకరి కష్టసుఖాలు మరొకరికి తెలిసి ఉండేవి.

పల్లెటూరి కట్టుబొట్టులతో పెరిగే కన్నెపిల్లలు, దోర వయసు వన్నెకాళ్ళు, వరుసైన వాళ్ళు-ఆడ, మగ భేదం లేకుండా ఈ సందర్భంలో కలిసి తిరుగుతారు. మామూలు సమయాల్లో బావలకు మరదళ్లు చాటుకు పోయినా, అప్పుడు మాత్రం ఎదురు పడి వేళాకోళాలు ఆడుకోవడానికీ, సిగ్గును అభినయించటానికీ తగిన స్వేచ్ఛ లభిస్తుంది.

దైవ సంబంధమైన ఉత్సవాలే కాక, సంవత్సరం పొడుగునా వచ్చే తెలుగు పండుగలు, పెళ్ళిళ్ళు, పేరంటాళ్ళు, పల్లె పట్టులలో ఎంతో ఉత్సాహంగా జరుపుకుంటారు. ఊళ్ళో ఒక పెళ్ళి వచ్చిందంటే ఊరందరికీ పండుగే! సైన్సు సంపాదించిన అధి భౌతిక దృక్పథానికి అలవాటు పడిన తెలుగుప్రజ పట్టణ ప్రాంతాలలో ఈ పండుగ పర్వాలు ఏదో నామమాత్రంగా జరుపుకుంటున్నారు - కాని ఇప్పటికీ ఈ పండుగల విషయంలో తెలుగు తనపు ఆచార నిష్ఠ గ్రామాలలో కనిపిస్తుంది.

సంక్రాంతి ప్రత్యేకించి కర్షకులకు ఆనందదాయకమైన పండుగ. కొన్ని నెలలుగా తాము పడిన శ్రమకు ఫలితం లభించి-ఇంటినిండా ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి-తాండవ మాడే సమయమది.

మకర సంక్రమణానికి ముందు ముప్ఫై రోజులూ ధనుర్మాసం. ఈ నెలరోజులూ ఊరివారికి పండుగ రోజులే! ఇళ్ళకు వెల్లలూ రంగులూ వేయించుకోవటం, వ్యవసాయ పనిముట్లు బాగు చేయించుకోవటం రైతులు చేసుకుంటారు. ఆడవాళ్లు ఇంటి అలంకరణతో పాటు రోజూ చీకటితో లేచి

వాకిలి ముందు శుభ్రంచేసి గోమయంతో కళ్ళాపు చల్లి, ముగ్గులు పెట్టి వాటి పైన గొబ్బెమ్మలు పెడతారు. దాసర్లు గంగిరెద్దులవారు, బుడబుక్కలవారు, జంగందేవర్లు పల్లెటూళ్ళలో ప్రత్యక్షమవుతారు.

చక్కని రంగు రంగుల చీరలతో, కండువాలతో, పూసల పేరులతో గంగిరెద్దును అలంకరించి-వాటి కొమ్ములకు రంగు వేస్తారు. ఎర్రని కండువా తలపాగా చుట్టి, పంచె పైన నల్లకోటు ధరించి నోట్లో సన్నాయి పెట్టి ఊదుతూ, మెడలో వేలాడే డోలును మధ్య మధ్యలో మోగిస్తూ-బసవన్న చేత పాటకు అనుగుణంగా తాను నేర్పిన విద్యలు ప్రదర్శింపచేస్తాడు.

"డూడూ డూడూ యెంకన్నా
అమ్మగారికీ దండం పెట్టూ
అయ్యగారికీ దండం పెట్టూ
పెబువు గారికీ దండం పెట్టూ
సీతమ్మ గోరికి దండం పెట్టూ
రామయ్య గోరికి దండం పెట్టూ"

అంటూ బసవడి చేత విన్యాసాలు చేయిస్తే-ఆ యింటి అమ్మగారూ అయ్యగారూ నిజంగానే సీతమ్మగారూ రామయ్య గారూ అంతగా ఎదిగిపోయి-వాకిటి ముందుకు వచ్చిన బసవన్నను శక్త్యానుసారంగా సత్కరిస్తారు!

వెనుకటి రోజుల్లో పల్లెలలో ఉమ్మడి కుటుంబాలే ఉండేవి. ఆ నాటి మన సాంఘిక జీవన లక్షణం సమిష్టి

కుటుంబ పద్ధతి. తండ్రి జీవించి ఉన్నంత కాలం అతడిదే ఇంటి పెత్తనం. అతని తదుపరి పెద్దకొడుకు కుటుంబానికి ఆధిపత్యం వహించే వాడు. అతడి భార్య ఇంటి వ్యవహారములలో యజమానిగా పరిగణింపబడేది. మందీ మార్బలంగల కుటుంబం మన్ననకు పాత్రంగా ఉండేది. కష్టం సుఖం వస్తే కలిసి పంచుకోవడం-ఒకరికొకరు అండదండలు కావటం ఈ సమిష్టి కుటుంబాలలో లభించే సౌలభ్యం.

ఈ ఉమ్మడి తనం తెలుగు వారికి ఎంత ఇష్టమో కాని, పిల్లలకు సంబంధాలు మేనరికం ఉంటే బయటకు పోకూడదనే ఆచారంగా మారింది. దగ్గర బంధువుల లోనే పెళ్ళిళ్ళు చేయటం, అయిదు రోజుల పెళ్ళి వేడుకలు-వెనుకటి మన గ్రామజీవితంలో భాగాలు. పెళ్ళి పాటలవంటి జానపద సాహిత్యం పట్ల నవనాగరిక సమాజానికి చిన్న చూపు ఉంటే ఉండవచ్చును గాక - అవి తెలుగు గుండె అనుభవించే తీపినీ, చేదునీ, ఆనందాన్నీ, తపననీ, కోరికనూ, వలపునూ మూటకట్టి అందించే రమణీయ కల్పనలు మాత్రం అవును. ఆ పాటల్లోని విసురు, చమత్కారం, ఆర్ద్రత-పెళ్ళిపందిట్లో ఉన్నవారందరినీ వివశుల్ని చేస్తుంది. తెలుగు భాష తీయదనమంతా ఆ పాటలలో ప్రతిధ్వనిస్తుంది.

బాలగేయాలూ, లాలి, జోల, మేలు కొలుపు పాటలూ, గొబ్బి, కోలాటపు పాటలూ, శోభనము, కోత, నూర్పిడి సువ్వి పాటలూ - చిలుక, తుమ్మెద, ఉయ్యాల పదాలూ వంటి గ్రామీణుల సాహిత్యం ఎంతో విశిష్టమైనది.

మనస్సులను పరవశింప చేసే భావన, రాగంతో వారు ఈ పాటలు పాడుకుంటారు.

సాధారణంగా అత్తాకోడళ్ళ మధ్య బాంధవ్యాలు అంతంత మాత్రంగా ఉండటమే కాక ఒకరిపైన ఒకరికి మాత్సర్యం ఉండటం లోకాచారం! కాని దానికి భిన్నంగా ఒక మంచి అత్తగారు ఒక మంచి కోడలిని గురించి గర్వంగా చెప్పుకునే ఈ మాటలు వింటే-

"చిలకల్లు చిలకల్లు అందురే గాని
చిలకలకు రూపేమి పలుకులే గాని
చిలకల్లు మా యింటి చిన్ని కోడళ్ళు!"

హృదయంపై చల్లనిపన్నీరు చిలకరించినట్లు ఉంటుంది!

అసలు తెలుగు జాతి ఆచార వ్యవహారాలను గీటు తప్పకుండా ఆచరిస్తూ పోషిస్తూ వచ్చింది మన గ్రామప్రాంతపు స్త్రీలే. వీరు ఒక విధంగా చాలా శ్రమజీవులని చెప్పవచ్చు. పట్టణాలలో నాగరక స్త్రీలకు లభ్యమయ్యే గృహోపకరణ వస్తువులూ, మిషన్లు, ఆమెకు అందుబాటులో ఉండవు. పల్లెటూళ్ళలో ఆస్తిపరులైన వారు గ్యాస్‌స్టౌ, కుక్కర్ వంటి పరికరాలను కొనుక్కో గలుగుతున్నారు కాని, మధ్య తరగతి ఇల్లాళ్ళు - పొయ్యిలోకి పొలంలో లభ్యమయ్యే కంది కంపలనూ, తాటి మట్టలనూ. కట్టెలనూ ఉపయోగిస్తున్నారు.

విష్ణుచిత్తుని భార్య అతిథి అభ్యాగతులకోసం ఎటు వంటి వంటలు చేసేదో వ్రాస్తూ, ఆ వంటలు వండటానికి

ఉపయోగించే వంట చెరకును గురించి కృష్ణదేవరాయలవారు తమ ఆముక్తమాల్యదలో చక్కగా వర్ణిస్తారు.

"గగనము నీరుబుగ్గ కెనగా జడివట్టిన నాళ్ళు భార్య క
న్వ్యాగ సొరకుండ నారికెడపుం జాతియల్లవులించి వండ న
య్యాగ పల ముంచి పెట్టు గలమాన్నము నొల్చిన ప్రప్పు, నాలుగే
న్వ్రేగిపిన కూరలున్ వడియము ల్వరుగుల్పెరుగు న్ఘృతప్లుతిన్!'

విష్ణుచిత్తుడు భార్య కన్నులకు పొగరాకుండా జాగ్రత్త పడి ఎండాకాలంలో ఎండబెట్టించిన కొబ్బరి బొండాలు ఆమె వంటకు ఉపయోగించేదట! ఇప్పటికీ ఎండిన తాటి కాయలు, కొబ్బరి బొండాలు-వంటివి ముక్కలుగా చేసి వంటకు ఉపయోగించటం పల్లెలలో ఇల్లాళ్ళు చేసేపనే!

"భర్త తోడ గష్టపడు సంప్రదాయమ్ము
వెన్నతోడ నేర్చుకొన్న దామె!"

శారీరకమైన కష్టం ప్రొద్దస్తమానం విసుక్కోకుండా చేయటం చిన్నతనం నుంచీ ఆమెకు అలవాటయిపోతుంది. మామూలు ఇంటి పని, పాడిపని, పిల్లల పని చేయటంతో పాటు-మధ్యాహ్నం వేళలో పొలం వెళ్ళి, అక్కడ వ్యవసాయపు పనుల్లో ఒకచెయ్యి వేసి, ఇంటికి వచ్చేటప్పుడు ఏ గడ్డిమోపో నెత్తిన పెట్టుకు వస్తుంది. ఆ పనికి ఆట విడుపు ఉండదు. అదంతా బానిసత్వమనే భావన ఉండదు సరికదా-ఆమె ముఖాన చిరునవ్వు వీడదు ఆ ఓర్పుమంతురాలికి.

చూడండి-ఒకవైపున కండలు కరిగే కష్టం చేస్తూ కూడా ఆమె ఎంతటి సరసతను ప్రదర్శిస్తుందో!

"పువ్వులు కొప్పునం దఱిమి, ముందుగ గొనసియాడుచుండగా
జివ్వున జంగ సాచి, యొక చేతను రోకలిం బూని, యొయ్యనన్
నవ్వు మొగంబుతోడ, దననందను బాడుచు, నాథుజూచుచున్
సువ్వియ సువ్వి యంచు నొక సుందరి బియ్యము దంచె
ముంగిటన్!"

వీటన్నిటితో పాటు, కడుపుకు ఇంపయిన కమ్మని వంటలు, పిండివంటలు-చేసి జిహ్వను రంజింప చేయటం కూడా ఒక కళాభినివేశమే!

పసి బిడ్డను వొళ్లో కూర్చో పెట్టుకుని, అరచేయి తెరిచి పట్టుకుని తెలుగు తల్లి పంచభక్ష్య పరమాన్నాలు ఏ విధంగా వడ్డించి తిన బెడుతుందో చూడండి!

"అన్నం పెట్టి, అప్పపెట్టి
గారె పెట్టి బూరె పెట్టి
పాలుపోసి పరమాన్నం పోసి
అప్పడం పెట్టి దప్పళం పెట్టి
గుంటపెట్టి గుంట నిండ నెయ్యి పోసి
కూరపెట్టి నార పెట్టి"

ఇలా సాగి పోతుంది కథ!

ఈ వంటకాలన్నీ కాక కొబ్బరి నీళ్ళు, తాటి ముంజలు తాటిపళ్ళు చెరుకు గడలు, తేగలు, ఈతపళ్లు-కాలాను

సారంగా మన గ్రామప్రాంతాల్లో లభించే తినుబండారాలు, కూరగాయలో, పండూ ఫలమో ఊళ్లోవారు ఎవరికి పండినవి వారు ఒకరికొకరు ఇచ్చుకోవటం-కష్టం వచ్చినా సుఖం వచ్చినా, అంతా పోగవటం, పల్లెప్రజల సహ జీవనానికి తార్కాణాలు. చుట్టపక్కాలు వస్తే - ఒకరికొకరు పాలూ పెరుగూ ఇచ్చిపుచ్చుకోవటం సహజం. బయట ఊరి నుంచి ఎవరైనా వచ్చినా, ఊళ్లోవాళ్ళే ఒకరికొకరు ఎదురైనా కుశలప్రశ్నలతో, కబుర్లతో కాలక్షేపం చేస్తారు.

పోస్ట్‌మాన్ ఉత్తరంతో పాటు ఒక పలకరింపు కూడా బట్వాడా చేసి పోతాడు. అవసరం అయితే - తాను అందించిన ఉత్తరం చదివి వినిపించి, పిచ్చాపాటీ మాట్లాడి, కాస్త మజ్జిగ దాహం పుచ్చుకుని వెళతాడు! గుళ్ళో పూజారి గ్రామస్థుల తలల మీద శఠగోపురం పెడుతూనే - వారిని కుశలం అడుగుతాడు. ఊరివారి విభిన్న వర్గాల మధ్య ఉండే సామరస్యానికి ఇది నిదర్శనం.

కాని, మిగతా అన్ని ప్రాంతాల వలెనే, మన తెలుగు దేశపు గ్రామాలలో కూడా-ఈ దగ్గరతనం, ఊరుమ్మడితనం-క్రమంగా అంతరించి పోవటం మన దురదృష్టం. అమాయకులని పేరుపడ్డ పల్లీయులలో బలా బలప్రదర్శనలు, కక్షలు పార్టీలు-సర్వసామాన్యం అయిపోయాయి. స్పర్థ, స్వార్థం, పేచీలు, కోర్టుకెక్కటాలు, పొలం తగాదాలు - గ్రామవాసులకు మామూలై పోయాయి. అంతరంగంలో ఆత్మీయతా

భావం, సహజీవన సిద్ధాంతం, మన పల్లెలలో ఇప్పుడు కరువైనా యేమో-అనిపిస్తుంది. ప్రతి ఊరికీ కొంతమంది ఉలిపికట్టెలు తయారయినారు, ఇటువంటి వారిని గురించే-

"ఊరందరిదీ ఒక దారి, ఉలిపి కట్టెది ఇంకొకదారి !"

"నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుంది !"

వంటి సామెతలు పుట్టాయి.

గ్రామస్థుల మనస్సులలో సమార్ద్రమైన భావుకతకు లోటు ఉండదు! వారిలో కావ్యాలు అల్లక పోయినా కవితా హృదయం కలవారు ఉన్నారు.

బిడ్డ గుక్కపట్టి ఏడుస్తున్నది. ఏడ్చి ఏడ్చి ఆ పసి బుగ్గలు కందిపోయాయి. పొలందాపున చెట్టు కొమ్మకు కట్టిన గుడ్డఊయ్యాల ఊపుతూ తల్లి-ఆ బుగ్గలు కందటాన్ని ఎంత మనోహరంగా చెపుతుందో చూడండి !

"చక్కని నా తల్లి గుక్కపట్టింది
చెక్కుటద్దాలలో చెదరెనే సంజ !"

వర్షాగమనం కోసం ఎదురు చూచేరైతు-ఆకాశంకేసి చూస్తూ మబ్బుకన్నెను దిగిరమ్మని కోరుతాడు. రకరకాలుగా ఆ మేఘాన్ని వర్ణించి పొగుడుతూ ఇలా పాడుతాడు,

"కారుమేఘమా రావే రావే !
పువ్వుల మబ్బా రావే రావే !
పింజ మేఘమా ధూళి మేఘమా
చెమటను ఊడ్చి దిమ్మరింపవే!"

చెమటను ఊడ్చటం మాత్రమే తెలిసిన రైతు అంతకన్నా అందమైన భాషతో ఎలా పిలుస్తాడు పువ్వులమేఘాన్ని!

'తెలి చందమామలో ఉండే తియ్య పానకాన్ని తెచ్చి పెడుదువు గాని రమ్మని'-ప్రియుణ్ణి పిలుస్తుంది మరో కన్నె పడుచు.

అక్షరాస్యులు కాకపోయినా, భావుకతకు, రసజ్ఞతకు-జానపదులలో కొరతఉండదని నిరూపించే ఇటువంటి అందమైన పదాలు సహజ సుందరంగా ఉంటాయి.

పల్లెలో పెరిగేపిల్లలు ప్రకృతితో ఆడుకుంటారు. వారు ఆడుకునే ఆటలు శరీర వ్యాయామానికే కాక, విజ్ఞానాన్ని కూడా ఇవ్వగలిగినవి. వెనకటి కాలంలో ప్రతి ఊరికీ సాము శాలలు ఉండేవి. మల్లవిద్య. బాణాకర్రతో యుద్ధం చేయటం, దండేలు-బస్కీలు తియ్యటం, ధనుర్విద్య-వంటివి యువకులు నేర్చుకుంటూ ఉండేవారు. ఆ కాలం అంతరించిపోయి ఈనాడు పల్లెలలో యువకులు పేకాట విద్యలో ఆరితేరినవారయినారేమో ననిపిస్తుంది. దీనికి తార్కాణం ఏ పల్లెలో చూచినా ఏ చెట్టుక్రిందనో, గొడ్ల చావడిలోనో సోమరితనం మరిగిన యువకులు గుంపులుగా కూర్చుని పేకాటలో మునిగిపోయే దృశ్యం కానవస్తుంది.

ఆడపిల్లలు - బొమ్మలపెళ్ళిళ్ళు, గుజ్జెన గూళ్ళు, అచ్చన గాయలు, చెమ్మాచెక్క, వొప్పులకుప్ప, అష్టా చెమ్మా, నాలుగుస్థంభాలాట, గవ్వలు, పరమపదసోపానపటం, వామనగుంటలు, పచ్చీసుపాళీ-వంటి ఆటలు ఆడుకునే

వారు. ఇప్పటికీ పల్లెపిల్లలు ఈ ఆటలను కొద్దిమార్పులతో ఆడుతూనే ఉన్నారు.

రుక్మిణీదేవి ఆ నాడు ఏయే ఆటలను ఎట్లా ఆడుకునేదో బమ్మెర పోతన్నగారు భాగవతంలో ఇలా వర్ణించారు.

"వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు నబలల తోడ వియ్యంబులందు
గుజ్జెన గూళ్ళను గొమరొప్ప వండించి చెలులకు బెట్టించు జెలువు మెరసి
రమణీయ మందిరా రామ దేశంబుల బువ్వా దిగెంకును బ్రోదిపెట్టు
సదమయ మణిమయ సౌధభాగంబుల లీలతో భర్మడోలికల నూగు
బాలికల తోడ జెలరేగి బంతులాడు శారికా కీరపంక్తికి జదువు చెప్పు
బ్రాణి సంఘములకు మారిపములు గరపు, మదమరాళంబులకు జూపు మందగతులు!"

పాళ్ళీమళ్ళీ చావడం-మళ్ళీమళ్ళీ పుట్టటం - అన్నది జీవన సత్యం. ఈ సత్యాన్ని ఆటలో నిరూపించ గలిగినది- పరమ పద సోపాన పటము, లేక వైకుంఠ పాళీ అనే ఆట. పరమ పదాన్ని అందుకోవాలంటే, వైకుంఠ ద్వారానికి చేరాలంటే-మనిషి ఎన్ని జన్మలు ఎత్తాలో! ఎన్ని తపస్సులు చేయాలో! ప్రారబ్ధకర్మ తీరేటంత వరకూ ఈ సంకటం తప్పదు. ఒక నిచ్చెన ఎక్కటం-ఒక అంతస్థును అందుకున్నా

అనే గర్వం కలగడం, మళ్ళా ఒక పాము కరిచి అగాధంలో పడటం-మళ్ళా ఓపికతో లేచి జీవన సమరం సాగించడం-అనే అమూల్య సత్యాన్ని ఆడేవారి మనస్సులలో కదిలేట్లు చేస్తుంది ఈ ఆట.

వెనక మన గ్రామాల్లో ఎక్కువగా పూరిళ్ళు, పెంకుటిళ్ళు ఉండేవి. ప్రతి ఇంటా మండువా లోగిలి, ఉయ్యాలబల్ల, కచేరి చావడి, ఇంటి వెనుకగా గొడ్ల చావడి-ఉండేవి. ఇప్పుడిప్పుడే పల్లెటూళ్ళలో కొంతమంది ధనికులు డాబాలూ, మేడలూ వేసి కావలసిన సౌకర్యాలు-చేసుకుంటున్నారు.

మన గ్రామవాసులు వేషంలో నాగరికతను ఇంకా తెచ్చి పెట్టుకో లేదు.

"చుంగుల్ వారిన ఖాది చుట్టి, చొక్కాను పైసేసి, ముంజెంగుల్ గుచ్చెళులంట జెక్కి కులుకుం జెప్పుల్ సమాళించి రంగుల్ గుల్కెడు చెంద్రకోల ములు గట్టం బూని కోటేరుతో సింగారమ్మాయి పోవు రైతు సిరి...."

గ్రామాల్లో కనిపిస్తూనే ఉంది మనకు.

కలవారి ఆడపడుచులు వెనుకటి ఆభరణాలతో పాటు క్రొత్తక్రొత్త నమూనాల నగలను ధరిస్తున్నారు. నాగరం, జడబిళ్ళ, కుప్పెలు, వడ్డాణం, కాసుల పేర్లు, పాంజేబులు-వంటివి ఎక్కువగా పల్లెప్రాంతాల జనం ధరించే ఆభరణాలు.

ఉన్నవారికే ఈ ఆభరణాలన్నీ. లేమిలో పుట్టి పెరిగే పేద ముత్తయిదువుకు మెళ్ళో పసుపు తాడుతో కట్టిన

మంగళసూత్రం-నల్లపూసల పేరు, మట్టిగాజులే పెట్టని నగలు. కలిమి కలవారికి ఎన్ని వేషభాషలు, భూషణ విశేషాలు-మార్చినా చెల్లిపోతుంది కాని, లేమికి కాలభేదం లేదు. ఎన్నాళ్ళున్నా, దారిద్ర్యం మనుష్యుల స్థితిగతులను మారనీయదు.

ఇంత చెప్పి, పల్లెటూళ్ళకు ప్రాణాధారమైన నీలాటి రేవును గురించి ప్రస్తావించక పోవటం అన్యాయమే అవుతుంది.

కడవలూ, బిందెలూ చంకనెత్తుకొని ఊళ్ళో ఆడవాళ్ళు నీళ్ళకోసం వెళ్ళే నీలాటి రేవు - ఒక రమణీయ దృశ్యంగా ఉంటుంది. అది మంచినీళ్ళబావో, కాలవగట్టో కావచ్చును. నీళ్ళకోసం వచ్చిన ఆడవాళ్ళు ఒకరి నొకరు కలుసుకోవటానికీ, కబుర్లు చెప్పుకోవటానికీ వీలయే స్థలమూ, కాలమూ అదే! ఊళ్ళో జరిగిన, జరుగుతున్న అనేక విషయాలను గురించి ఆ ముచ్చట్లు ఉంటాయి. అంతకు మించిన ప్రపంచ పరిజ్ఞానం కాని, విస్తృతమైన దృక్పథం కాని-వారి వారి మధ్య ఏర్పడి ఉండటానికి అవకాశం తక్కువ. ఏది ఏమైనా, ఇంటిపనులతో నాలుగు గోడల మధ్యా మగ్గిపోయే ఇల్లాళ్ళకు ఈ నీలాటి రేవు కాస్సేపు ఊపిరి పీల్చుకునే అవకాశం ఇస్తుంది.

కాని, ఈ నీలాటి రేవులు మాత్రం ఎన్ని పల్లెలకు ఉన్నాయి! చాలా ఊళ్ళకు మంచినీటి వసతి లేదు. మంచి నీళ్ళకోసం కొన్ని మైళ్ళు నడిచి తెచ్చుకోవలసి రావటం-చాలా పల్లెలలో ఉండే ఇబ్బందే. ప్రాణాధారమైన మంచి

నీళ్ళు అందుబాటులో లేకపోతే కలిగే కష్టం ఇంటి ఇల్లాలికే తెలుస్తుంది.

సస్యశ్యామలంగా ఉన్న భీమ మండలాన్ని తన్మయానందంతో వర్ణించిన శ్రీనాథ మహాకవి-మరొక ప్రాంతంలో ఉన్న పల్లెటూళ్ళనూ అక్కడి అసౌకర్యాన్ని, అనాగరికతనూ గురించి ఇలా చెపుతాడు.

> "చిన్న చిన్న రాళ్లు చిల్లర దేవుళ్ళు
> నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
> సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులును తేళ్ళు
> పల్లెనాటి సీమ పల్లెటూళ్లు."

నాగార్జున సాగరం పరవళ్ళు త్రొక్కుతూ పలనాటి సీమను సారవంతం చేస్తున్న, ఈ రోజుల్లో కూడా కొన్ని పల్లెనాటి సీమ పల్లెటూళ్ళకు నీళ్ళ కరువు అలాగే ఉంది.

నీళ్ళ కరువే కాక, అజ్ఞానం, నిరక్షరాస్యత, మూఢ నమ్మకాలు, అస్పృశ్యత, దారిద్ర్యం, పగలు, ద్వేషాలు- పల్లెటూళ్ళను పట్టుకు పీడుస్తున్నాయి. ప్రతిఊరికి - కాస్త ఎడంగా మాదిగపల్లి, మాలపల్లి ఉంటుంది. చాలాచోట్ల వారు అంటరానివారుగానే పరిగణింప బడుతున్నారు. దారిద్ర్యంలో పుట్టి, దారిద్ర్యంలో పెరిగి, దారిద్ర్యం లోనే తనువు వెళ్ళమార్చే ఈ నిర్భాగ్యులు ఏనాటి భుక్తికి ఆనాడు తంటాలు పడవలసిన వారే! వాళ్ళ ఆడవాళ్ళు ఏనాడూ కోమటి కొట్టుకు వెళ్ళి అయిదుపైసల చింతపండు,

పదిపైసల ఉప్పు, పావలా మిరపకాయలు - తెచ్చుకుని కారం ముక్కలతో కాలం గడపవలసిన వారే!

పగలంతా కాయకష్టం చేసే మగవాళ్ళు హుషారు కోసం, శరీర శ్రమ మరిచి పోవటం కోసం, రాత్రిపూట నాటు సారా తాగుతారు. కొంతమందికి అది వ్యసనం క్రింద మారుతుంది. వాళ్ళపిల్లలను సాధారణంగా బడికి పంపరు. ఊహ తెలియగానే ఏదో ఒక పనిలో ప్రవేశ పెడతారు.

ఇంకా చాలా ఊళ్ళకు కరెంటు కాని, మంచి రోడ్లు కాని, రవాణా సదుపాయాలు కాని సరిగా లేవు. ఒక నాడు ప్రశాంతతకు పేరుపడ్డ పల్లెటూళ్ళు నేడు వర్గ కలహాలకు నిలయాంగా ఉంటున్నవి.

ఈ పరిస్థితి మారాలి. మారటానికి చాలాకాలం పట్టు వచ్చు, అందుకుగాను, చదువుకుని విజ్ఞాన వంతులైన యువకులు నడుము కట్టుకుని మన పల్లె సీమలకు తరలి వెళ్ళాలి. అక్కడ నిరక్షరాస్యులైన పల్లెప్రజలలో విజ్ఞాన దీపాలు వెలిగించాలి. మూఢకనీ అజ్ఞానాన్నీ, అంతఃకలహాలనీ రూపుమాపటానికి యువత ముందుకు రావాలి. ఊరిపెద్దలు వర్గ వైరుధ్యం మాని, కలిసికట్టుగా ఉండి గ్రామాభివృద్ధికి పాటు పడాలి.

మనం తినే తిండి, మనం కట్టేబట్ట-ఉత్పత్తి చేసి, మనకు అందించే సౌభాగ్యసీమలు మన పల్లెసీమలు. తెలుగు సంస్కారాన్ని మూర్తీభవింప చేసుకున్న గ్రామసీమలు-

* * *

# తెలుగు ఆడపడుచు - యెంకి

"ఎంకెవ్వారని లోక మెప్పుడైన కదిపితే
వెలుగు నీడల పైపు వేలు సూపింతు !"

ఈ రెండు పాదాలకీ ఈడైన కవిత్వం ఈ ప్రపంచ వాఙ్మయంలో ఎక్కడా కనిపించదు-అంటారు చలం.

యెంకితో దివ్య ప్రణయానుబంధం సిద్ధింప చేసుకుని, ఆ దివ్యాను భూతిని గుండెల నిండుగా నింపుకున్నవారు నండూరి వెంకట సుబ్బారావు గారు. పరమార్థాన్ని అందు కొన్న ప్రణయ తత్వం అది. పరిపూర్ణత సిద్ధించిన పూర్ణ యోగం అది. ఆ పరమ సుందర భావం పుక్కిలింతలై, వెల్లువై - విరుచు కొని వచ్చి - ఆ మహాకవి వాక్కులో, గాత్రంలో-రూపం దిద్దుకొని 'యెంకి పాటలు'గా వెలిశాయి. తేట తెలుగు పద లాలిత్యం, స్త్రీపురుష పరమార్థ సాధక మైన శృంగార భావం, రాధాకృష్ణుల ఆధ్యాత్మిక ప్రేమ తత్వం కలిసి-యెంకిపాట లైనాయి. తెలుగు జాతి పుణ్య వశాన అవి తెలుగు పాటలుగా పుట్టాయి.

యెంకి పాటల ప్రాదుర్భావం-1917-1918 ప్రాంతంలో జరిగింది. కవితా సాక్షాత్కారం 'యెంకి' రూపంలో పొందిన నండూరి-భాషలో-భావంలో - ఆనాడు ఉండిన బంధాలు, నియమాలు-త్రుంచివేశాడు. కవితా మార్గంలో కొత్త పుంతలు తొక్కాడు. అవి ఆనాటి సాహితీ ప్రపంచంలో ఎన్నో దుమారాలు లేవదీశాయి. పండితులూ, ప్రబంధ కవులూ-సాహిత్యాన్ని ఈ భాష మైల పడేసిందని ఈసడించారు. తిరస్కరించారు. సాహిత్యంలో వీటికి స్థానమే లేదు పొమ్మన్నారు.

కాని 'యెంకి' వీటన్నిటికీ ఎదురు నిలిచింది. ఆ గాలి దుమారాల తాకిడికి కొట్టుకు పోకుండా చిరంజీవిగా వర్ధిల్లింది. ఆమె అచ్చ తెలుగు పల్లెపడుచు. ఆమెది జాను తెలుగు జీవద్భాష. ఆమె పోకిళ్ళు తెలుగు పోకిళ్ళు, అందుచేతనే యెంకి తెలుగు దేశంలో ఇంతవరకూ నిలిచి పోయింది.

నండూరి వెంకట సుబ్బారావు గారి పూర్వజన్మ సుకృతమో, తెలుగువారి పుణ్యవిశేషమో కాని-యెంకి ఆయనకు అప్రయత్నంగానే ఒక శుభోదయాన సాక్షాత్కరించింది. ఆయన మద్రాసులో లా చదువు కుంటున్న రోజులవి. భావకవితావేశం చందన సుగంధం వలె తెలుగు దేశమంతా వ్యాపిస్తున్న రోజులవి. బంధువూ మిత్రుడూ అయిన బసవరాజు అప్పారావు సాహచర్యంతో కొంత కవితా పరిజ్ఞానమూ సాహితీ పరిచయమూ అప్పటికే కలిగింది.

ఆ రోజులలో మద్రాసులో ట్రామ్ బండ్లు ఉండేవి. ఒకనాడు నండూరి ట్రామ్ బండిలో ప్రయాణం చేస్తుండగా

ఆ ట్రాం బండి చప్పుళ్ళతో పాటూ-ఆయన గుండెలలో ఏదో మధుర భావం ఉద్వేగంగా ఉబికి వచ్చింది. ఆయన గొంతులో కాస్సేపు కొట్టుమిట్టాడింది. ఆ గుండెలో పుట్టిన అవ్యక్త వేదన, భావోద్వేగం-సాహిత్యానికి జోడుచేసుకుని మననం చేసుకోబోయే సరికి-ఒక తీయని రాగంగా ఉద్భవించింది. ఆ రాగమే ఆయన వ్రాసిన మొదటి పాట. ఆ వచ్చిన సాహిత్యం అంత వరకూ అక్షర బద్ధం కాని, పుస్తకాలకు ఎక్కని భాష. అది అచ్చమైన జానపదుల నోట పలికే సజీవ భాష.

"గుండె గొంతుకలోన కొట్లాడు తాది
కూకుండ నీదురా కూసింత సేపు"

అలా అప్రయత్నంగా ఆయన గొంతులో పలికిన రాగం నిజంగానే ఆయనను స్థిరంగా కూర్చుండనీయ లేదు. ఆ కమ్మని తేనె సోనల రాగం-ఆగి ఆగి ఒక్కొక్క శృంగార భావనగా రూపుకట్టింది. కొండ కోన నుంచి జారివచ్చే సెలయేటి జాలుగా ఒక్కొక్క గీతం గుండె లోతుల నుండి జారి వచ్చింది.

అలా, ఆ వరుసలో-ఆ మహాకవి హృదయం చీల్చుకుని పుట్టాయి యెంకి పాటలు. గుండెలో గుబులు పుట్టినప్పుడల్లా ఒక్కొక్క పాటా వ్రాసుకు పోయాడు ఆ యెంకి ప్రేమికుడు. అందుచేత-అలా అక్షరబద్ధం చేయబడ్డ యెంకిపాటలకు ఒక కథా రూపం లేదు. ఏ పాట కా పాట

అద్భుత శృంగార రసమయ కావ్యం. ఏ పాట కా పాట దివ్యానుభవం కలిగించే మధుర గేయం.

కాని, ఇంత కాలం జరిగినాక, యెంకి-నాయుడు బావల ప్రణయాన్ని, విరహాన్ని, ప్రేమని, తపనని, కోపతాపాలని సరాగాలని - మననం చేసుకుని - వాళ్ళ హృదయాల్ని ఆవిష్కృతం చేసుకుని - ఆ అనుభూతిని కొంత పొంది తాదాత్మ్యం చెందితే-

నండూరి హృదయం చీల్చుకు వచ్చిన నవరాగ సుమాలని మనం ఏర్చి కూర్చి మాలగా అల్లుకుంటే-

సువర్ణ సుందర సుమమాల, రసానంద స్ఫూర్తిని కలిగించే అందమైనకల, కలవంటి కథనం - మన ముందు సాక్షాత్కరిస్తుంది.

"వలపెరుంగక కులికి మురిసే కంటె
వలచి విఫలమ్మొంది విలపింప మేలురా"

అంటాడు బసవరాజు. వలపు తలపుల తీయదనమెరిగిన వారిపై పులకరింతల పూజల్లుల కురిపించే కథ; రసికజన మనోరంజనం ఈ కథ. శృంగార భావనలో మనస్సును మరగింప జేసే తీయని బాధా, శుష్కజీవితాల్లోకి కాస్తంత కమ్మదనం తెచ్చిపెట్టే వలపు గాథా-ఈ కథలో ఉన్నాయి.

ఈ కథ-యెంకి, నాయుడు బావల ప్రణయగాథ. మొదట్లో వాళ్ళిద్దరూ మహా ప్రేమికులు. ఆ తరువాత మనువాడిన ఆలు మగలు. ఒకరంటే మరొకరికి చెప్పరానంత

ప్రేమ. ఆ ప్రేమకు ఆనకట్టలు లేవు. ఒకరు లేకపోతే మరొకరికి అస్తిత్వం లేదు. పాలూ నీళ్ళలా కలిసిపోయారు.

ఏరు, ఏటి దరి తోట-వారి విహార స్థలాలు. వెన్నెల, పూలు, చేలు, ఏటి నురగలు, చంద్రవొంక, ఏతాము, గోవు మాలచ్చిమి-ఇవన్నీ వారి ప్రణయానికి, విరహానికి, వియ్యానికి, కయ్యానికి-కర్మసాక్షులు,

యెంకి అందం : యెంకి వెన్నెలలో నుంచి, వెలుతురు

---

లోనుంచి, నీలి నీడలలో నుంచి, ఆకాశంలో నుంచి-ఊడిపడ్డ తెలుగు పల్లెపడుచు. ఆమె చక్కని చుక్క. నాయుడు బావ మాటల్లో, ఆ పిల్ల "రాసోరింటికైనా రంగు తెచ్చే పిల్ల"

"కళ్ళెత్తితే సాలు కనకాబిసేకాలు
సెక్కిట సిన్నీ మచ్చ సెబితే సాలదు లచ్చ
వొక్క నవ్వే యేలు వొజ్జిర వొయిడూరాలు!"

ఇంతటి అందగత్తె యెంకి. ఆమె కళ్ళ తళుకుల్లో కోటి కాంతుల చమక్కులు. ఆమె నవ్వితే చెక్కిట పడే గుంటలో చెప్పలేనన్ని అందాలు. "అంసల్లె, బొమ్మల్లె, బరిణల్లె, సుక్కల్లె" కనపడి నాయుడుబావ గుండె నీరయిపోయేట్లు చేస్తుంది. అతడిని వెర్రెత్తిపోయేట్లు చేస్తుంది.

"పచ్చన్ని సేలోకి పండు యెన్నెల్లోన
నీలి సీరా గట్టి నీటుగొస్తావుంటె
వొయ్యార మొలికించు నా యెంకి
వొనలచ్చిమనిపించు నా యెంకి!...."

అంటూ ఆమె అంద చందాలని తన్మయంగా వర్ణించు కుంటాడు.

ఎంకి కనుబొమ్మ అందమే అందం. ఆ కనుబొమ్మ తీరు చూస్తే నాయుడు కరువు తీరుతుంది. ఆ కనుబొమ్మ వొంపులో కరిగిపోతాడు. ఇవి చాలు-స్థూలంగా యెంకి రూపం మన కళ్ళముందు బొమ్మ కట్టుకోవటానికి.

యెంకి ముగ్ధత్వం : కన్నెతనం, కొంటెతనం, చిలిపితనం, అమాయకత్వం, రూపు కట్టిన మూర్తి యెంకి. కొంటెతనం చేసి నాయుడి ఓర్పును పరీక్షిస్తుంది. మళ్ళా వెంటనే ఆమె ముగ్ధత్వం చూసి మురిసి పోతాడు.

"నీ తోటె ఉంటాను నాయుడు బావా
నీ మాటె యింటాను నాయుడు బావా"

అంటూ తన్ను తాను సర్వార్పణం చేసుకుంది.

ప్రతిఫలంగా ఆమె కోరింది ఒక్కటే. నాయుడు బావ మనస్సు.

"నువ్వు మరమ మిడిసి మనసియ్యి. నాయుడు బావా!" అంటుంది.

నాయుడుకి ఆమె తోటిదే లోకం. అయినా ఆమె అమాయకత్వం చూస్తే ముచ్చట. ఆమె ఉడుక్కుంటే తనకు అదొక సరదా. ఆట పట్టిస్తాడు ఆమెని.

అతడు పదిమందిలో యెంకి పాట పాడినా, ఇరుగమ్మ పొరుగమ్మ చేరి ఆ పాటను మెచ్చుకున్నా, వాళ్ళతో

నాయుడు వరస లాడినా, యెంకి విలవిల్లాడి పోతుంది. గోడ చాటున చేరి గుటకల లేస్తుంది. ఆ యెంకి చూడాలని ఇరుగు పొరుగమ్మలతో వొరసాడతాడు నాయుడు. అది చూసిన యెంకికి గుండెల్లో గుబులు. ఆ గుబులు చూస్తే నాయుడికి ముచ్చట. ఆ గుబులు రగిలినప్పుడు ఆమె చూసే చూపుల ఠీవి. చూపుల సోద్దెం-నాయుడే చూడాలి! నాయుడే నవ్వాలి!

యెంకి ముద్దరాలి తనం నాయుడుకి వినోదం.

"యెవరి జన్మము లోన యెవరమో నంటె
సిగ్గొచ్చి నవ్వింది సిలక నా యెంకి!
ముందు మనకే జల్మ ముందోలె యంటె
తెల్ల తెల బోయింది పిల్ల నా యెంకి!
యెన్నాళ్ళో మనకోలె ఈ సుకము లంటె
కంట నీరెట్టింది జంట నా యెంకి!"

వెనక జన్మంలోనూ నిశ్చయంగా తామిద్దరూ మొగుడూ పెళ్ళాలే! కాక మరేమవుతారు! ఆ ఊహాతో సిగ్గొచ్చి నవ్వింది యెంకి. ఆ నవ్వినప్పుడు మాటలొచ్చీ సిగ్గుతో మాట్లాడని చిలకలా ఉంది. ముందు జన్మ సంగతి అగోచరం. ఊహాకు అందనిది. తలుచుకోవటానికి భయం. తెల్లబోయిన ముఖంతో నుంచున్న యెంకి చిన్నపిల్లలా తోచింది అతడికి ఈ జన్మలో నయినా ఈ సుఖాలు యెంత వరకు శాశ్వతమో-అనుకునేటప్పటికి దిగులు పుట్టి కంట నీరు పెట్టింది నాయుడి జంట పిల్ల యెంకి.

ముగ్ధత్వానికి ఇది ఎంత మనోహరమైన రూపకల్పన! ఆ జంట ప్రణయానుబంధానికి ఎంత సమార్ద్రమైన చిత్రణ!

నాయుడు దగ్గర ఉంటే ఆమెకు అద్దంతో పనిలేదు!

"అద్దమేలంటాది-అందాలు తెలుప
కంటెదర నా కాడ-కని పాపలో నీడ
సూసుకుంటూ కొసట-సుక్కెట్టు కుంటాది!"

ప్రియుడి కనుపాపలో తన ప్రతిబింబం చూచుకోగలిగిన మెంకిని అమాయకురాలని అనుకోవాలా? ప్రణయార్చనలో పండిపోయిన తపస్విని-అనుకోవాలా!

"అద్దములో నారాజ అంత నీరూపు
ఇంత ముత్తెములోన ఇరికె నేలాగు?"

అంటూ అమాయకంగా ఆమె ప్రశ్నిస్తే,

"ఇన్ని పొంకాలున్న మెంకివే నువ్వు
ఇంత నా గుండెలో ఇమిడి పోలేదా!"

అంటూ అతడు గడుసుగా తిరుగు ప్రశ్న వేస్తాడు.

విడీ విడని అరవిరిసిన మొగ్గలోని ముగ్ధత్వం మెంకిది. ఆ పువ్వులంటే ఆమెకు తగని ప్రేమ. ఆమెకు పూల బాసలూ-పూల మనసులూ తెలుసు. అస్తమానం పూలతో వియ్యాలో, పూలతో కయ్యాలో ఆడుతూ ఉంటుంది పూల మనసులు ఎరిగిన మెంకి. పూలమధ్య పూలపిల్లలా అయి పోయిన ప్రియురాలిని చూస్తుంటే నాయుడికి భయం.

"మానల్లె నన్నుంచి తాని పూవౌనేమొ!"
అంటూ సందేహంలో పడతాడు.

కాని అతడి భయానికి ఆధారం లేదు. నాయుణ్ణి విడిచి ఆమె మాత్రం ఉండగలుగుతుందా! ఆ పూలు దోసెడైతే వరి తెచ్చి అతడి దోసిట్లో పోసి - అంటుందట - నాయుడు చెప్పుకుంటాడు-

"పూలు నాకందిచ్చి నా యెంకి
సొమ్ములేల మన కంటాది నా యెంకి
గుండె జాలి పుట్టిస్తాది నా యెంకి"

యెంకి చిలిపితనం: ఇంత వెఱ్ఱి బాగుల పిల్లా, ఒక్కొక్కసారి ఎంత గడసరితనం చూపిస్తుందని!

నాయుణ్ణి చూసి నవ్వుతుంది. ఆ నవ్వుకి సిరయిపోయి దగ్గరకు వెళ్ళి పలకరిస్తే -యిసిరి కొడుతుంది. 'కన్నుగిలికించి, బులిపించి', దగ్గరకు వస్తే 'అగ్గిసూస్తుంది', "ఇక్కడే ఉండు- ఇప్పుడే వస్తాను"-అంటూనే-ఇల్లు దూరిపోయి మళ్ళీ కన బడకుండా అతణ్ణి విసిగిస్తుంది. యెంకి కోసం చూసి చూసి- నాయుడు విసిగి పోయి యెటో చూస్తుంటే, వెనకాలగా వచ్చి 'యెవరువోరని' అతణ్ణి అదర గొట్టేస్తుంది.

ఇద్దరికీ ఏటిదరి సంకేత స్థలం. వస్తానని చెప్పిన సమయానికి రాదు. ఎదురు చూసి చూసి నిరాశ పడి, ఆమె కొంటెతనానికి ప్రాణం విసిగి-

"రావొద్దె నా పక్క రావొద్దె యెంకీ !
ఆ పొద్దె మనపొత్తు లయి పోయె నెంకీ !"

అనేదాకా వస్తాడు పాపం !

" గట్టెక్కి సూశాను ! పుట్టెక్కి సూశాన !
కల్లకపటము లేని పిల్లవనుకున్నాన !"

అంటూ నిష్టూర మాడతాడు.

నిజంగా కల్లాకపటము లేని పిల్లే యెంకి. అయితే యేం! అది సరసమా మరొకటా! శృంగారంలో ఆ మాత్రం ఉడికించుకోవటాలూ, ఊరుకో బెట్టుకోవటాలూ లేకపోతే ఏమి స్వారస్యం ఉంటుంది!

పాపం, నాయుణ్ణి "రేతిర్లో ఒకణ్ణి తోటకాడ వది లేసిందట !" అతడు 'పచ్చిలా కొట్టొకుతుంటే'-యెంకి కొంటె వేషాలెన్నో వేస్తుంది. అతడు చూచేటట్లు, ఉడుక్కునేటట్లు, 'వొన్నె చీరలు కట్టి వోసుగా' తిరుగుతుంది. ఇరుగమ్మలతో ఎకసక్కాలు ఆడుతూ సెమ్మసెకా్కలాడుతుంది. నాయుడి తిప్పలు 'యీశ్మరుడికే' యెరుక !

ఆమెని ప్రసన్నురాలిని చేసుకోవాలని అతడు ఎంతో ప్రయత్నం చేస్తాడు. బ్రతిమాలుతాడు. చివరకు నిష్టూర మాడుతాడు,

"వొయికుంట మే నీతో వొరుగుతాదని నమ్మి
కలిసున్న నాకాసి కన్నెత్తి సూసేవ !
యింతింత అన్నేయ మూఁటాగ ! " .... అంటాడు.

ప్రియుణ్ణి ఇట్లా కాసేపు ఆడించి, కవ్వించి, గుండె మండిపోయేటట్లు చేసి - ఆ తర్వాత చటుక్కున పగలబడిన వెన్నెల్లా అతడి యెదట పడితే ఎంత ఆనందం! ఎంత పొంగు!

యెంకి విరహం : యెంకికి నాయుడు మొదట ప్రియుడు. ఆ తర్వాత మనువాడిన మగడు. అతణ్ణి ఆమె ఘనంగా, ముద్దుగా 'రాజా' అని పిలుచుకుంటుంది. ఎదురుగా ఉన్నంత సేపూ-'అతని నీడలోనే మేడ'లు కడుతుంది. ఎడబాటు వచ్చిందా-విరహంతో వేగి పోతుంది. కళ్ళనిండా నీళ్ళు నింపుకుంటుంది. ఏటిదరి తోటలోకి వచ్చి, చుక్కల్నీ, పక్షుల్నీ, ఏటి నురగల్నీ, చంద్రుణ్ణీ పలకరించి తనగోడు చెప్పుకుంటుంది.

ఏటి నురగ కేసి తదేకంగా చూస్తుంది. తనవాడి మనస్సు ఏటి నురగల్లోనే మరుగుతుందట! 'మనస్సు మరగటం' ఏమిటో తెలిసిన యెంకికి కాక ఈ కవిత్వం ఎవరికి వస్తుంది!

'పొంక' పోగానే తనవాడు వస్తాడని చంద్రవంక వంక తదేకంగా చూస్తుంది. ఆమె అనుభవించే విరహానికి ఏటి నురగలూ, చంద్రవంకా సాక్షి.

"సీలు తేబోతుంటె నీతోడె వోలమ్మొ
నాయెంట యెవురోను నడిసినట్టుంటాదె!"

అంటూ భ్రమపడుతుంది. నాయుడు ఎప్పుడూ తన వెంట వెంటే తిరుగుతున్నట్లు పగటి కలలు కంటుంది. చల్లని వెన్నెట్లో చాపేసి కూర్చున్నా, యెంకి 'వొళ్ళంతా ఉలికులికి పడుతుందట! ఎంత కమ్మని విరహం! ఎంత తీపిబాధ! ఆ

విరహంలో 'చీమ చిటుకనగానే' మనసు చెదిరి పోతుంది! మనస్సు ఒకచోట నిలవదు. 'కళ్ళకు ఏమిటో మబ్బుపొర కమ్మినట్లు' ఉంటుంది. 'నిద్దకు వొరిగినట్లు వొళ్ళంతా నీరసిస్తుంది. గుండెల్లో ఉండుండి గుబులు గుబులుగా ఉంటుంది.

మాట్లాడుతుండగానే చంద్రుడు తనకిదేమీ పట్టనట్లు సాగిపోతాడు. ఆ చందమామని కాస్త ఆగమని చెపుతూ తనవాడి ఊసులన్నీ చెప్పుకొంటుంది. ఆ నాటి కథలన్నిటికీ ఆ నాటి తీయని అనుభవాలన్నిటికీ చంద్రుడు సాక్షి. ఆ పూలూ, ఆ తోటా-అన్నీ నీవే-అన్నాడు ఆనాడు నాయుడు! కలకాలం ఈ రోజు నిలుస్తుందని బాసలు చేశాడు. గాలికైనా కవుగిలీనన్నాడు! తనకేసీ, చంద్రుడి కేసీ చూసి-'మధ్య చంద్రుడే మనకు పెద్దమనిష'న్నాడు. ఆ మాటలన్నీ తవ్వుకుని తవ్వుకుని యెంకి చెప్పేటప్పటికి-చంద్రుడికి కూడా కన్నీళ్ళు వచ్చాయి. 'ఎంత కనికారమో ఆ చంద్రుడికి'!

ఇదంతా యెంకి-తన భాషలో చెప్తుకుంది. జాలి కలిగేట్లు తన బాధంతా చెప్పుకోవటం, అది విన్న చంద్రుడికి కన్నీళ్ళు రావటం-ఆ కనికారానికి ఎంకి కరిగిపోవటం-ఎంత కమనీయ భావం। ఎంత సమార్ద్ర సన్నివేశం!

"సుక్కెక్కడున్నాదొ సూడవే చెల్లీ!"

అంటూ 'సుక్క' కోసం ఎదురు చూస్తుంది. చుక్కతోనే కొండలెక్కి వస్తానన్నాడట నాయుడు. తాను నిలిపిన గడువు దాటిపోనే లేదు-అయినా, విరహార్తితో 'కాళ్ళూ చేతులూ పక్కకు అంటుకుని పోయినాయి' యెంకికి. కళ్ళ

నిండా నీళ్ళు కమ్మిన యెంకికి-మారాన కొండమీద 'మబ్బో -మనిషో' కానరావటం లేదు. అయినా, ఆ కళ్ళ నిండా నిండిన కన్నీటిని మాత్రం బయటకు రానీయదు!

"కందు తెరుగని మనసు గాయమై పోయెరా
నీకె చేటని కంట నీరు రానీనురా!"

అంటుంది-తాను కంట నీరు పెట్టడం తన వాడికి అశుభం-అనుకునే యెంకి.

పట్ట పగల్లాంటి పటపట లాడే వెన్నెల-ఏటి నురగల్లో మిడిసి మిడిసి పడుతూ ఉంది. ఆ వెన్నెల తమది. ఆ అందం తమది. ఆ వెన్నెల కాసిన రేయంతా తమది. అయితే ఆ నాయుడు ఇప్పుడు దగ్గర లేడు. ఆ అందమంతా అడవి గాచిన వెన్నెలే అయింది!

గుండెల్ని చీల్చుకు వచ్చింది యెంకికి వాళ్ళెరగని బాధ! ఆ బాధలో నుంచీ పుట్టుకు వచ్చింది-నరాలను జివ్వు మనిపించే పాట!

"ఈ రేయి నన్నొల్ల నేరవా రాజా!
ఎన్నెలల సొగసంత యేటి పాలేనటర!"

ఈ పాట పుట్టుకను గురించి చలం ఇలా వ్రాస్తారు.

"మెల్లిగా అర్ధ చంద్రుడు-ఎక్కడున్నాడో-నీళ్ళలో నవ్వుతో ఏటిని చక్కిలిగింతలు పెట్టటం ప్రారంభిస్తాడు. ఒక రోజున సుబ్బారావు గారిని తీసుకొచ్చాను-ఈ అందం చూప

దానికని. ఆయన హృదయం ఎంత కలవరపడ్డదంటే-వెంటనే నా ముందు పాట వ్రాశాడు-Red hot song in the making watch చేశాను నేను."

"ఒక్క తెను నా కేల ఓపజాలని సుకము!"

అంటుంది-ప్రపంచంలోని దిగులంతా, ఒంటరితన మంతా గూడు కట్టుకున్న దీనత్వం మూర్తి కట్టినట్లు ఎంకి.

మరి నాయుడు బావ! అతడి గుండెల్లో గూడు కట్టుకున్న గుబుళ్లెమిటో! ఏమి చేస్తున్నాడో! ఏమిపాటలు పాడుకొంటున్నాడో!

నాయుడు బావ: మంచివాడే పాపం! కాకపోతే

---

మనువాడక ముందే మనసు పారేసుకున్నాడు. అర్ధరాత్రివేళా, అపరాత్రివేళా, చేలచాటునా, మంచె మాటునా, ఏటిబడ్డునా యెంకితో గ్రంథం నడిపినవాడే! యెంకీ - తానూ - ఇద్దరికిద్దరు. ఒకరికోసం మరొకరు. మరోలోకం లేదు. 'ఆమెగాలి ఒక్కసారి విసిరినా చాలు' - అతడు రాజై పోతాడు. ఆమె 'చక్కదనం' - ఆమె 'యెంకితనం' - నాయుడి గుండెల్లో గూడు కట్టుకుపోయింది. ఆమెకోసం రాత్రిలకు రాత్రిలు తపన పడ్డాడు. విరహావస్థలన్నీ అనుభవించాడు. తరువాత ఆమెను మనువాడి బ్రతుకు సార్థకం చేసుకున్నాడు. ఆమెతో కాపురం చేసి కొడుకుని కన్నాడు.

సాధారణంగా, కోడెకారు వలపుకూ ప్రేమకూ-పెళ్ళి-స్వస్తివాక్యం పలుకుతుందని అంటారు. కాని. ఎంకి-నాయుడు

బావల మధ్య ప్రేమ - పెళ్ళితర్వాత మరింత దృఢమైన అను బంధంగా మారింది. కష్టాన్ని, సుఖాన్ని. వెన్నెలని, చీకటిని-కలిసి అనుభవించారు. ఆ అనుభవంలో వాళ్ళకు అలౌకికానందం దొరికింది. చివరకు రాధాకృష్ణుల ప్రణయంలా - వాళ్ళ ఇద్దరిమధ్య ఉన్న బంధానికి, అన్యోన్యతకు-అమరత్వం సిద్ధించింది.

<u>నాయుడి విరహం:</u> అతడి విరహం ప్రపంచానికి విరహం. ఎంకి కాస్సేపు కనిపించకపోతే వెఱ్ఱెత్తిపోతాడు. తిండి సయించదు.

"మామిడి తోటకెల్లి మంచీ పండొకటి కోసి
యేటొగాని నోట్లోస్తె - యిసమైపోయిందోలె!"

విరహావస్థలోని ఈ సున్నిత భావాన్ని ఎంత సూటిగా చెప్పుకున్నాడు!

"యేడ నువ్వుండావో యేళ్ళన్ని యీదారె!
యేటి సేస్తుండావో యీశ్మరుణ్ణడిగానె!"

ఆమెకోసం యేళ్లూ ఊళ్ళూ గాలించాడట! ఈశ్వరుడితో మొరపెట్టుకున్నాడట!

నిత్యం తోటలోనే పని చేసుకునే నాయుడికి 'తోట వూసంటేనే సికాకు' వేస్తుంది. యెంకితోటే తోట సోకంతా మాసిపోతుంది! ఎంకి దగ్గరలేక పోవటం తన కొక్కడి బాధే కాదు! 'మల్లెంటు మెల్లగా మారు మొగ మేయుటమే' కాక 'గొడ్డూ గోదా కూడా బెంగగొని చిక్కి పోయినా'యట!

"ఎంకి దూరానుండె యేటి దరి నేనుంటి"

ఏటి దరిన ఎంకి కోసం ఎదురు తెన్నులు చూస్తూ కూర్చొన్న నాయుడికి ఏటిని చూస్తే ఏమిటో గుబులు !

"ఏటి కడుపున దాగి తోట నిదరోయింది !"

అంటాడు.

తన దీనావస్థకు తనమీద తనకే జాలి !

"ఆలనా నా పాదకు పాలనా యనుకొంటి !"- అంటూ పాడుకుంటాడు ఒంటరిగా కూర్చుని.

తోటకూ నిద్ర వచ్చింది. ఏటికీ నిశ్చలత్వం సిద్ధించింది. తానుమాత్రం ఒంటరిగా తన గోడును అర్థరాత్రి నిశ్శబ్దానికి వలపోసుకుంటాడు.

" ఆ లోయలా యేరులా లోకమే వేరు "

అంటూ ఆనాటి కథలన్నీ తవ్విపోసుకుంటాడు.

ఎడబాటులో ఎంత వేదన ఉంటే - కలయికలో అంత కమ్మదనం ఉంటుందికదా ! ఎట్టకేలకు యెంకి తన దగ్గరకు వచ్చేటప్పటికి గుండెల్లో గూడుకట్టిన దిగులంతా చెల్లాచెదురవుతుంది. ఎంకితో సరదాలు, ఎంకితో సరసాలు, ఎంకితో పడవ షికార్లు, ఎంకితో తీర్థయాత్రలు - ఇవన్నీ మొదలు మళ్ళీ.

నాయుడి కలలు : వాస్తవం కంటె కల కమ్మగా ఉంటుంది. తాను అప్పటిదాకా అనుభవించిన విరహంలోనూ ఒక వింతకోర్కె నాయుడికి !

"పిల్ల పొరుగూరెల్లి - మల్లి రాలేదని
వొల్లంత వుడుకెత్తి వొక్కణ్ణె పడుకుంటె
ఘల్లుమంటా యెంకి కాలుపెట్టాలి !"

ఇవన్నీ పిల్ల సరదాలు ! కలలో కనిపించిన యెంకి, కళ్ళు తెరిచేటప్పటికి-కళ్ళముందు మెరుపులా కనపడితే-ఎంత ఆనందం !

అసలు నాయుడికి యెంకి దగ్గర లేకపోతే నిద్దరేరాదు. వొస్తే గిస్తే, ఆ నిద్రలో అన్నీ యెంకిని గురించిన కలలే ! 'కడుపులో చెయ్యేసి కదిపేసినట్లు' వెఱ్ఱి భ్రమలు !

" ఎడతెగని జలమంట నడమనో పడవంట
పడవెక్కి నా యెంకి పయన మయ్యిందంట !"

వెఱ్ఱి మమకారం ! వెఱ్ఱి కలలు ! పాల కడవెత్తుకొన్న యెంకి రూపే రూపు ! నాయుడికి చూడ రెండుకళ్ళూ చాలవు. జోడావులకు మధ్య, యేళ్ళరెంటికి మధ్య, కొండ కోనల నడుమ-యెంకిని చూచి చూచి మురిసి పోతాడు. వెలుతుర్లో ఆమె కళ్ళ తళ తళలు చూస్తుంటే-ఆమె మీద మనసు ఆపుకో లేడు. ఆ అందం చూస్తూ భరించ లేడు. అందుకే దీపాన్ని ఆర్పేయమంటాడు.

"జిమ్మ్మమంటా తోట సీకటై పోవాలి
సీకట్లొ సూడాలి నీ కళ్ళ తళ తళలు !"

యెంకి కళ్ళ తళ తళలు చూస్తుంటే నాయుడికి వెన్నెలకన్నా చీకటి కావాలనిపించింది!

"తళుకుతో నీ రూపు తలుసుకుని తలుసుకుని
సీకట్లో నాకళ్ళు సిల్లులడ సూడాలి!"

ఈ కోర్కెల అర్థం తెలిసిన వారికి ప్రణయ పరమార్థం తెలిసినట్లే!

యెంకిని యెదురుగా పెట్టుకుని నిద్దరోతాడు. నిద్రలో కలలు. ఆ కలల నిండా యెంకి. వాస్తవంకన్నా కల్పన అందంగా, సుఖంగా ఉంది.

"లేపకే నా యెంకి లేపకే నిదరా
యీ పాటి సుకము నే నింత వరకెరగనే"

"కలలో యెంకి కథలు చెపుతుంటే
కథలోని మనిషల్లే కాసింతలో మారి
కనికట్టు పనులతో కథ నడుపు తుంటే-"

కల కరిగి పోతుందేమోనని అతడి భయం! కలకాలం అదొక కమ్మని కలగా నిలిచి పోతే!

ఏమిటీ కలలు కనడం—ఎంకి ఎదురుగా ఉంటే! దీనికీ సమాధానం చెప్పుకుంటాడు తియ్యని వేదనతో-

"ఒక్క నేనే నీకు పెక్కు నీవులు నాకు!" .... అంటాడు ఆర్ద్రంగా.

కలలు కనడమే కాదు-కాయకష్టానికీ వెనుదీయడు అతడు యెంకి యెదురుగా ఉంటే-

"సిటికేసి కుంట కలుపుతాడు-"

"కళ్ళు మూసుకు నీరు మళ్ళకెత్తుతాడు!"

యెంకి మీదుగా వీచిన గాలి ఒక్కసారి విసిరినా చాలు.

'నిబ్బరంగా రాత్రంతా నిద్రపోతాడు!'

<u>నాయుడి సరదాలు</u>: కల కరిగి పోయాక వాస్తవం లోకి అడుగు పెట్టక తప్పదు. బ్రతుకులో కూడా ఎన్ని సరదాలు! సరాగాలు! యెంకితో పడవ ప్రయాణాలు, తీర్థ యాత్రలు-చేయాలని మనసవుతుంది నాయుడికి. యెంకితో తిరపతికి, భద్రాద్రికి, సరిగంగ స్నానాలకు, ఎక్కడకో, ఎక్కడెక్కడికో, దిగంతాలకు వెళ్ళాలని అతడి కోరిక!

'యెంకటేశ్వరుణ్ణి' అతడు కోరుకునేది ఒక్కటే!

"రేతిరి పగటేల రెప్పెయ్య కెంకినీ

సల్లంగ సూడమని సామితో సెప్పాలి!"

తనప్రాణంలో ప్రాణం-తనప్రాణాన్ని మించినప్రాణాన్ని భద్రంగా కాపాడమని భగవంతుణ్ణి అడిగే ప్రేమికుడి కోరిక!

పడవ ప్రయాణం చేస్తున్నారు ఇద్దరూ. గాలి ఎగర బోస్తూ ఉంది. యెంకికి నాయుడి పాట అంటే ఇష్టం. పాడ మంది. అతడు ఆ గాలివిసురుకు పడవ ఆపలేకుండా ఉన్నాడు. అందంగా మొదలు పెట్టాడు పాట.

"ఆపలేనే యెంకి ఈ పడవ యిసురు

పాడలేనే ఎంకి పదములీ రొదలో!"

పదం పాడలేక పోయినా, ఎక్కడ ఎప్పుడు ఏ పదం పడాలో అతడికి తెలుసు. అతడి మాటే పాట.

'కన్నుమంటా యేరు గాలి నెగదోసిందట!
బేటికురికే పాట నోట కొడతా వుందట !'

రెండే రెండు మాటల్లో ఆ గాలి హోరునీ, ఆ పడవ విసురునీ కళ్ళముందు పరిచి పెడతాడు !

తీర్థయాత్రికు వెళ్ళాలంటే, ఎంత సందడి ! ఎన్ని ప్రయత్నాలు ! ఎన్ని సమకూర్చుకోవాలి ! ఎన్ని కోరికలు కడుపు నిండా !

'కొత్త మడతలు తీసి కట్టుకోవాలి !
యెంకితో కొంగు కొంగూ కట్టుకోవాలి !
గోదారి గంగలో కరువు తీరా బుటక లేయాలి
రామకథలు వినాలి !
సామి వారికి దణ్ణం పెట్టి సాప సుట్టగా నేలబడాలి !"

ఆ సరికి ఆ దంపతులకు ఒక పిల్లాడు కూడా పుట్టాడు. వాడు చంకలో సంబరాలు పడుతూ ఎగురుతుంటే ఆ జంటకు ఒకే ఆనందం. దారి పొడుగునా ఊసులాటలూ కీచులాటలూ. కోనేట్లో స్నానం చేసి, గుడిచుట్టూ ముమ్మారు తిరిగే సరికి - వాళ్ళ జన్మ తరించిఀది. మనస్సు పులకరించింది, తనువుతో పాటూ మనస్సు కూడా శుళన చెంది-'కోపాలు తాపాలు' మానేసి-ఇద్దరూ కలిసి 'పిల్లోణ్ణి ఈశ్మరుడికి' చూపుతారు. వాణ్ణి పదికాలాల పాటు బట్టకట్టి బ్రతకనీయమని సామివారికి దణ్ణాలెట్టుకుంటారు.

నాయుడు నాటకాల రాయుడు। యెంకిని ఆట పట్టించటం అంటే అతడికి సరదా! ఊరెళ్ళి వస్తానని చెప్పి, వెళ్ళినట్లే వెళ్ళి, మారువేషం వేసుకొచ్చి-శకునం చెపుతానని యెంకి దగ్గరకు వచ్చాడు-పార్వతి దగ్గరకు జంగం దేవర వేషం కట్టి వచ్చిన శంకరుడిలా!

"ఈ రోజు నీ రాజు ఊరెళ్ళినాడంటి!
మొదల మీరీ యేటి మొగనె కలిశారంటి!
మెరుపల్లె పాలెత్తి మురిపించినాడంటి!
కొద్దిలో వరహాల కొడుకునె తేవంటి।
ఈ నిజము తేలికె యీనాము లిమ్మంటి।"

ఇన్ని కబుర్లతో జోస్యాలు చెపుతాడు అతడు. మరి అతనను కొన్నంత అమాయకురాలేం కాదు యెంకి! ఎన్ని వేషాలేసుకొచ్చినా, మొగుణ్ణి గుర్తుపట్టలేని తెలుగు పడుచు ఉంటుందా!

"ఉత్తమాటలు నీవి పొమ్మందిరా యెంకి
కొత్త పాటలు పాడుకొమ్మందిరా"

యెంకి టలాయింపుతో నాయుడు నాలుక్కరుచుకుని ఉంటాడు। ఆ వేషం విప్పేసి, ఆవిడ చెప్పినట్లు కొత్తపాటలు పాడటం ప్రారంభించాడు.

కొత్తపాటలు: నిజంగానే కొంతకాలం జరిగినాక

కొత్తపాటలు పాడుకోవటం మొదలు పెట్టారు యెంకి-నాయుడు బావలు! ఎంకికీ నాయుడు బావకీ కూడా-ఆ పల్లె

టూరి తనం స్థానే కొంత నాగరీకం వచ్చింది. మాటలో, మన్ననలో కాస్త హుందాతనం, ఉచ్చారణలో స్వచ్ఛత- వచ్చింది. పెద్దపెద్ద పలుకులు పలికేటంత ప్రౌఢత్వంవచ్చింది వాళ్ళు పాడుకునే పాటల్లోకి నీటూగోటూ వచ్చింది.

నండూరిలో దాగిన 'చదువుకున్న కవి' బయటికి వచ్చాడు. ఆయన కలం పాళీ బాణీ మారింది.

అంతటితో-యెంకి నాయుడు బావల "కత" కథగా మారింది.

"నెలవంక పలకలో నీరూపె గీతురా
తలవంచి సెలయేట ఆ రూపె సూతురా"

"పెదవి సివురాకులను కదిలింపగోరి
అడిగిందె అడిగేను ఆలకించేను !"

"పూవు నేనై తే-నీ వలపు నేనాదు
పూనిన్నె జగమంత ధ్యానింప జేతు !"

"కొంటె పటముల మీాల గొని రాసె నేడు
కోనేటి కిరణాల కుంచె కేరేడు !"

"ఎంకి జలకపు పలుకు లెచట నిడుకొందు
యెంత దాచిన చెణుకు లెగుగు నిందందు !"

"ఎంకి పూగెను కొమ్మ వుయ్యాలా చంద్ర
వంక పూగెను బొమ్మ వుయ్యాలా !"

ఇటువంటివే మరింకెన్నో పాటలు యెంకి పాటల సాహిత్యంలో వచ్చిన మార్పుకు తార్కాణాలు. భాషలో నాజూకు నేర్చినా, భావనలో అదేలాలస; అదే సౌకుమార్యం!

చిన్నమాటలో కొండంత బరువును పొదగటం, పలుకంత పదంతో ప్రణయ సామ్రాజ్యాన్ని ఏలించటం - యెంకి పాటల ద్వారా నండూరివారు సాధించిన అఖండ విజయం. ఒక్కొక్క పదంలోనూ ఎంత బిగువు! ఎంత విరుపు! సూటిగా గుండెల్ని తాకే శక్తి! ఆకాశం అర్ధరాత్రివేళ విరహిణితో పాటూ ఆవలించటం, ఏమూలో అణిగి పోవటం-అనేది ఎంత గుండెల్ని పిండివేసే భావన!

"ఎలుతురంతా మేసి యేరు నెమరేసింది
ఏటి కడుపున దాగి తోట నిదరోయింది"

ఇంతకన్నా ప్రజా హృదయానికి దగ్గరగా ఉండే కవిత ఉంటుందా!

చంద్రుణ్ణీ, వెన్నెలనీ, వెన్నెల రాత్రులనీ విరహంలో ఇష్టం వచ్చినట్లు తిట్టిన ప్రబంధ నాయిక లున్నారు మనకు. కాని, ఉదయించే సూర్యుణ్ణి కూడా తిట్టడం-తెలుగింటి ఆడపడుచు యెంకికే చెల్లింది!

"మల్లీ యెప్పట్లె తెల్లారబోతుంటె
సెందురుణ్ణో తిట్టు నా యెంకీ!
సూరియుణ్ణో తిట్టు నాయెంకీ!"

చంద్రుడు వెళ్ళిపోతేమాత్రం, మరి కాస్సేపు ఆగ కూడదా, ఏదో ముంచుకు పోయినట్లు సూర్యుడు ఉదయించి కన్నుల్లో పొడవకపోతేనేం ?

"కస్సుమంటూ యేరు గాలి నెగ బోసింది
బేటి కురికే పాట నోట కొడతావుంది"

రివ్వున వీచే ఏటి గాలి హోరంతా మన చెవుల్లో మారుమ్రోగుతుంది- ఈ పదం పాడుకొంటూ ఉంటే ।

ఇంత భావుకత ప్రతి గీతంలో, మరింకెంతో జాతీయత ప్రతి పదంలో —

కరిగి నీరౌతాది; సీమ సిటుకనగానె; పగబట్టు పామల్లె: కాకమ్మ స్నేతైన కబురంపడారాజు; కళ్ళు సిల్లులడ సూడాల: దిగులుట్టి; మూట ముల్లీ కట్టి; సాప సుట్టుగా నేల బడాలి; వుత్త మాటలు; పొద్దు; పొత్తు; పద్దాక —

ఇలా చెప్పుకొంటూ పోతే - ఇటువంటి పదాలు ఇంకెన్నో । తెలుగు ప్రజా జీవనంలో మాటా మంతీగా కలిసి పోయిన మాటలే ఇవి.

నండూరివారి కవిత్వం ప్రజా కవిత్వం. ఆయన వాక్కు ప్రజావాక్కు. ఏకథకైనా, కవిత్వానికైనా-మూలం వెతుక్కో వచ్చును కాని - యెంకి పాటలకు కవి హృదయం ఒక్కటే ఆధారం. నండూరి వెంకట సుబ్బారావు తెలుగుగడ్డపైన పుట్టటం, ఎంకి పాటలు తెలుగు పాటలుగా పుట్టటం- తెలుగు

వారి భాగ్య విశేషం. ఈ అపూర్వమైన కవిత్వం - తిక్కన కవిత్వం వలె, పోతన కవిత్వం వలె జానపదుల కవిత్వం వలె- చిరస్థాయిగా మనమధ్య నిలిచిపోయే నిధి వంటిది.

"ఏది నే పాడినా యెంకి పాట యనేరు
ఏ పదము లోనైన ఎంకి కళనె కనేరు"

అంటారు ఆ మహాకవి.

"యెంకొక్క దేవతై యెలిసెనంటారు
యింటింట పెడతారు ఎంకి నీపేరు !"

తెలుగు వారిలో రసజ్ఞత లోపించనంతకాలం యెంకి చిరస్థాయిగా నిలిచిపోతుంది. రసజ్ఞ హృదయాలను ఉయ్యాల లూగిస్తూనే ఉంటుంది. ఎంకి దేవతై వెలిసి, ఇంటింటా ఆడ పడుచై పుట్టి తెలుగు పాటలు పాడుకొంటుంది.

కవితో పాటు యెంకికి, యెంకితో పాటు కవికి ఆత్మైక్యం సిద్ధించింది.

యెంకి పాటలలోని ఎంకి-నాయుడుబావలు తెలుగు గడ్డపై పుట్టి పెరిగారు. వారి ఆటలో, పాటలో, మాటలో తెలుగుతనం ఉట్టిపడుతుంది. వారి ప్రేమ, విరహం, ప్రణయం, సరసం-అన్నీ ప్రతి నిత్యమూ తెలుగు జంటలకు అనుభూతి లోకి వచ్చేవే.

జాతి జీవనానికి అద్దం పట్టిన కథకనుక ఎంకి నాయుడు బావల కథ ఇంటింటి కథ. పెళ్ళితో, ప్రేమతో, పిల్లలతో, సంసారబంధంతో - ముడివడి నిత్యనూతనంగా సాగిపోయే తెలుగు కుటుంబ జీవనానికి ప్రతీక సాహిత్య పరంగా వెలసిన ఈ మధుర కల్పన. అందుకే-సాహిత్యంలో తెలుగు తనం కోసం వెదికి చూస్తే-ముందుగా మనకు మనస్సులో మెదులు తారు ఈ ముచ్చటైన జంట— * * *

# సంస్కృతి - స్త్రీలపాత్ర

సంప్రదాయాన్ని సంతరించుకోవటంలో, సంస్కారాన్ని మలుచుకోవటంలో, ఏ జాతి పండించుకున్న పంట ఆ జాతిదే। ఆ సంస్కార ధార జాతి జీవనంలో తరతరాలుగా ప్రవహించి వచ్చి ఆ జాతికి ఒక విలక్షణతను, ఒక ప్రత్యేకతను ఆపాదించి పెట్టే చైతన్య స్ఫూర్తి.

ఎన్నో సంప్రదాయాలను, సదాచారాలను తన దివ్య జీవన విధానంలో దర్శింప చేసుకుని, పునీతమైన తెలుగుజాతి సంస్కృతి-ఎంతో పురాతనమైనదీ, పరమోదాత్తమైనదీను.

అసలు సంస్కృతి-అంటే ఏమిటో-సంస్కారం అంటే ఏమిటో-ఒక్క మాటలో నిర్వచనం చెప్పపూనటం కష్టసాధ్యమైన పని. స్థూలంగా కవి వర్ణించిన తీరులో సంప్రదాయమంటే-

"అంత కడివెడు పాలపై
ఒక్కంత మీగడ పేరినట్లుగ
మనకు మిగులును గతము లోపలి
మంచి; అదియే సంప్రదాయము!"

—నారాయణరెడ్డి

జాతి జీవన విధానంలో, ఆహారవిహారాలలో, ఆచార వ్యవహారాలలో, వేష భాషలలో, సాంఘిక జీవనంలో, ఆధ్యాత్మిక చింతనలో-అన్నిటా మనం మన సంస్కృతిని దర్శించుకో వచ్చును. పరంపరాగతమైన ఈ ముల్లె-మనకు గర్వకారణమైన నిధి. దీనిని పరిరక్షించుకోవలసిన విధి మనకు ఉన్నది.

సామాజిక జీవితంలో-ఈ ఉత్తమ సంస్కృతీ పరిరక్షణకు ఆధార భూతమై నిలిచి, దానిని తరం తరువాత తరానికి ముల్లె ముడుపుగా అందిస్తూ వచ్చినది-అనాదికాలం నుంచి స్త్రీ జనమే.

పురుష ప్రపంచం వేరు. అతడి వ్యాపకాలు, వ్యావృత్తులు, వ్యవహారాలు-వేరు. వృత్తిరీత్యా ఎన్నో ప్రాంతాల వారితో జాతులవారితో-కలిసిపోయే అవకాశాలు ఉన్న పురుషుడు సంప్రదాయపు పరిధులలో ఇమిడి, వాటి కట్టుబడులకు అంతగా కట్టుపడి ఉండడు।

కాగా, ఏ జాతి సాంఘిక చరిత్రనైనా, తీర్చిదిద్దగల నైపుణ్యం-గతంలోని మంచిని మరుగున పడనీయకుండా కాపాడుకు వచ్చే గొప్పతనం-స్త్రీ జాతికే దక్కింది. సంఘ జీవనంలో కాలాన్ని బట్టి అనేక మార్పులు వస్తున్నా, నూటికొకరైనా మన స్త్రీలు తనదైన జాతి నిండు గర్వాన్ని పదికాలాల పాటు నిలువబెట్టగలుగుతూ ఉన్నారు. వారికి అంతటి స్థైర్యాన్నీ, స్ఫూర్తినీ-ప్రసాదించ గలిగినది మన హిందూ ధర్మప్రబోధితమైన నైతిక బలం.

అనాది కాలంలో మన సమాజం స్త్రీ పురుషుల సమానత్వానికి ప్రతీకగా ఉండేది. స్త్రీని దేవీ స్వరూపంగా, ఆది శక్తిగా, మాతృదేవతగా, భావించి-ఉన్నత స్థానం ఇచ్చారు మనవాళ్ళు. స్త్రీ-విజ్ఞురాలిగా, పండితురాలిగా, వేదాంత వేత్తగా కూడా రాణకెక్కిన కాలంలో-గార్గి, మైత్రేయి వంటి విదుషీమణులు మన సంస్కృతిని తీర్చిదిద్దారు.

స్త్రీని స్త్రీగా మాత్రమే భావించి స్థానం ఇచ్చుకున్న పాశ్చాత్య నాగరకతకూ, మన్ననతో స్త్రీని గౌరవించుకొన్న మన నాగరకతకూ అంతరం ఉంది.

ఆ నాటి తెలుగు మహిళ-కేవలం ఇల్లు దిద్దుకునే ఇల్లాలుగా మాత్రమే కాక, కవికోకిలగా, గాయకురాలిగా, నృత్య చిత్ర లేఖనాది లలిత కళల్లో ఆరితేరిన కళామూర్తిగా, రాజకీయ వేత్తగా, రాణిగా భాసించి, తన జాతికి ఎంతో కీర్తిప్రతిష్ఠలను చేకూర్చి పెట్టింది.

తెలుగు భాషలో రామాయణం వ్రాసిన మొదటి కవయిత్రి మొల్ల. "దేశీయ పదములు తెనుగులు, సాంస్కృతుల్ సంధులు మంజుల శబ్దవితతి శయ్యలు రీతులు" వంటి పాండిత్య ప్రకర్ష లేకపోయినా శ్రీకంఠమల్లేశ్వరుని వరంచేత కవిత్వం చెప్పబూనుకున్నానని చెప్పుకొన్న మొల్ల కలకాలం నిలిచే రమణీయ కావ్యంగా రామాయణాన్ని రచించి వాసికెక్కింది.

"చిన్ని వెన్నెల కందు వెన్ను దన్ని సుధాబ్ధి బొడమిన చెలువ
తో బుట్టు మాకు-
రహిబుట్ట జిత్రగాత్రిముల రాల్గరగించు విమల గాంధర్వంబు
విద్య మాకు"

అని సగర్వంగా చెప్పుకో గలిగిన సంగీత శాస్త్ర కోవిదులు ఆ నాటి మహిళలు. 18 వశతాబ్దము నాటికే స్త్రీలు నృత్యాభినయము నందు ఆరి తేరిన వారని ఉత్తర రామ చరిత్రిలోని ఈ పద్యం తెలుపుతుంది.

"అభినయంబుల కోపు లరుదైన తీరువుల్
వెలయగా 'పదచాళి' విధ మొకర్తు
లాగు మైసిరియు, పల్లిటియు, కత్రియు బెళుకు
విలసిల్లు 'జక్కిణి' విధ మొకర్తు
అలరి వినిపింప బతి మెచ్చనంత నేడ్వు
రిరువు రెన మండ్రు పదియారుగురును ముప్ప
దిద్దరిరువది నలువురు హెచ్చుగాక
బంతులై వంతులూని యయ్యెంతులెల్ల !"

అప్పుడు ఆంధ్ర దేశంలో సంగీత నాట్యకళలు మంచి ఉన్నత స్థితిలో ఉండేవి. మధ్యకాలంలో అడుగంటి పోయిన ఈ కళలను కళోపాసకులైన వారు నేటి కాలంలో సముద్ధరించే ప్రయత్నం చేస్తున్నారు.

కాకతీయ రాణి అసమాన ప్రజ్ఞాధురీణ. వీరవనిత. 12 వ శతాబ్ది ప్రాంతంలోనే ఈమె పురుష వేషధారియై

రణరంగంలో వీరవిహారం చేసి శత్రువులను తరిమి కొట్టి పదిహేను సంవత్సరాల పాటు ఎంతో విజయవంతంగా రాజ్యపరిపాలనం చేసిన వాసి గల రాణి.

ఈ విధంగా-తెలుగుజాతి వైభవం ప్రతిబింబించే ఆ సంస్కారధార ఆనాటి నుంచి మనకు ధారాదత్తమై వచ్చినదే!

"ఎక్కడ స్త్రీలు పూజింప బడుతారో అక్కడ దేవతలు ఆనందంగా ఉంటారు. ఎక్కడ పూజింప బడరో అక్కడ అన్ని క్రియలు ఫలశూన్యం అవుతవి"-అన్నది మనుస్మృతిలోని వాక్యం. ఏ కారణమైతేనేమి-భారతీయులు స్త్రీని దేవిగా భావించి పూజించటం మానివేశారు. సంఘంలో స్త్రీ స్థానం అట్టడుగుకు దిగజారి పోయింది. మధ్యకాలంలో వచ్చిపడిన మార్పు సంఘంలో స్త్రీ స్థానాన్ని అధోగతిపాలు చేసింది. అన్ని విధాలుగా ఆమె అస్వతంత్రురాలిగా అణచ బడి కేవలం వంట ఇంటి కుందేలుగా, బిడ్డల్ని కనియిచ్చే యంత్రంగా-తయారు చేయబడింది. విద్యాగంధంలేని వింత పశువుగా దిగజారి పోయింది.

"ఆడదై పుట్టేకంటే అడవిలో మానై-పుట్టడం మేలు" అని స్త్రీలు భావించుకోవలసి వచ్చేటంతగా స్త్రీల స్థితి దిగజారి పోయింది.

"ఆడ జన్మము బుట్టి అజ్ఞాని నైతి
గుఱ్ఱాల లోనైన పుట్టలేనయితి
యేనుగుల వలె నేను మరి పుట్టనయితి
బంటు వలె నేనుంచె బ్రతికయిన పోదు
పక్షులలో నయిన జన్మించనయితి !"

ఈవిధంగా శోకించ వలసిన పరిస్థితులు ఎదురైనవి స్త్రీకి. ఇంకా ఆ శోకం ఎట్లా ఉండేదటా!

"కాంతకీ కన్నీరు కాల్వలై పారె
వాన కురవ లేదె వరద ఎక్కడిది!
ఆడవారి శోకంబు అటువంటి దప్ప!"

పతనావస్థలో ఉన్న తమ గొప్పశక్తులను కూడ దీసుకొని ఆంధ్రస్త్రీలు తమ్ము తాము సముద్ధరించుకొనే ప్రయత్నానికి శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారు చేయూత నిచ్చారు. ఆంధ్ర మహిళోద్యమానికి రథసారథులై స్త్రీలలో ఉండే అజ్ఞానం, అవిద్య-పారద్రోలి వారిని మనుషులుగా తీర్చిదిద్దటానికి ఆయన ఎనలేని కృషి చేశారు. అప్పటి నుండీ అజ్ఞానాంధకారంలో మూలపడి ఉన్న స్త్రీకి చైతన్యం వచ్చి- అనేక విధాల అనేక రంగాలలో పురోగమించే ప్రయత్నం చేస్తున్నది. విద్యా విషయంలో పురుషుల కంటె స్త్రీలే మిన్నగా ఉండటం ఈనాడు తరుచు జరుగుతుండే విశేషం!

ఏ కాలంలో నయినా - గ్రామీణస్త్రీ-నాగరస్త్రీ; విద్యాగంధం లేనిస్త్రీ-విద్యాధికురాలయిన స్త్రీ - శ్రామిక వర్గానికి చెందిన స్త్రీ-శ్రీమంతురాలైన స్త్రీ- ఈ ఇద్దరిమధ్యా జీవన విధానంలో, విశ్వాసాలలో-ఎంతో అంతరం ఉంటూనే ఉన్నది.

అక్షర జ్ఞానం తక్కువగా ఉన్న గ్రామీణ స్త్రీ, మన ఆచారాలను, అనూచానంగా వస్తూ ఉన్న పద్ధతులను-ఆ నాటికీ ఈ నాటికీ కిమ్మనకుండా ఆచరణలో పెడుతూనే ఉన్నది. ఎటువచ్చీ, విద్యాధికురాలూ, నవనాగరికురాలూ అయిన స్త్రీ తాను అలవాటు చేసుకున్న విస్తృత మైన దృక్పథంతో, హేతువాద దృష్టితో-మన ప్రాచీన సంస్కృతిని విమర్శకు గురిచేస్తున్నది. చదువుకున్నదయినా, సంప్రదాయపు సంకెళ్ళను అంత తేలికగా వదిలించుకో లేని మధ్య తరగతి వనిత-ఏ కట్టుబాటులూ బంధించలేని స్వేచ్ఛా జీవనంతో-చాలామట్టుకు పాశ్చాత్యభావదాస్యానికి గురి అయిన, ఆర్థికంగా పై అంతస్తుకు చెందిన వనిత-ఈ ఇద్దరనూ సరిసమానంగా మనం ఈనాటి సమాజంలో దర్శించ వచ్చు.

మనిషికి ఒక వ్యక్తిత్వాన్ని సంపాదించి పెట్టేవి వేష భాషలు. వేషాడంబరంలో, మాట్లాడే భాషలో, ఉచ్చా రణలో, వ్యక్తి తనదైన జాతీయతను ప్రదర్శించటం జరుగు తుంది. ఏ ఎండకా గొడుగు పట్టక తప్పదన్నట్లు విజయ నగర సామ్రాజ్యాన్ని దర్శించిన శ్రీనాథ మహాకవి-అక్కడి వేషభాషలను వేయక తప్పలేదనీ-తాను వేసిన వేషాన్ని గురించి-

"కుల్లాయుంచితి, కోక చుట్టితి, మహా
కూర్పాసమున్ దొడిగితిన్ "

అంటూ వర్ణిస్తాడు. కాని ఆంధ్రుడి సహజమైన వేషం ధోవతి పంచెకట్టు, పైపంచె (కండువా), గ్రామీణ ప్రాంతాల్లో తప్ప ఇప్పుడా వేషధారణ అంతగా కనిపించదు. పాంట్, స్లాక్ షర్ట్-వేయటం ఇప్పుడు సర్వ సామాన్యమై పోయింది. ఈనాడు ఇంగ్లీషు చదువుకున్న తెలుగువాడు ఇంగ్లీషులోనే మాట్లాడటం (మరొక తెలుగువాడితోనయినా) సత్యదూరమైన విషయంకాదు!

అవసరం ఉన్నప్పుడు స్త్రీ అంద చందాలను, వంపు సొంపులను-అతి రమ్యంగా ప్రదర్శించగలిగింది – అవసరం లేనప్పుడు స్త్రీ సహజ సౌందర్యాన్ని గుప్తధనంగా దాచి పెట్టగలిగింది-తెలుగు వారి చీరకట్టు. ఆర్థికంగా ఉన్నత వర్గాలకు చెంది-అధునాతన నాగరకతను అలవరచుకొన్న కొంతమంది తప్ప-మన స్త్రీ జనం చీర కట్టును వదిలిపెట్ట లేదు.

బొట్టు, కాటుక, వాలుజడ, ఆ వాలుజడలో తురిమిన మల్లెలో మొల్లలో మాలలు-చెవులకు, ముక్కుకు, మెడ లోను-తగు మాత్రంగా ఆభరణాలు-తెలుగు పడుచు-అనగానే ఇదీ స్థూలంగా మదిలో మెదిలే రూపం.

తెలుగు కన్నె వాలుజడను గూర్చి కవికుమారుని భావన ఎంత అందంగా ఉందో చూడండి!

"కల కల లాడు వాలుజడకై జగమెంత
తపస్సొనర్చెనో తనయ!"

అది కన్నెపిల్ల వాలుజడను చూస్తే భావుకుడైన కవికి కలిగే పరవశానందం.

వెనుకటి రోజులలో స్త్రీలు ముఖానికి పసుపు రాసుకొని కాటుక పెట్టుకొనేవాళ్ళు. ఈనాటి పౌడర్లు, స్నోలు- అప్పటి ఆడవాళ్ళకు తెలిసి ఉండేవి కావు. కొంచెం ప్రౌఢలైన స్త్రీలు కొప్పు పెట్టుకొంటూ ఉండేవారు.

"ముంతంత కొప్పుమీద మూడు మల్లెపూలు".... సింగారించుకునే పల్లెపడుచు మన కావ్య నాయికలకు ఏమీ తీసిపోదు:

ఇంకా, వెనుకటి మన ఆంధ్రస్త్రీల అలంకరణ కన్నులకు కట్టినట్లు ఈ పద్యం చెపుతుంది.

"గొంటు పూసలు రెండుగుండ్ల మూంగరలు, మై
జారు చీరలు పైన సన్నగొలుసు
పెద్దసుట్టెలు, మట్టి పిల్లాండ్లు, బొబ్బిలి
కాయ లొత్తుల తోడి కడియములును
కప్పు పల్వారున లుంగరములు తూలెడు
కొంగులు బలు చెంప కొప్పులంచు
కమ్మ గవల్ సన్న కాటుక రేకలు
నాభినామంబులు నాను చుట్లు"

వేషభాషలలో ప్రత్యేకత సంతరించుకొన్నట్లుగానే- తెలుగు సంసారి ఇల్లు-అనగానే ఒకముద్ర వేసిన రూపం-పరిశుభ్రంగా ఊడ్చి, కళ్ళాపు జల్లి, ముగ్గులు పెట్టిన ముంగిలి:

పసుపురాసి కుంకుమబొట్లు పెట్టిన గడప, మామిడాకులో, బంతిపూల తోరణమో కట్టిన వాకిలి-మన మనోపథంలో మెదులుతాయి.

'ఇంటిని చూచి ఇల్లాలిని చూడు'-అనే అర్థస్ఫోరకమైన సామెత మనకు ఉంది. ఇంటి ముందలి శుచీ శుభ్రతా, ఇంటిలోపలి అలంకరణ, ఇంటి వాతావరణం-ఆ ఇంటి ఇల్లాలి చైతన్య ప్రతిబింబమే !

ప్రతి ఉదయమూ, ప్రత్యేకించి పండుగ సందర్భాల్లోనూ-ఇంటి ముంగిట రక రకాల రంగవల్లులు తీర్చిదిద్దటం-ప్రాచీన కాలం నుంచి మనకు లభించిన కళా విశేషం.

" ఈ రంగవల్లిక లేమి తెల్పెడి నయా
తెలుగు నారీ కళాధీన బుద్ధి !" —తుమ్మల

తెల్లగా తెల్లవారకుండానే తేటు గీతలతో తయారైన తలవాకిలి-తెలుగు గృహిణి చిత్ర కళాభిరుచికి అద్దంపట్టే అందమైన లోగిలి.

తెలుగు దేశపు పల్లెసీమలలో-ఇళ్ళలోను, ఇళ్ళ ముందు స్థలాలలోను, నేలను గోమయంతో అలికి-చదును చేసుకునే ఆచారం ఉంది. ఆ అలికిన నేలపైన తెల్లసున్నమూ, బియ్యపు పిండీ సమపాళ్ళుగా కలిపిన తెల్లని ముగ్గుతో-చిత్ర విచిత్రంగా రంగవల్లికలు తీర్చిదిద్దుతారు. ఆరీ ఆరని నేలపై అందంగా వేసిన ముగ్గులు ఆ నేల మళ్ళీ అలుకుకు వచ్చేటంత వరకూ ఆ విధంగానే నిలిచి ఉంటవి.

ఈ ముగ్గులను గీతలు గీసి పెడతారు. చుక్కలు పెట్టి కలుపుతారు. ఆ గీతలు కలపటంలో, ఆ మెలికలు తిప్పటంలో-ఒక వరుసా, క్రమమూ ఉంటుంది. గీతలకు ఒక హద్దూ, చుక్కలకు ఒక నిర్ణయమూ, ముగ్గుకు-ఒక ప్రయోజనము ఉంటుంది.

ఆ హద్దూ, నిర్ణయమూ సంప్రదాయానికి సంబంధించినది. ఆ ప్రయోజనం బహుళార్థ సాధకమైనది.

కంటికి ఇంపుగా ఉండే ఏ దృశ్యమైనా, మనస్సుకు స్పందన, ఆనందానుభూతీ-కలిగించేదిగా ఉంటుంది. ఈ రంగవల్లికల రచన రసానుస్ఫోరకమైనది. రమ్యభావనోద్దీపకమైనది.

ప్రపంచాన్ని ప్రభావితం చేసే గ్రహాల కదలికలకు, మానవ మేధస్సు నిర్మించుకున్న ఈ అల్లికలకు-సంబంధం ఉన్నదని జ్యోతిశ్శాస్త్రవేత్తలు అంటారు.

ఏ ముగ్గును ఏ విధంగా వేసినా, ఈ ముగ్గువేసే పద్ధతులు మాత్రం రెండే! బొటన వ్రేలు, చూపుడు వ్రేలు మధ్యగా కొద్ది కొద్దిగా ముగ్గు తీసుకుని కమ్మెచ్చున తీసినట్లు నాజూకైన గీతలు గీసుకు పోతారు చేతిలోకి మరికాస్త ముగ్గును తీసుకుని వ్రేళ్ళు మడిచి, వ్రేళ్ళ సందుగా ముగ్గుని వదిలి, ఒకే చలనంతో జంటగీతలు గీస్తారు. వీటిని 'కర్ర' లనడమూ కద్దు. తెలుగు బాలిక చిన్నతనం నుండీ ఈ ముగ్గును వేయుటం నేర్చి ఉంటుంది.

ఈ ముగ్గుకు ముఖ్యంగా ఉపయోగించే గుల్లసున్నం క్రిమిసంహారకమైనది. గోమయం కూడా అంత శక్తివంత

మైనదే! వీటిని ఈ విధంగా ఉపయోగించే తెలుగిల్లు వారి శుద్ధ్యానికీ ఆరోగ్య రక్షకూ పెట్టింది పేరు.

బియ్యపు పిండితో వేసే ముగ్గులు ఆంధ్ర పురంధ్రి జీవ కారుణ్య బుద్ధికి నిదర్శనం. చిత్ర రేఖలల్లిన చేతితో, చీమలకూ, చిరుపిట్టలకూ-చేయి విదిలించే ధర్మ దీక్ష ఆమెది.

ప్రతి ఉదయమూ విధిగా చేసే పనే అయినా, పండుగ రోజుల్లో ఈ వాకిలిముందు అలంకరణ మరింత శ్రద్ధతో చేస్తుంది తెలుగు గృహిణి. తన కళానైపుణ్యంతో, నేల పైన రత్నకంబళి పరిచినట్లూ, ముత్తెపు సరులను పేర్చినట్లూ భ్రాంతి కలిగిస్తుంది.

పండుగలలోకెల్లా, ముఖ్యమైన ముగ్గుల పండుగ సంక్రాంతి. ధనుర్మాసం నెలరోజులూ, ఇంటి ముంగిట మాత్రమే కాక, వీధి వీధంతా ఒక చిత్రశాలగా, కన్నుల పండువుగా అలంకరిస్తారు పల్లెసీమల్లో పడుచులు!

ఇంటి ముందు ఎంత పెద్దముగ్గు పెడితే అంత ఘనత! ఎంత అందంగా పెడితే అంత మెచ్చికోలు! ఎంత పోటీ పడి ముగ్గు పెడితే-అంత సాటివారిలో గౌరవం.

ఈ సంక్రాంతి ముగ్గులు ఎక్కువగా చుక్కలతో, కర్రలతో వేస్తారు. వీటికి ముచ్చటైన పేర్లున్నాయి. ఆధ్యాత్మిక భావనతో కూడిన ప్రయోజనం ఉంది. మన ఆశలు, మన కోర్కెలు, మన నిర్వేదాలు, మన ఆనందాలు-అన్నిటికీ ఈ ముగ్గులలో నిర్వచనం ఉంది. మానవ జీవితానికి దర్పణం పట్టే వ్యాఖ్యానం ఉంది.

తులసికి కోటలు కట్టి తొలిపూజ చేస్తుంది తెలుగు ఇల్లాలు. ముగ్గులతో మల్లె పందిరులు వేసి మల్లియలు పూయిస్తుంది. నెమలి పింఛాలు దిద్ది, నల్లనయ్యను నెమరుకు తెచ్చుకుంటుంది. రత్నకంబళ్లూ, చిరి చాపలూ పరిచి, పెళ్ళిపీటలు వేసి, సంక్రాంతి పురుషుడికి స్వాగతాలు పలుకుతుంది. గంధపు గిన్నెలూ, పన్నీరుబుడ్లూ, కుంకుమ భరిణలూ, పూలసజ్జలూ వాకిలిముందు పరిచి పూజకు మనసా ఆయత్తమవుతుంది. రామచిలుకలనూ, గరుత్మంతులనూ, కూర్మావతారాలనూ - రంగవల్లికలలో వాకిలి ముందు అవతరింప చేస్తుంది!

సంక్రాంతి రేపనగా-స్వర్గద్వారాలు తెరిచి ఉంచే గదుల ముగ్గు వేస్తుంది. పండుగ రోజున గుమ్మడి పండు ముగ్గు వేసి-'గుమ్మడేడే గోపిదేవీ!'.... అని పాడుతూ గుమ్మడిని ఆహ్వానిస్తుంది.

సంక్రాంతి వెళ్ళిన మరునాడు, కనుమరోజు-సంక్రాంతి రథం వస్తుంది ముంగిట్లోకి! గీతల రథాలు! చుక్కల రథాలు! ఎన్నెన్ని రథాలు! ఉత్తరాయణంలో ప్రవేశించిన సూర్య గమనానికి ప్రతీకలైన సూర్య రథాలు!

ముగ్గులలో నా గ బం ధం వేసి ఋతునైజాన్ని సుతారంగా చెప్పగలనేర్పరి తెలుగు పడుచు. పెనవేసుకుని ఒకదానితో ఒకటి మెలివడి పోయిన ఈ నాగరాజులను చూచిన వారికి- ఈ ఋతువులో చలిబాధచేత జనం ముడుచుకు పోవటం స్ఫురణకు వస్తుంది!

ఈ ముగ్గులకు పసుపు కుంకుమల అలంకరణలు. వాటిపై రంగు రంగుల పూలతో అలంకరించిన గొబ్బెమ్మల అమరికలు, గొబ్బి తట్టుతూ, పాటలు పాడుతూ - చుట్టూ తిరిగే తెలుగు కన్నెల సోయగాలు-ఇవన్నీ తెలుగుదనాన్ని తేట తెల్లం చేసే పరమ సుందర భావాలు. అపురూపమైన రూప కల్పనలు!

ఇంతటి భావనా బలంతో ఏర్పడిన ఈ రంగ వల్లికా రచన ఈ నాడు తెర మరుగున పడి పోతున్నది. అలుకు నేలలు తగ్గిన తర్వాత అల్లికల సొగసులు చాలవరకు తగ్గి పోయినట్లే!

కాని, ధనుర్మాసంలో—మన పల్లెసీమల్లో- ఈ ముగ్గుల వైవిధ్యం ఇప్పటికీ మనకు కన్నుల పండుగ చేస్తున్నది.

పట్టణాలలో సంగతి వేరు. తెల్లవారిన దగ్గర నుంచీ ప్రొద్దుక్రుంకేటంతవరకూ ఎన్నో వ్యాపకాలతో పరుగులు తీసే నేటి గృహిణికి ఈ ముగ్గులు వేసే నేర్పూ, ఓర్పూ- ఉండటం లేదనే చెప్పాలి. అడుగంటి పోతున్న ఈ రమణీయ రంగవల్లికా రచన గురించి నవనాగరకులైన మన యువతీ యువకులకు పరిచయం చేయాలనే తపనే-దీనిని గురించి ఇంతగా నాచేత వ్రాయించింది. కాని-కొంతలో కొంత మేలు-ఈ అద్భుతమైన కళాసంపద పల్లె పట్టులలో మాత్రం మన తెలుగు వాకిలిని వీడి పోలేదు.

ఆ నాటి మన ఇళ్లూ వాకిళ్ళూ ఎలా ఉండేవో శుక సప్తతిలోని ఈ పద్యం చెపుతుంది.

"అలికి ముగ్గులు పెట్టినట్టి తిన్నెలు, కంచు
బోరు తలుపులు, పాలు పోసి చాల
యూర్చుగ వచ్చు నవంగ నొనర చావడి, తళు
వారంబు, చిన్నిగవాక్ష మమరు
వంట కొట్టము, చిలువాన మించిన మిద్దె,
పట్టెమంచము తోడి పడుకటిల్లు,
వడసాల ముంగిలి పందిరి, పసిగాడి,
కాయధాన్యములున్న కణజములును
పెరటిలో నారికేళ జంబీర ముఖ్య
నిఖల ఫలవృక్షములు, మంచి నీళ్ళ బావి
నమర నయ్యింట నిత్యకళ్యాణములును
పచ్చతోరణములు మించ జరగు నతడు !"

ఆ గృహ వర్ణనతో పాటు-గృహలక్ష్మికూడా మన కన్నుల ముందు సాక్షాత్కరిస్తుంది.

మనకు ఎన్నో నమ్మకాలు, మరింకెన్నో ఆచారాలు-అనూచానంగా వచ్చి పాతుకు పోయినవి ఉన్నవి. బిడ్డ భూమి మీద పడినప్పటి జాత శౌచ కర్మల దగ్గర నుంచీ, వివాహపు వేడుకల వరకూ-ఎన్నెన్నో రసవత్తర ఘట్టాలు ఉన్నవి, నిగ్గు తేల్చి చూడాలని తరిస్తే, ఎన్నోలోతులు తరిచి చూప గల ఆచారాలు ఇవి.

ఆ కాలంలో స్త్రీలకు ఐదువతనముతో పాటు సంతాన భాగ్యం అతి ముఖ్యంగా పరిగణింప బడుతూ ఉండేది.

36)

ఎక్కువమంది బిడ్డలను కనిన స్త్రీ-పుణ్యమూర్తిగా సంఘంలో గౌరవింప బడేది. సంతానం లేని వారికి పున్నామ నరకం ప్రాప్తమవుతుందని శాస్త్రాలలో వ్రాసి నందునో ఏమో-సంతానం లేని స్త్రీని చిన్న చూపు చూడటం-అవమానించటం-పరిపాటి అయిపోయింది.

"కొడుకులు కననాళ్ళ కడుపేమి కడుపు
కుల ముద్ధరించని కడుపేమి కడుపు!"

అంటూ సంతాన హీనురాలైన స్త్రీని ఈసడించే వారు. సంతానం-అందులోనూ మగ సంతాన మయితే మరీ మంచిది!

"కంటేను తొలి చూలు కొడుకును కనాలి!"... అన్నది దంపుళ్ళ పాటలో ముక్కమాత్రమే కాదు! ఆనాడు ప్రతి స్త్రీ కోరుకునే వరమే ఇది।

సంతానం కోసం ఎన్నో పూజలూ పునస్కారాలూ చేసేవాళ్ళు। అవి ఇట్లా ఇన్నిరకాలుగా ఉండేవట!

"ఉపవాసంబులు, సత్యధర్మ మహితో
ద్యోగాది కృత్యంబులున్
జపముల్, విప్రకుటుంబ భోజనములున్,
శాంతుల్, పయస్సత్రిముల్
తపముల్, దైవత పూజన క్రియలు, తీ
ర్థ స్నానముల్, దానముల్
విపరీత ప్రతి బంధ మోక్షణ విధుల్
వేమారు గాలించుచున్!

ఈ పూజలన్నీ భార్యా భర్తలు కలిసి చేసే వయితే స్త్రీలు గుళ్ళచుట్టూ పొర్లు దణ్ణాలు పెట్టటం, ఉపవాసాలు ఉండటం- ఎన్నో కఠోర నియమాలు అనుసరించటం చేసే వారు. వారు సంతానం కోసం పడేపాట్లు ఇన్నీ అన్నీ కావు. ఆ కాలంలో స్త్రీలు సంతానం కోసం ఏమేమి చేసే వారో శ్రీనాథకవి తన శివరాత్రి మహాత్మ్యంలో వివరించాడు. ఈ పద్యంలో యీ విషయం వివరంగా తెలుసుకోవచ్చు.

"భక్తితో మాతృకా భవనంబులకు నేగు,
కావించు నతిథి సత్కారములను
వాయసంబులకు నిర్వర్తించు దధిబలి,
కొలుచు జ్యేష్టా దేవి నలఘు మహిమ
చదివించు కొను పుణ్య సంహితా వ్రాతంబు
మూలికా మాణిక్యములు ధరించు
తన్వంగి గంధాక్షతలు చిరంటులకిడు
విప్రశ్నికల గారవించు దరచు,
కుమ్మరావంబు కడవలు కొల్లవిడుచు
బాలురకు తియ్య పండులు పంచియిచ్చు
చెలులు తానును వ్రతములు సలుపు చుండు
తామరస నేత్రి పుత్రి సంతాన కాంక్ష!"

కాలంతోపాటు నేటి సంఘంలో స్త్రీల దృక్పథం కూడా కొంతవరకు మారింది. ఈనాడు సంతానం కోసం స్త్రీ ఇన్నిపాట్లు పడనక్కర లేదు. అధిక జనాభాతో

భారం ఎక్కువైన మన దేశంలో ఆదరణకు నోచుకోని అనాథ బాలబాలికలు ఎంత మందో! వారిని అక్కున చేర్చుకుని మాతృత్వం అందిస్తే, సంతానహీనులకు అపూర్వమైన మాతృత్వం సిద్ధించినట్లే!

జోలపాటలలో వేదాంతార్థాలు నిక్షిప్తం చేసి, ఆట పాటలలో విజ్ఞానాన్ని రంగరించి పిల్లలను పెంచేది తెలుగు తల్లి.

"రామలాలి మేఘ శ్యామ లాలి
తామరస నయన దశరథ తనయ లాలి"

అని ఊయెల ఊపినా,

"జో అచ్యుతానంద జో జో ముకుందా
రార పరమానంద రామగోవిందా।"

అని పాడినా-బిడ్డలకు పసితనంలోనే భగవన్నామ స్మరణం వంట పట్టేది.

"తొలుత బ్రహ్మాండంబు తొట్టెగావించి
నాలుగు వేదాలు గొలుసు లమరించి
చెలువైన ఫణిరాజు పాను పమరించి"

అని పాడే తల్లి బిడ్డకు నిద్రతో పాటూ ఆధ్యాత్మిక చింతన నేర్పుతుంది!

పాటలు పాడుతూ ఆటలు ఆడుకోవటం తెలుగు వారికి ప్రత్యేకమైన పద్ధతి.

మాటలు అప్పుడే నేరుస్తున్న మూడేళ్ళ పాపడి చేత చప్పట్లు ట్టిస్తూ—

"ఏనుగు ఏనుగు నల్లన
ఏనుగు కొమ్ములు తెల్లన
ఏనుగు మీద రాముడు
ఎంతో చక్కని దేముడు!"

అనే పాట నేర్పితే-ఏనుగు స్వరూపంతో పాటు-దేవుడైన రాముడు అందంకూడా తెలిసి వస్తుంది వాడికి.

కాని ఇప్పుడు-"జాక్ అండ్ జిల్ వెంటప్ ది హిల్!" అని చేతులు తిప్పుతూ చెప్పే తెలుగు బిడ్డడికి

'చేతిలో వెన్నముద్ద-చెంగల్వ పూదండ'....లో ఉండే భాషాసౌందర్యం తెలియదు కదా!

'ఓం నమః శివాయ'-అనే షడక్షరీ మంత్రంతో-బిడ్డలకు అక్షరాభ్యాసంతో పాటు ఆధ్యాత్మికాభ్యాసం చేయించే ఉత్తమ సంప్రదాయం మనది. జ్ఞానభిక్షను పెట్టే గురువును సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపంగా తలచి పూజించు కునే మహోత్కృష్ట భావన మనది.

కాలక్రమంలో వచ్చిన మార్పుల ఫలితంగా, నేటి మన నాగరిక సమాజంలో-తెలుగు బిడ్డలకు 'అ. ఆ లు' నేర్చుకోవటం కన్నా ఎ. బి. సి. డి. లు నేర్పటం ముఖ్యం-అనే భావన పెరిగింది. ఆప్యాయతా, దగ్గరతనమూ సూచించే అచ్చ తెలుగు పదాలైన-అమ్మ-నాన్న-అని బిడ్డలచే పిలిపించు కోవటం కూడా మోటుతనం అనుకోవటం పరిపాటి అయిపోయింది!

వెనుక మనవాళ్ళు వివిధ సందర్భాలలో జరుపుకునే వేడుకలు ఎన్నో ఉండేవి. కాని నేటి స్త్రీలకు వాటిపట్ల ఆసక్తి, ఉత్సాహమూ ఉండటం లేదు. అందుకు కావలసిన సమయం అంతకన్నా ఉండటం లేదు. ఈ యాంత్రిక యుగంలో, ఆ అచ్చటలూ ముచ్చటలూ అర్థంలేని పనులు గానే పరిగణించ బడుతున్నవి.

అడుగడుక్కూ సంప్రదాయపు కట్టుబాటులలో కట్టు పడి పెరిగే తెలుగు కన్య చాలా మట్టుకు స్వతంత్రాభి ప్రాయాలు తెలియని సిగ్గరిగానే ఉండి ఉంటుంది. ఆమె ముగ్ధ త్వాన్ని గురించిన ఒక మనోహరమైన కల్పన–

"కాలి వ్రేలి తోడ నేలను వ్రాయుచును కాంత తా తల
ఎత్తదూ
పయట సవరించుచును పాపటా యొత్తుచును కాంత తా
తల యెత్తదూ
మురుగు లొత్తుకొనుచు కొప్పు సవరించుచు తరుణి తా
తల యెత్తదూ
ముఖముపై చెమటను ముదముతో తుడుచుచు సఖియ తా
తల యెత్తదూ"

కాని, ఈ నాడు ఆడపిల్లలు ఇలా తల ఎత్తకుండా కూర్చుంటే– చెల్లుబాటు కారు. చదువుతో వచ్చిన వ్యక్తిత్వ బలంతో వారు సగర్వంగా తలయెత్తుకుని నేటి సమాజంలో తిరగ గలుగుతున్నారు.

వివాహ విధులు కూడా మనకు లెక్కలేనన్ని ఉన్నవి. సాధారణంగా సాగిపోయే జీవితంలోకి కొంత స్వారస్యాన్ని చిలకరించేవి, సరస శృంగార రసోద్దీప్తిని పన్నీటి జల్లులా కురిపించేవి, స్త్రీ పురుష బాంధవ్యానికి అతిలోక దీప్తిని అందించేవి—ఎన్నో ముచ్చటలు, వేడుకలు. స్త్రీలు పెళ్ళిళ్ళలో ముఖ్య పాత్ర ధరించేవారు.

పెళ్ళిపనులు, ఎక్కువగా స్త్రీలే చేసేవారు. శ్రీనాథ కవి ఈ పెళ్ళి పనులు చేసే తీరును వర్ణించిన పద్యం చూడండి!

" పూజ కుండలు నిల్పె పువ్వుబోడి యొకర్తు
శుభ వితర్దిక చతుష్కోణములను
జాజాల పాలెల సర్వోషధులు నించి
ప్రోక్షించె నొక్క పద్మాక్షి జలము
కాంత యొక్కతె సన్నెకలు పాత్రరంబును
దోరించె వటశాఖ తోడ గూడ
పీఠకంబులు పెట్టె, బింబోష్ఠి యొక్కతె
మడుగు పుట్టము కప్పె నడుగు మునుగ!"

పెళ్ళి సన్నాహాలతో పాటు పెళ్ళికూతుర్ని అలంకరించటం కూడా కళాభిజ్ఞులైన కాంతా జనానిదే! పెళ్ళికూతురి చుట్టూ చేరి సఖియలు మేలమాడుతూ—ఆమెను ముస్తాబు చేసేతీరు కన్నులకు కట్టినట్లు వర్ణిస్తుంది ఈ పద్యం—

"బహు విధ పరిమళ భరితోదకంబుల చెలువంబు
శోభిల్ల జలకమార్చి
నిండారు పండు వెన్నెల సోయగము నవ్వు పసిడి కమ్ముల
వెల్ల పట్టు గట్టి
కబరి భారంబుఁ గన్నె చెంగలువలు పసమీర గొనలు
దోపంగ జెరివి
తీండ్రించు పసిడి దీధితులచే నమరెడు నవరత్నమయ
భూషణములు దొడిగి

మృగమదము గుంకుమంబును మేళవించి
గంధ సారంబు మైదీగె గలయ నలది
శ్రీలు మెఱయంగ బరిణయోచితము గాగ
సఖులు సింగారించి తెచ్చిరి చంద్రముఖని!"

—ప్రబంధరత్నావళి

కాని ఈనాడు పెళ్ళికూతుర్ని అలంకరించటానికి సఖులు అంతగా శ్రమపడనక్కరలేదు! పల్లెటూరి పెళ్ళి కూతురికి కళ్యాణం బొట్టూ, బుగ్గను చుక్కా తప్ప పెద్దగా అలంకరణ సామగ్రి అక్కరలేదు. పెళ్ళికూతురు శ్రీమంతు రాలూ, నవనాగరికురాలూ అయితే, ఆమెను మేకప్ చేసే బ్యూటీ పార్లర్స్-పట్టణాలలో కోకొల్లలు ఈనాడు!

పెళ్ళిలో పట్టుచీరల రెపరెపలు. చందనపు పూతల పరిమళాలు, సర్వాంగ భూషణాల ధగధగలు. చమత్కారపు సంభాషణలు- వీటన్నిటితో పాటు మెరుపు తీగెలలా మెదిలే స్త్రీలు ఉంటేనే అందం. ఆనాటి వరుస పాటలు, దండ్లపాటలు,

మంగళహారతులు, ఇవన్నీ స్త్రీలు తమకు తాముగా ఏర్పాటు చేసుకున్న వేడుకలలో భాగాలే! కాని ఈ రోజుల్లో ఎక్కడా అంతగా వినిపించవు ఈ స్త్రీల పాటలు! అవి నేడు అక్షర బద్ధం చేసి మన సారస్వతంలో మాత్రమే దాచుకోవలసిన సంపదలు అయినవి.

జాతి జీవన విధానానికి దర్పణం పట్టేది మన జానపద సాహిత్యం. ఈ పల్లెపాటలు చాలావరకు స్త్రీలు పాడుకొనేవి. ఈ పాటలనిండా తెలుగుతనం వెల్లివిరుస్తుంది. శృంగారమూ, లాలింపూ, సరసమూ, విరసమూ, కోపమూ, తాపమూ, విరహమూ, సహజీవనమూ, సామరస్యమూ, కరుణా, కావేషమూ, తృష్ణా, తమకమూ, మర్యాదా, మన్ననా–ఒక్కమాటలో చెప్పాలంటే అచ్చమైన తెలుగు పోకిళ్ళు ఇవ్వన్నీ. ఆకాశవాణివారు తమకు తోచిన బాణీలు కట్టించి అప్పుడప్పుడు పాడిస్తున్నవీ, సాహితీప్రియులు కొంతమంది సేకరించి ప్రచురిస్తున్నవీ–తప్ప–ఈ నాడు ఇతరత్రా ఈ పాటలు అంతగా వినరావటం లేదు. జానపదుడి నోటికి సినిమా పాట పట్టుపడినంతగా తుమ్మెద పదం అతకటంలేదు. అలాగే స్త్రీల పాటలు కూడా ఈనాడు స్త్రీలనోళ్ళకు ఇముడకుండానే పోయాయని చెప్పక తప్పదు! మంగళహారతి నోటికి వచ్చిన పిల్ల ఏదీ ఇప్పుడు!

తెలుగువారికి ముఖ్యములైన పండుగలు ఉన్నవి. వాటికి ఒక్కొక్క దానికి ఒక్కొక్క రకమైన ఆచరణ

విధానం ఉన్నది. వాటి వెనుక ఎన్నో కథలూ గాథలూ ఉన్నవి. నాగులచవితి, అట్లతద్దె, బతకమ్మ పండుగ-వంటివి స్త్రీలకు ప్రత్యేకమైన పండుగలు ఉన్నవి. వీటన్నిటినీ ఎంతో శ్రద్ధాసక్తులతో నియమబద్ధంగా జరుపుకునేవాళ్లు అనాడు.

"నాగుల్ల చవితికీ నాగేంద్ర నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి !"

అంటూ నాగేంద్రుడిని పుట్టలో నుంచి బైటకు రప్పించి పాలు ఆరగింప చేయగలిగినది ఆంధ్ర పురంధ్రి. తెల్ల వారగట్ల నిద్రలేవటం, చద్దన్నాలు తినటం, గోరింటాకు పెట్టు కోవటం, ఉయ్యాల ఊగటం-ఇవన్నీ గడిచిపోయిన తరంలో కన్నెపిల్లలు సరదా పడి చేసుకునే వేడుకలు.

మనస్త్రీలు పర్వదినాల్లో నోములు పట్టి, వ్రతాలు చేసి, ఉపవాసాలు ఉండి-సౌభాగ్యం కోసం, సత్సంతానం కోసం, సర్వమానవ కళ్యాణం కోసం-భగవంతుని ప్రార్థించే వారు. ఆ నోములు, వ్రతాలు, వాటి ఆచరణ విధానాలు-లెక్కలేనన్ని ఉండేవి. వీటి ఆచరణ వల్ల పిల్లలలో దైవ భక్తి, ధర్మానురక్తి, శీల సంపద - పెంపొందించుకొనటానికి తగిన బీజాంకురం జరిగేది. చిన్నతనంనుంచీ ఆటలు పాటలతో దైవభక్తి ప్రోద్బలములైన నోములు, పూజలతో పెరగటం వలన వారికి ఉల్లాస కరమైన, పారమార్థికమైన వ్యావృత్తి ఏర్పడి ఉండేది.

ఈ నాడు ఉన్నత విద్యాభ్యాసం, ఉద్యోగాలు-ఆర్థిక సమస్యలు, మారుతున్న దృక్పథంతో మెలిగే స్త్రీకి-ఈ

వ్రతాలూ, నోములూ అర్థం లేని మూఢాచారాలుగా తోచటంలో వింతలేదు. గ్రామాలలో అక్కడక్కడా ఇటువంటి నోములూ వ్రతాలూ బొమ్మల కొలువులూ ఆచరణలో ఉన్నవేమో కాని, చదువుకున్నవారు వీటికి స్వస్తి చెప్పి చాలాకాలమైంది.

ప్రతి పనినీ హేతువాద దృష్టితో విమర్శించ బూనిన నవ సమాజంలో పండుగలు జరుపుకోవటం కూడ కాల క్రమేణ సన్నగిల్లి పోతున్నది. అయినా, ఏదో తప్పనిసరి అన్నట్లు, నలుగురితో నారాయణా అన్నట్లు-మన వాళ్ళు పెద్దపండుగలను మాత్రం తోచినంతలో జరుపు కోవటం పూర్తిగా మానలేదు.

సస్యశ్యామల అయిన తెలుగుదేశంలో పుట్టిన మహిళ అన్నపూర్ణగా భాసించింది. తెలుగు జిహ్వకు ప్రత్యేకమైన చవులు కొన్ని ఉన్నవి. మన పచ్చడులు, ఊరగాయలు-ఆంధ్రేతరులు నోట పట్టలేనంత ఘాటు కలిగినవి. ముద్ద పప్పు, పప్పులో గురిగి, దాని నిండా కమ్మని నేయి-మన పప్పన్నానికి ప్రతీక. మన పెళ్ళిభోజనాలకు మచ్చుతునక ఈ పద్యం-

"అమృతోపమానంబులగు నన్నములతోడ బహువిధ
శాకసూపములతోడ
ఖాయసాపూప జాంబాలికంబుల తోడ విమల హయ్యంగ
వీనముల తోడ
పాడబంబులతో రసావళ్ళతోడను ఘనశర్కరా పానక
ముల తోడ

"కదళికా ద్రాక్షాది మృదు ఫలంబుల తోడ వడియాల
తోడ బచ్చడుల తోడ
ప్రకటముగ దుగ్ధ మధిత తక్రముల తోడ
ప్రియము దళుకొత్త షడ్రసోపేతముగను"

ఇలా షడ్రసోపేతమైన వంటకాలను వండనేర్చింది తెలుగు నారి. ఇప్పటికీ ప్రధానమైన మన ఆహారపుటలవాట్లు మారలేదు. అయినా, తెలుగు జిహ్వకు పరదేశపు చవులపై మోజు పెరగటంతో—కొత్త రకాలయిన ఇరుగు పొరుగు వంటకాలను కూడా నేర్చుకుని వంట నేర్చింది నేటి మహిళ. ఇది ఒక విధంగా విభిన్న జాతుల మధ్య సమైక్యతకు ప్రోది చేసే పోకడే!

అతిథి సత్కారాల మర్యాదలకు మన దేశంలో లోటు లేదు. అతిథికి 'రండి రండి' అంటూ సాదరంగా ఆహ్వానం పలికి, కాళ్ళుకడుగుకోను చెంబుతో నీళ్ళిచ్చి, ఆ పైన దాహం తీర్చుకోవటానికి మజ్జిగో మంచినీళ్ళో అందిస్తారు. ఇప్పుడా మన్ననకు ఆస్కారం ఉండటం లేదు. సరాసరి బూట్లకాళ్ళతో భోజనాల బల్ల ముందుకు వచ్చి కూర్చునే అతిథికి కాళ్ళు కడుగుకునే పని ఏముంది! టీ కప్పో, కోల్డ్ స్పాటో తీర్చే దాహానికి మజ్జిగా—మంచినీళ్ళతో ప్రమేయం ఏముంది!

తెలుగుజాతి ఆధ్యాత్మికంగా సుసంపన్న మైనది. త్యాగయ్య, అన్నమయ్య, క్షేత్రయ్య, గోపన్న—పుట్టిన దేశంలో భక్తి సంగీతానికి కూడా కొదువలేదు. దేవుడి పూజా

మందిరము, నిత్యదీపారాధన, పూజా విధులు-కొద్దిగానో గొప్పగానో ప్రతి తెలుగింటిలోను పాటింప బడుతూనే ఉన్నవి. ఈ పూజా విధులన్నీ - నియమం తప్పకుండా ఆచరించేది గృహలక్ష్మే !

తీర్థయాత్రలు, ప్రదక్షిణలు, మొక్కుబడులు, నాగ పూజలు, బాబాల ఆరాధనలు-ఇవన్నీ తదేక నిష్ఠతో, ఒకానొక మూఢ భక్తితో ఆచరించే వర్గం ఆనాడూ ఉన్నది, ఈనాడూ ఉన్నది. అయితే విస్తృతమైన విజ్ఞాన సముపార్జనతో, ప్రతిదానిని హేతువాద దృష్టితో విమర్శించి చూడ నేర్చింది-చదువుకున్న నేటి ప్రజ. తత్ఫలితంగా, మన ఆధ్యాత్మిక భావనా ధోరణులను ఇతర దేశాల వారు అనుసరిస్తూ ఉండటం, ఆయాదేశాల ఆధిభౌతిక దృక్పథం ( Materialistic outlook) మనం అలవడ చేసుకోవటం జరుగుతున్నది.

ఒకానొక కాలంలో-ఎంతో అవసరమైనవిగా, మార్గదర్శకంగా ఉండేవనుకునే ఆచారాలు కొన్ని నేటి కాలమాన పరిస్థితులలో ఇముడక పోవచ్చు. ఈనాడవి అర్థరహితమైన మూఢాచారాలుగా తోచవచ్చు. అవశ్యం అటువంటి వాటిని వర్జింపవలసిందే! నేటి శాస్త్రీయ వైజ్ఞానిక పరిశోధనల వల్ల దేశీయ సంస్కృతి కూడా కొంత మారటానికి అవకాశం కలుగుతున్నది. ఇది ఒక పరిణామదశ. ఈ మార్పు

తప్పని సరి ఏమో! కాగా, ఆధునీకరణ సంప్రదాయ సంస్కృతిని వెనక్కు నెట్టివేస్తున్నది.

ఈ కారణంగా మనది-అనే దేశీయతా ముద్ర ఈ కాలంలో చాలవరకు తగ్గిపోయిందనే చెప్పాలి. విదేశీయ వాసనలు మనకు వదిలించుకోలేనంతగా అంటుకు పోయినవి. మడికట్టుకు కూర్చోవటం ఎప్పుడూ వాంఛనీయమైన విషయం కాదు కాని, బొత్తిగా 'మనదీ' అనీ చెప్పుకోగల ప్రత్యేకత లేకుండా చేసుకోవటం - జాతి గొప్పతనం ఎరిగిన తెలుగు వాడికి తగని పని.

మన ప్రాచీన సంస్కృతిని మక్కికి మక్కీ పునః ప్రతిష్ఠితం చేయలేకపోయినా, పూర్తిగా విస్మరించటం ఆత్మ ద్రోహమే అవుతుందని అనక తప్పదు. గతాన్ని మనం స్మరించుకోవాలి. గతంలోని మూఢత్వం ఏదైనా ఉంటే, దానిని విడిచిపెట్టి-మంచిని మనం పరిరక్షించుకోవాలి. అది మనకు మార్గదర్శకం కావాలి. శతాబ్దుల పర్యంతం-ఎంతో నిష్ఠతో మన సంస్కృతీ సదాచారాలను ముల్లెముడుపుగా భద్రంగా కాపాడుకువస్తున్న తెలుగు నారి - ఈ నవ సమాజములో కూడా తేనెలూరే తెలుగు చరిత్రను ప్రపంచానికి తేట తెల్లం చేయాలి. * * *

# తెలుగు భాష తీపిదనం

"మహిమన్ వాగనుశాసనుండు సృజియింపం
గుండ లింద్రుండు దన్
మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్
మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపన్ సొంపు
పాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున తత్ప్రాగల్భ్య
మూహించెదన్"

— రామరాజ భూషణుడు

వేయి ఏళ్ళుగా తెలుగు జాతి వేయి విధాలుగా పండించుకొన్న సజీవ భాష తెలుగు భాష. ఆంధ్రభాష అమృతం వంటిదనీ, దేశ భాషలలో ఎన్నికను గడించిందనీ అనటానికి నిదర్శనం-శ్రీకాకుళక్షేత్రంలో వెలసిన శ్రీ ఆంధ్ర మహావిష్ణువే స్వయంగా శ్రీకృష్ణదేవరాయల వారికి స్వప్నంలో సాక్షాత్కరించి అన్న మాటలు-

"తెలుగదేల యన్న దేశంబు తెలు, గేను
దెలుగు వల్లభుండ దెలుగొకండ
యెల్ల నృపులు గొలువ నెరుగవే బాసాడి
దేశ భాషలందు దెలుగు లెస్స!"

కన్నడ రాయడైన శ్రీకృష్ణదేవరాయలవారిని కావ్యం కన్నడంలో కాక తెలుగులో చెప్పమనడానికి కారణం-తాను తెలుగు వల్లభు డవటమే కాకుండా, దేశ భాష లన్నిటిలోనూ తెలుగుకు విశిష్టత కూడా ఉంది కనుక-అంటాడు ఆ ప్రభువు.

ఆంధ్రమహావిష్ణువూ, క్రీడాభిరామకర్తా అనటమే కాదు, పాశ్చాత్య పండితులు సైతం తెలుగు భాషలోని తీపిదనాన్ని ప్రశంసించారు. పదాల ఉచ్చారణలో ఒక లాలిత్యం కలిగి, శ్రావ్యతా మాధుర్యంలో ప్రథమస్థానం వహిస్తుందని కాల్డ్వెల్ పండితుడు అన్న మాటలు ఇందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చును.

Telugu is the Italian of the East — అనే ప్రశంస కూడా పాశ్చాత్య పండితులదే! మాటలలోని అర్థం తెలియక పోయినా, వీనులకు విందు కలిగించే ఒకానొక రామణీయకత తెలుగు భాషకు ఉన్నదని నిరూపితమవుతుంది.

తెలుగు దేశంలో పుట్టడం, తెలుగు చదవడం, మాట్లాడటం, జన్మాంతర సుకృతి ఫలమని అప్పయ్యదీక్షితుల వంటి మహాపండితులు అన్నట్లు ప్రమాణముంది.

తనదైన తెలుగు భాష మాధుర్యాన్ని గురించి ఎన్నో మధురమైన పదార్థాలతో పోల్చి-అన్నిటి కన్నా మిన్న అయినది. అదేనని ఇలా నిగ్గు తేలుస్తాడు ఆధునిక కవి-

"మంచి గుమ్మడి కన్న దంచిన మెత్తని
క్రొవ్వడ్ల బియ్యము కూడు కన్న
మేల్ జహంగీరు మామిడి పండు కన్న సుం
కారిన లేసజ్జ కంకి కన్న
కమియ పండిన దాకకన్న, చక్కెర తగ
బోసి వండిన పాల బువ్వకన్న
రసదాడి కన్న, పనస తొన కన్న
జూరము కన్నను జున్నుకన్న
అలతి పెరతేనియల కన్న నామని తఱి
కొసరి కూసిన కోయిల కూతకన్న
ముద్దులొలికెడు జవరాలి మోవికన్న
తియ్యనైన దెయ్యది! యదే తెనుగు బాస!"

— ముదిగొండ వీరభద్రమూర్తి

నన్నయ నాటినుంచి నేటివరకు-ఆంధ్ర సాహిత్యం పలువిధాలుగా పుష్పించి, పరిమళించి, నవ నవోన్మేషంగా సాగుతున్నది.

సంస్కృతమే సకల దేశ భాషలకూ జనని అనీ, ఆ దేశభాష లన్నిటిలో-సంస్కృతంలో సమ్మోహన కరంగా కలిసి పోయే సమ్మేళన శక్తి తెలుగు భాషకు ఉన్నదనీ పండితుల అభిప్రాయం. తెలుగుకు-సంస్కృతంతో చెలిమి

చేసినా-అందులోని పారుష్యం తనకు అంటుకుండా-ఒక స్వతంత్ర భాషగా సరళగీతిలో తేలిపోయే నేర్పు ఉన్నది. ఎంతగా కలిసిపోయినా, తనదైన ప్రత్యేకత నిలుపుకో గలిగిన జీవద్భాష తెలుగు-అనటానికి ఎన్నో ఉదాహరణలు ఇవ్వవచ్చును. మచ్చుకు పారిజాతాపహరణం లోని ఈపద్యం-

"ఈసున బుట్టి డెందమున హెచ్చిన దవానలంబు చే
గాసిలి యేడ్చె ప్రాణ విభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపై చేల చెరంగిడి" ....

ఈ భాషల మిళాయింపులోని సౌలభ్యం వలన పదాల పొంకం శ్రవణానందకరమైనదిగా ఉంటుంది.

తెలుగులో మాట, అప్రియత్నంగా పలికిన పాట - అంతకు ముందునుంచే ఉన్నా, తెలుగు కవిత్వానికి గ్రంథస్థితి కలిగించింది తొలిగా కవిత్రయం వారే! పదకొండో శతాబ్దిలో భారతాన్ని ఆంధ్రీకరణం చేసి గ్రంథస్థం చేసిన వాగను శాసనుడికంటె పూర్వంకూడా తెలుగుభాష ప్రాచీన మైనదేనని శాసనాల ద్వారా మనకు తెలుస్తున్నది. కాని, నన్నయ భట్టారకుడు తెనిగించిన భారతంతోనే అక్షరబద్ధం చేయబడిన ఆంధ్ర సారస్వత చరిత్ర ప్రారంభ మవుతున్నది.

సంస్కృత పదభూయిష్టమైన కవిత్వమైనా, ధారా శుద్ధితో సాగిపోయే సరస పదజాలంతో కూడిన రచన నన్నయ విరచిత భారత భాగం. సంస్కృతంలో ఉన్న మహా భారతాన్ని, అందులోని నిరూపితార్థాన్ని - సర్వ జనులకూ అర్థమయ్యే విధంగా తెలుగులో వ్రాయుమని రాజకులైక

భూషణుడైన రాజరాజనరేంద్రుడు కోరగా, నన్నయ అప్పటి వరకు గాసట బీసటగా ఉన్న తెలుగును సంస్కరించి - భారతాంధ్రీకరణం ప్రారంభించి, తెలుగు కవితావిర్భావానికి మూల పురుషుడుగా ప్రఖ్యాతి పొందాడు.

"సారకథాసుధారస మజస్రము నా గళ పూరితంబుగా
నారగ గ్రోలుచున్ జనులు హర్షరసాంబుధి దేలునట్లుగా
భారత సంహితన్ మున్ను ద్విపర్వము లెవ్వడొనర్చె నట్టి వి
ద్యా రమణీయ సంధ్రకవితాగురు నన్నయభట్టు గొల్చెదన్!"

ఆదికవిని గూర్చి మారన కవి చెప్పిన ప్రశంసా పద్యం ఇది.

తన భాషలో ఉండే అక్షర రమ్యతను గురించి నన్నయ కవీంద్రుడు స్వయంగా తానే చెప్పుకొన్న మాటలు-

"సారమతిం గవీంద్రులు ప్రసన్న కలితార్థ యుక్తిలో,
నారసి మేలునా నితరులక్షర రమ్యత నాదరింప నా
నా రుచి రార్థ సూక్తి నిధి నన్నయ భట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్!"

ఆ విధంగా ప్రారంభమైన ఆంధ్ర సాహిత్యచరిత్రలో ఆ నాటి నుంచి వేల వేల కావ్యాలు పుట్టినవి. కొన్నిమాత్రం కాలం తాకిడికి నిలవకుండా పోయినా, ఉత్తమశ్రేణికి చెందిన కావ్యాలు, ప్రబంధాలు-నేటికీ చిరస్థాయిగా నిలిచి పోయినవి. అలా చిరంజీవిత్వం సంపాదించుకున్న కావ్యాల

లోని పద్యాలు కొన్ని తెలుగు వారి నోటపట్టి తరాలుగా నిలిచి పోయినవి.

మహాభారతం తర్వాత సంస్కృతం నుండి పురాణేతి హాసాలు, కావ్యాలు, సంప్రదాయ రీతిలో తెలుగులోకి అనువదింప బడ్డాయి. ప్రబంధ రచనం సాగింది. దేశి కవితా మార్గావలంబకులైన నన్నెచోడుడు, పండితారాధ్యుడు, తిక్కన, ఎఱ్ఱాప్రగడ, నాచన సోముడు, శ్రీనాథుడు, పోతనామాత్యుడు, విద్వత్ప్రభువు శ్రీకృష్ణదేవరాయలు, అల్లసాని పెద్దన, ఇతర అష్టదిగ్గజకవులు, మరింకెందరో మహా మహులైన కవీశ్వరులు ఆంధ్ర సరస్వతిని సర్వాలంకార భూషితను చేసి ధన్యులైనారు. శాశ్వత ప్రయోజనం కలిగిన ప్రాచీన సాహిత్యసంపద మనం కలకాలం పరిరక్షించుకోవలసిన నిధి వంటిది.

అన్ని కాలాలలోను సాహితీ స్రష్టలందరి పైనా సంప్రదాయ ముద్ర ఉంటుంది. ఈ సంప్రదాయాల పునాదుల మీద సరికొత్త ప్రయోగాలు మొదలైనాయి. కావ్యరచనా రీతులతోపాటు, శైలి, భాష, రీతి - అన్నిటా క్రమంగా మార్పు వచ్చింది. నేటి కవిత్వం నిజంగా ప్రజల భాషలో, ప్రజలకోసం, ప్రజల ప్రయోజనంకోసం ఉద్భ విస్తున్నది. ఇలా కొత్త ప్రయోగాలు చేసే నవయుగ కవితా ప్రయోక్తలు కొందరు జాతి పునాదుల మీద సాహిత్య సౌధాన్ని నిర్మిస్తే, మరికొంతమంది అధునాతన కవులు పాత జోలికి పోక పూర్తిగా కొత్త పోకడలతో కలం నడుపు తున్నారు.

చెప్పదలుచుకున్నది సూటిగా మాత్రమే కాక, సుందరంగా, అలంకారయుక్తంగా చెప్పటం కావ్య లక్షణమైతే, సూటిగా మనం మాట్లాడుకునే భాషలో అందరికీ అర్థమయ్యేటట్లు చెప్పడం నేటి కవిత్వ లక్షణం.

ఒక్కొక్క రకమైన కవిత్వానికి ఒక్కొక్క బిగి, జిగి, ఇంపు, సొంపు. భాషలోని ఈ మాధుర్యం ఏ శైలికైనా రాణింపు తెచ్చేదే !

మాట పుట్టినప్పటినుండీ ప్రజలనోటిలో నాని ఏర్పడిన పదజాలం ఏ భాషా చరిత్రలోనైనా తొలి కవిత్వమే అవుతుంది. ఈ కవిత అప్రయత్నంగా జానపదుడి నోటినుండి వెలువడే సహజసుందరమైన భాష. ఏవిధమైన అనుభూతికైనా అద్దంపట్టే ఈ పల్లెపదాలు అచ్చమైన తెలుగు నుడికారానికీ పదసౌందర్యానికీ మచ్చుతునకలు.

"వెల్లుల్లి పాయల్లు తోక మిరియాలు
వుడికించి యశోదమ్మ ఉగ్గు పోయంగ
మందాని తాగేడు మాయ కృష్ణమ్మ
చేదాని తాగేడు చిన్ని కృష్ణమ్మ !"

అంటూ జానపద భామలు చిన్న కృష్ణమ్మకు ఉగ్గు పోసుకుంటే —

"పాపనికి తలయంటి పసుపు బూసి
బోగుకాడించి హారి రక్ష పొమ్మలంచు
జలములోక కొన్ని చుట్టి రా జల్లి తోట్ల
నునిచి దీవించి పాడి రా యువిదలెల్ల !"

అంటూ, పోతన్నగారు పాపడికి తల యంటి ఉయ్యాలలో వేసే విధం అతి మనోజ్ఞంగా వర్ణిస్తారు.

"తలనంటి మేన జొబ్బిలగ జముర్వాసి
సకలాంగములు దిద్ది చక్కనొత్తి
జలకముల్ గోర్వెచ్చ జలములచే నార్చి
తడి బోవ కర్ణ రంధ్రముల నూది
చలువ సన్నపు పుట్టముల మేన దడి యొత్తి
పట్టు పొత్తుల మెత్తపడక నునిచి
నునుపైన కాటుక గను దమ్ముల ఘటించి
బొమలు దీరిచి యుక్క బొట్టు బెట్టి
పొదిగిలను చేర్చి పాలిచ్చి బుజ్జగించి
కెంపు రవ చెక్కడంపు నిద్దంపు సొంపు
నింపు నుయ్యాలలోన నిద్రింపు మనుచు
పాట పాడుచు నూచిరా పట్టి నపుడు !"

—మరింగంటి వేంకట నరసింహాచార్యులు

ఛందో బంధమైన కవిత్వంలోనూ ఇంత ధారాశుద్ధి-పదబంధ మాధుర్యం ! పల్లెపదంలోనూ, పద్యబంధంలోనూ కూడా అందంగా అమిరే చక్కనైన భాష తెలుగు భాష.

"సంకాశింబో దయాచల పంకజ సఖ కిరణ రాగ
పరిపూర్ణంబై, పంకేరుహ గర్భాండము
కుంకుమ నలిలంపు గ్రోవి కొమరున నొప్పెన్ !"

అంటూ, సూర్యోదయాన్ని పోతన కవీంద్రుడు సంప్రదాయ రీతిలో వర్ణిస్తే,

"పొడుస్తున్న సూర్యుడు పొన్న పువ్వు ఛాయ
క్రుంకుచూ భానుడూ కుంకమ్మ ఛాయ !"

అంటూ పల్లెపడుచు సూర్యోదయాన్నీ, అస్తమయాన్నీ తన పాటతో మన కన్నుల ముందు పరిచి పెడుతుంది.

ఆంధ్ర భాగవతంలోని పద్యాలు అమృతోప మానమైనవి. శ్రవణానందమే కాక, భక్తి రసానికి పరాకాష్ఠగా హృదయానందం కలిగించే కమ్మని కవిత–

"నల్లని వాడు పద్మనయనంబుల వాడు, కృపారసంబు పై
జల్లెడు వాడు మౌళి పరిసర్పిత పింఛము వాడు నవ్వు రా
జిల్లెడు మోము వాడొకడు చెల్వల మానధనంబు
దెచ్చె నో
మల్లియలార మీ పొదల మాటున లేడు కదమ్మ చెప్పరే."

తెలుగు పలుకుబడిలోని ఒడుపులు, ఒయ్యారాలు సంతరించుకున్న పూర్వ, ఆధునిక కవుల రచనలు ఎన్నెన్నో! ఉదహరించటానికి ఈ సంక్షిప్త వ్యాసం చాలదు.

తెలుగులోని సరళమైన పదజాలం, పదలాలిత్యం, సంగీతానికి సరిపోయి, గానానికి ఉపకరించింది. సుప్రసిద్ధ దాక్షిణాత్య వాగ్గేయ కారులంతా, తెలుగు భాషను అభిమానించి, అందులోనే కృతులూ, పదములూ అల్లు కొన్నారు. రాయప్రోలు వారి మాటలలో-

"తనగీతి యరవజాతిని పాటకులనుగా దిద్ది పరిల్లి"నది తెలుగు వాణి.

అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య, కంచెర్ల గోపన్న-మొదలైన వాగ్గేయ కారులు భక్తిపారవశ్యంతో పాడుకొన్న కృతులు తెలుగు లోనే!

అన్నమయ్య చిన్ననాటి నుండి ఆడిన మాట అమృత కావ్యంగా, పాడిన పాట పరమ కావ్యంగా-అమరిన వాడట!

"పచ్చ కప్పురమె నూరి పసిడి గిన్నెల నించి
తెచ్చి శిరసాదిగ దిగ నలది
అచ్చెరు పడి చూడ, అందరి కన్నుల కింపై
నిచ్చ మల్లె పూవువలె నిటు తానుండే స్వామి"ని

కూర్చి ఎన్ని పదములో అందముగా అల్లినాడు అన్నమయ్య.

ప్రతి పదంలోను రాగం, భావం, పొందికగా అమిరే విధంగా మువ్వగోపాల పదాన్ని రచించి తెలుగు వాణికి అలంకారం చేశాడు క్షేత్రయ్య.

ఎన్నో భక్తి పరమైన కృతులను రచించి, దాక్షిణాత్య కర్నాటక సంగీతానికి తెలుగును సంగీత భాషగా తీర్చిదిద్దిన

మహనీయుడు త్యాగయ్య. స్వర సాహిత్య సమ్మేళనం అద్భుతంగా కలిగించి, వీనుల విందైన, శాశ్వత ప్రయోజనం కల సంగీతం సృష్టించిన వాడు ఆయన. తమిళదేశంలో పుట్టి పెరిగినా త్యాగయ్య తెలుగువాడు. ఆయన పలికినది తెలుగు పలుకు. "పలుకవేమి నాదైవమా రామ!"— అంటూ, అచ్చ తెలుగులో ఆత్మనివేదన చేసుకున్న త్యాగయ్య తెలుగుకు సంగీత సుభగత్వం సమకూర్చిన మహనీయుడు.

సీతమ్మకు చింతాకు పతకం చేయించి పెట్టడమే కాక సీతమ్మనూ, రామయ్యనూ ప్రతి తెలుగింటా తన పదాలతో ప్రతిష్ఠింప చేసిన వాడు రామదాసుగా వాసి కెక్కిన కంచెర్ల గోపన్న. భక్త్యావేశంతో గానంలో భావం రంజితం చేసి మృదు మధురమైన పాటలు అల్లి పాడుకున్నాడు ఆయన. రామచంద్రుడితో మొర పెట్టుకున్నా, మాట్లాడినా, పోట్లాడినా, రామదాసు అచ్చ తెనుగునే వాడుకున్నాడు. అందుకే ఆయన పాట ప్రజా సంగీతమైంది.

"ఏ తీరుగ నను దయ చూచెదవో
ఇన వంశోత్తమ రామా!"

అనే పాట తెలుగు నాట ఇంటింటా తమదైవమైన రామచంద్రుడిని ఆర్తితో అభయం అడిగే పాట!

తెలుగులో-కవులు, రాజకవులు, కవయిత్రులు, శతక కర్తలు, వాగ్గేయ కర్తలు, జానపద గేయకర్తలు, మరిం

కెంతో మంది తేనెలూరే తెలుగు పదాన్ని తమ సాహిత్యంలో సంగీతంలో-నిక్షిప్తం చేసి ధన్యులైనారు.

ఏ విధమైన సాంప్రదాయిక సాధనం లేకుండానే నిసర్గ సుందరమైన పద్య రచనతో ఎంతో ఆత్మజ్ఞానముతో కూడిన లోక సత్యాలను చెప్పిన వాడు యోగి వేమన. నిజమైన ప్రజా కవిత్వం వేమనది. ఆట వెలదిలో అపూర్వ మైన సత్యాలను, నీతిని అందించిన తేట తెలుగు కవి ఆయన.

"ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు
జూడ జూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా
విశ్వదాభిరామ వినుర వేమ !"

అనే పద్యం నోటినిండా చదువుకోని తెలుగు వాడు ఉండడేమో !

తెలుగు భాష కాల గమనంతో పాటు ఎన్నెన్నో మలుపులు తిరిగి వైవిధ్యం కల అనేక ప్రక్రియలలో ఆరి తేరి, పరిపుష్టం అయింది. వచనం చలం వంటి వారి చేతులలో పడి పదును తేలింది. నవల, నాటకం, విమర్శ, కథ, వ్యాసం, జీవితచరిత్ర, వచన కవిత-ఇలా అనేక రూపాలలో అనంత త్వాన్ని అందుకునే విధంగా రూపు దిద్దుకుంటున్నది తెలుగు వాణి.

అయితే, ఇంతటి భాషా సంపద ఉన్నా, ఆధునికుడైన ఆంధ్రుడికి ఎందుకో తన భాషపైన అంత చిన్న చూపు!

తెలుగు పాఠం చెప్పే పంతులు గారిపై విద్యార్థులకు గౌరవం ఉండదు! అన్నిటి కన్నా వింత-ఇద్దరు తెలుగు వాళ్ళు ఎక్కడైనా కలిస్తే-వాళ్ళు తెలుగులో సంభాషించుకోక పోవటం! ఏ ఇతర భాషలో నయినా మాట్లాడుతారు కాని, ఉగ్గుపాలతో నేర్చిన తెలుగులో మాట్లాడటం ఏదో న్యూనతగా భావిస్తారు. ఈ భావన యువతరంలో ఎక్కువగా కనిపిస్తూ ఉంది తెలుగు వారు తెలుగు మీరటం అంటే ఇదేనేమో!

మాతృభాష పట్ల గౌరవం పెంపొందించుకో వలసిన అవసరం నవతరానికి ఉంది. పంచదార చిలక వంటి తెలుగు పలుకు తెలుగు జిహ్వపై చిందులాడాలి.

పారిజాత పుష్పం వలె సౌందర్యాన్నీ సౌరభాన్నీ స్వారస్యంగా వెదజల్లడమే కాదు-నిజంగానే-

"పరిమళము చెడదు, వాడదు
పరువము తప్పదు-పరాగ భరితంబై
నిరతము జగదేక మనోహరమగు" —నంది తిమ్మన

అన్నట్లు 'నా బాణి తెలుగువాణి'గా సర్వకాలాల లోనూ వర్ధిల్లాలనే ఆకాంక్ష నాది. * * *

'జడప్రాయంగా వున్న
అమిత జ్ఞానం కన్న
చైతన్యధామంలో వున్న
పరిమిత జ్ఞానం మిన్న'
అన్న కవితోక్తి
స్పందన సాహితీ సమాఖ్య
పురోగమన శక్తి

309

# స్పందన బంధువులు

| | |
|---|---|
| ఇంద్రగంటి వెంకట్రావు | విశాఖపట్నం |
| రెంటాల సంజీవరావు | విజయవాడ |
| మహమ్మద్ ఇస్మాయిల్ (కల్పనా ఛటర్జీ) | మచిలీపట్టణము |
| ఆర్. కె. నరసింహారావు | విశాఖపట్టణం |
| కె. యస్. వి. కె. శాస్త్రి | మచిలీపట్టణం |
| బి. యస్. ఆర్. ఆంజనేయులు | ఒంగోలు |
| సి. నారాయణరావు | మచిలీపట్టణం |
| పి. జగన్మోహనరావు | ,, |
| టి. ఉమామహేశ్వరరావు | విజయవాడ |
| సి. యన్. రంగస్వామి | మచిలీపట్టణం |
| చాపరాల బ్రహ్మానందరావు | ,, |
| ముసునూరి జగన్నాధరావు | ,, |
| పి. యస్. యన్. శాస్త్రి | హైదరాబాదు |
| దింటకుర్తి. అచ్యుతరావు | మచిలీపట్టణం |
| జి. ఆర్. కె. జగన్నాధరావు | ,, |
| ఐ. కృష్ణమూర్తి | ,, |
| పి. వి. ఆదిశేషు | మంచిర్యాల |
| సోమంచి యజ్ఞన్నశాస్త్రి | బొంబాయి |
| పరుచూరి నాగేశ్వరరావు | విజయవాడ |

| | |
|---|---|
| కల్చరల్ క్లబ్, పున్నమ్మతోట | విజయవాడ |
| టి. యస్. యస్. సుబ్బారావు | మచిలీపట్టణం |
| సి హెచ్. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి | అద్దంకి |
| పెండెం రవీంద్రరావు | హైదరాబాదు |
| కనకమేడల మాధవరావు | మచిలీపట్టణం |
| చలమలశెట్టి శేషగిరిరావు | ,, |
| దివాకర్ల వెంకటేశ్వర్లు | ,, |
| భావరాజు నరసింహారావు | ,, |
| భాగవతుల కుటుంబరావు | ,, |
| పెళ్ళకూరు జయప్రద | నెల్లూరు |
| వై. జె. సోమేశ్వరరావు | మచిలీపట్టణం |
| బి. శంకర శాస్త్రి | ,, |
| యస్. లీలావతి | ,, |
| దోరడ్ల రాధాకృష్ణమూర్తి | ,, |
| వడ్డి బాబూరావు | విజయవాడ |
| దేవళ్రాజు వెంకట సుబ్బారావు | మచిలీవట్టణం |
| కావూరి రాధాకృష్ణమూర్తి | ,, |
| యస్. వి. సుబ్బయ్య | ,, |
| వి. పూర్ణచంద్రరావు | వరంగల్ |
| కె. వాణీపతి శాస్త్రి | మచిలీపట్టణం |
| ఆర్. కోటేశ్వరరావు | ,, |
| ఐ. వి. రావు | ,, |
| యం. ఏ. పద్మనాభరావు | ,, |
| మద్దుల రామచంద్రరావు | ,, |
| ఏ. చలపతిరావు | ,, |
| జే. యస్. మూర్తి (విహా.) | కడప |
| టి. నారాయణ మూర్తి (శాలివాహన) | మచిలీపట్టణం |

| | |
|---|---|
| గుత్తికొండ సుబ్బారావు | మచిలీపట్టణం |
| సి. సాంబశివరావు | ,, |
| అన్నే లక్ష్మీసరస్వతి | ఇబ్రహీంపట్నం |
| కె. వి. ఆర్. స్వామి | మచిలీపట్టణం |
| కొండిపర్తి వీరబ్రహ్మం | ,, |
| మల్లాప్రగడ ప్రభాకరరావు | పామర్రు |
| బూదరాజు శ్యామసుందర్ | మచిలీపట్టణం |
| యం. రామలింగేశ్వరరావు | ,, |
| పి. గురురాజారావు | ,, |
| తుమ్మల జగదీశ్వరరావు | ,, |
| పి యస్. మూర్తి | కాకినాడ |
| యమ్. కృష్ణవేణమ్మ | ,, |
| ఆలూరి విజయలక్ష్మి | ,, |
| అర్జా పాండురంగారావు | మచిలీపట్టణం |
| పసుమర్తి రామకృష్ణారావు | ,, |
| మల్లాది సూరిబాబు | ,, |
| వలిపేటి నరసింహారావు | అనంతవరప్పాడు |
| పోతుకూచి వెంకటేశ్వర్లు | తెనాలి |
| కె వి కృష్ణకుమారి | హైదరాబాదు |
| వి కృష్ణారావు | విజయవాడ |
| జె. వి. యస్. శర్మ | మచిలీపట్టణం |
| కె. వసుంధరాదేవి | అవనిగడ్డ |
| పెరుమాళ్ళ వెంకటేశ్వర్లు | మైలవరం |
| చిట్టూరి యుగంధర్ | మచిలీపట్నం |
| ముక్తా సాంబశివరావు | అనంతవరప్పాడు |
| కొల్లూరి రామకృష్ణారావు | మచిలీపట్నం |
| పి. వేదవతి | హైదరాబాదు |

312

## మా రాబోవు ప్రచురణలు

1. గుడ్ మార్నింగ్ (మినీ కవితల సంపుటి)
   శ్రీ రావి రంగారావు

2. కథా సంపుటి
   శ్రీమతి డి. సుజాతాదేవి

3. కథా సంపుటి
   శ్రీమతి ఐ. వి. యస్. అచ్యుతవల్లి

స్పందన సాహితీ సమాఖ్య (రిజిస్టర్డ్)
26-162, బుట్టాయిపేట
మచిలీపట్నం-521001

